# బుద్ధదర్శనము - కృతి ప్రదానము

మధు సమయోద్గతంబులగు మల్లెల తావులకంటె తీయనై
యధిక సుఖాస్పదంబు, హృదయాబ్జ మరందము, మైత్రి యొక్కటే
మధురము, నీశ్వరీయమని మక్కువ దాని భజించువారె పె
న్నిధిఁ బరమాత్ము సర్వసఖు నెమ్మదిఁ గాంచి తరింత్రు సంసృతిన్.

వ్యవహార విజ్ఞానపరుఁడు దక్షుండన్న
నరసిరెడ్డి ఘటింప నయము జయము,
ప్రభుత నుద్యోగి నారాయణ రెడ్డియన్
దమ్ముండు ధర్మ తత్పరత మెలఁగ
కృషి సహకారియై పిన్నతమ్ముండు కృ
ష్ణారెడ్డి తగు పనుల్ శ్రద్ధ నడుప
త్రికరణ శుద్ధితో దివ్యజీవన పథి
పరమేశ్వరుని, దయాపరత నెఱిఁగి
కుశల కర్మల సేవించి కొఱఁతఁ బాసె
రామిరెడ్డి; రత్నంబుల రాణమించు
కొడుకు లీ నల్వురను గాంచి గురుతఁగన్న
లక్ష్మిరెడ్డి కృతార్థుఁడు లబ్ధయశుఁడు.
ధీరమార్దవార్జవ గుణస్థిరుఁడు రెడ్డి
వంశ చంద్రుండు జగతి నీశ్వర మహిమఁ
గాంచి సేవించు ప్రాజ్ఞుడు కర్మనిష్ఠ,
రామభక్తికి నెలవు మా రామిరెడ్డి.

మైత్రీ విహారియగు స
త్పాత్రుం డాతనికి "బుద్ధదర్శనము"ను దా
పత్రయ హారక గురు చా
రిత్రము నంకితము గాఁగ ప్రేమనొసగితిన్.

కరుణాఁ*ప్రశాస్త తెల్పె శుభగమ్యము శాంతిపదంబు, దానిమె ట్లరయఁగ మైత్రియుఁ గృపయు నర్హముదంబు, నుపేక్ష, వీనినే పరమ సుఖాస్పదంబులగు బ్రహ్మవిహారములంచుఁ జెప్పె, నా సరణిఁ జరించు ధన్యునకు సత్కృతి నిచ్చుట యర్హమే కదా!

కాళ సముద్ర గ్రామవాసి, నా బాల్య సఖుడు లక్ష్మి రెడ్డి కుమారుడు సహృదయుడు శ్రీ రామిరెడ్డికి స్నేహ నిర్భర హృదయముతో నీ కృతి సమర్పితము.

అనంతపురము,
16-3-62.

రత్నాకర బాలరాజు.

* బుద్ధ భగవానుఁడు.

# నివేదన

మానవ జాతి చరిత్రయందు జాతి, దేశ, కాల, సమయ భేద రహితముగ, దుఃఖ నివృత్తిని పరమ ప్రశాంతిని కలిగించు జ్ఞానమును పొందుట ప్రతి మానవుని 'జన్మహక్కు'గా ప్రబోధించిన మహనీయులలో బుద్ధ భగవానుడే మొదటి వాడు. మానవజాతిపై ఆయన ప్రేమ కారుణ్యములు అనుపమానములు. ఆ ప్రేమ కారుణ్యములు మానవజాతికి మాత్రమే పరిమితములైనవి కావు. నిరుపాధికముగ నా ప్రేమ మందాకిని సర్వ జీవరాశిపై ప్రవహించి విశ్వమునే పునీత మొనరించినది.

దుఃఖ పరంపరకు మూలమై, సంకుచిత ఆత్మభావకారణమై విశ్వజీవన సాగరమునుండి తన్ను ప్రత్యేక వ్యక్తిగా భావింపజేయు అవిద్యనుండి విముక్తి పొందించు ధర్మపథమును గౌతముడు ఉపదేశించినాడు. ఆయన పొందిన 'సంబోధి' సంప్రదాయములనుండిగాని, పుస్తకములనుండిగాని లభించునదికాదు. అది సాక్షాత్కారము. అవిద్యా విముక్తియే జీవనరంగమున మానవుడు సాధింపదగిన పరమ లక్ష్యము.

The path, Buddha pointed out was not merely the practice of Self-abnegation, but the widening of love. And there in lies the true meaning of Buddha's preaching. (Sadhana–P. 77).

భారత దేశమున శాక్య మునిచంద్రుని జీవితోపదేశము జాతి భేద దుర్వాదములను, మూఢ విశ్వాసములను తీవ్రముగ ఖండించి భారత జాతీయతా నిర్మాణమునకు మంగళాచరణమును – నాందిని – పలికినది. నిజముగ బుద్ధుడే భారతజాతి పిత. (Father of the nation).

పరమ ఋషుల ఉపనిషత్ సంస్కృతిని జనసామాన్యమున కందజేసి, ఆయన బోధ అధ్యాత్మక్షేత్రమునకూడ ప్రజాస్వామ్యమునకు దృఢమైన పునాదులు వేసినది. మానవైక్య ప్రేమ దర్శనమును అపూర్వ మనోహరముగ నిరూపించిన తథాగతుని జీవితబోధ మానవ జాతికి చిరంతన ఆశాజ్యోతి. నిష్కామ కర్మకు ఆయన జీవితము మధుర మంజుల వ్యాఖ్యానమని స్వామి వివేకానందుడు కీర్తించినాడు.

"He is the ideal Karmayogi, acting without motive, and the history of humanity shows him to have been the greatest man ever born, beyond compare, the greatest combination of heart and brain ever existed, the greatest soul power that has ever been manifested."

క్షత్రియ శౌర్య గుణములును, మహర్షి జ్ఞానమును, విశ్వ శుభమునకై ప్రాణార్పణ మొనరించు మహా త్యాగి కరుణా హృదయమును అపూర్వ సామరస్యము పొందిన గౌతముని వ్యక్తిత్వము మానవ హృదయాంతర్భాగములను స్పర్శించి చైతన్యమును పుష్పింప జేసినది. ఆ దివ్య సంస్పర్శ వలన జనులు అసాధ్యములైన త్యాగముల నాచరించినారు.

అడుగున పూడిపోయి, పైన పెరిగిన కలుపు గడ్డి వలన విస్మృతములైన వేదోపదేశములకు గౌతముని బోధ మరల జీవము పోసినదని గాంధీ మహాత్ముడు కీర్తించినాడు.

"Gowtama was saturated with the best that was in Hinduism and gave life to some of the teachings that were buried in the Vedas and which were over grown with weeds."

ఆయన ఆసియాజ్యోతి మాత్రమే కాదు; ఆదిత్య బంధువని, జగత్ చక్షువని కావ్యవర్ణన.

ఆదిత్య బంధోర్గోబ్ధైక సింధోః సముదయాదివ।
ప్రబోధ ముద్రామభజన్ సకలాః కమలాకరాః॥
(బుద్ధ ఘోష మహాకవి పద్య చూడామణి 9-28)

ఆదిత్య బంధువును, బోధ సాగరమునైన గౌతముని ఉదయము వలన సకల కమలాకరములు (సకల లోకములు) ప్రబోధముద్రను-వికాస చిహ్నమును- పొందినవని భావము.

లోకము దుఃఖమనియు దాని నుండి తప్పించుకొనుటయే మార్గమని బుద్ధోపదేశము. నిష్కర్మను, నిరాశా నిస్పృహలను బోధించు మతమని చాలమంది పాశ్చాత్య పండితులు ప్రమాదులై వ్రాసినారు. చరిత్ర గతి వారి అభిప్రాయము లసత్యములని నిరూపించినది. నిరాశా నిస్పృహలు బోధించు మతము శతాబ్దములుగా మానవ హృదయములలో సత్య జ్ఞానానంద దీపావళిని వెలయించి మనోరమ శిల్ప కళలను, మధు నిర్భరసాహితిని, విశ్వమంగళకరమైన మానుష ధర్మమును నిర్మింప సమర్థము గాదని వినయపూర్వకముగ వచించుచున్నాను.

జగన్మాన్యులైన అశోకాది సమ్రాట్టులు ఆ మహనీయ బోధవలన పరివర్తిత హృదయులై యుద్ధ విజయ విముఖులై ధర్మ విజయమునే కాంక్షించి తమ జీవితములను ధర్మమున కంకిత మొనరించిరి. పదుమూడవ శిలాశాసనమున అశోకుడు - దేవతా ప్రియుడు, ప్రియదర్శి-ధర్మ విజయమును కీర్తించినాడు; యుద్ధమునందు హతులైన వారిని గురించి శోకించినాడు.

"సోయ మత్రోజనో తద కలిగే హతోచ, ముటోచ అపవుఢ చ తతో శత భాగే వ సహస్ర భాగం వ అజ గురు మతం దేవనం ప్రియస.....ఇఛతి హి దేవనం ప్రియో స ౹వ భుతన అక్షతి, సంయమం సమచరియం రభసియే. అయిచ ముఖమత విజయే దేవనం ప్రియస యో ధ్రమ విజయ...యో సలధే ఏతకేన భోతి సవ్రతవిజయో సవ్రత పునప్రీతి రసో లధభోతి ప్రితి ధ్రమ విజయ...(13 వ శాసనము, షాబాజు ఘుర్హ్వా శిల.)

"కళింగ దేశ జనులలో శత భాగమో లేక సహస్ర భాగమో మృతులై యుందురు. కాన దేవతా ప్రియునికి శోకము గలుగుచున్నది. సర్వప్రాణి సౌఖ్యమునకై నిగ్రహముతో సమబుద్ధితో సంచరించుట ముఖ్యమైన విజయము. అదియే దేవనాం ప్రియుని ధర్మ విజయము...సర్వదేశముల యందు గలిగిన ఇట్టి జయము ప్రీతికరము. ధర్మజయమువలన గలిగిన ప్రీతి గాఢమైనది" అని భావము.

బోధి హృదయము నెఱిగిన వారు ప్రతి వస్తువును ప్రేమమయ హృదయముతో దర్శింతురు; ప్రేమయే బోధి హృదయ సారమని నాగార్జునుని బోధ.

"One who understands the nature of Bodhi-hridaya, sees every thing with a loving heart; for love is the essence of Bodhi-hridaya."
(Outlines of Mahayana Buddhism–Dr D.T Suzaki)

బాల్యమాదిగ గౌతముని జీవితోపదేశములు నన్నాకర్షించినవి. శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద, రవీంద్ర,

గాంధి, రాధాకృష్ణ పండితుడు మొదలైన మహనీయులు బుద్ధ గౌతముని పరవశులై కీర్తింపగా, నవీనులు కొందఱు ఆయన వేద నిందకుడని, నాస్తికుడని నవలలు కొన్ని రచించినారు. దుర్భ్రాంతియో మతద్వేషమో దానికి కారణమై యుండునని తలంతును. అట్టివారును నాయందు బుద్ధ గౌతముని గుఱించి సమగ్రముగ తెలిసికొనవలయునన్న శుభ జిజ్ఞాసను గలిగించి వంద్యులయినారు.

పాళీ సంస్కృత ఆంగ్ల గ్రంథములు చదివి గౌతముని వ్యక్తిత్వమును భక్తి భావమున అర్థము చేసికొన ప్రయత్నించితిని. ఆ అధ్యయన సాధన పరిణామమే నేను రచించిన బౌద్ధ యుగమును, బుద్ధ దర్శనమును. నా చేతనైనంతవఱకు, సమగ్రముగ, సంగ్రహముగ, సుందరముగ రచింపవలయునని ప్రయత్నించినాను. శ్రమజ్ఞులైన పండితులు ఈ రచనయందు కలిగిన దోసగులను సహృదయమున తెలిపిన కృతజ్ఞతతో సవరించుకొందును. వైశ్వ దేవతారూపమైన ఆంధ్ర జనతకిది ఆరాధన.

బుద్ధ భగవానుని గుఱించి ఎంత వ్రాసినను, అది అసమగ్రమే. ఆ మహాత్ముని ప్రజ్ఞాపారమితకు భక్తితో ప్రణమిల్లి, బుద్ధఘోష మహాకవి వాక్యముతో నా నివేదన ముగించుచున్నాను.

యస్యైక దేశం యతయోఽపి వక్తుం
నాలం బభూ వుర్నలినాసనాద్యాః
శాస్త్ర స్తదేతచ్చరితాపదానం
వక్తుం మనిషా మమమౌఢ్యమేవ

తథాపి తత్రాహిత భక్తి శక్త్యా
తదేతదాఖ్యాతు మహం ప్రవీణః
తథాహి తత్పాద సమాశ్రయేణ
రజోఽపి లక్ష్మీం కురుతేహి పుంసాం॥

(పద్య చూడామణి 1-2,3).

బుద్ధ భగవానుని చరిత్రమున అల్ప భాగముగూడ యతులును బ్రహ్మాదులును సైతము వర్ణింపజాలరు. అట్టి చరిత్రమును చెప్ప సాహసించుటకు మౌఢ్యమే కారణము. అయినను ఆ మహాత్మునియందు విన్యస్తమైన భక్తి శక్తివలన తచ్చరిత్ర కథనమునకు పూనుకొంటిని. ఆయన పాదసంబంధము వలన రేణువు సయితము నరులకు లక్ష్మీప్రద మగుచున్నది కదా! స్వయముగ తచ్చరిత్ర కథన నైపుణ్యము లేకున్నను, అమ్మహాత్ముని యందలి భక్తియే నన్ను నిపుణునిగా జేయుచున్నది.

బుద్ధ దర్శనమును సర్వాంగ సుందరముగ ప్రకటించిన శ్రీ సాహితీ సదనము – తిరుపతి వారికిని, ప్రియమిత్రుడగు శ్రీ సదాశివరెడ్డిగారికిని నా కృతజ్ఞత. ఈశ్వర కారుణ్యమునకు శరణాగతి.

బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి

అనంతపురము,
22-1-62.

రత్నాకర బాలరాజు.

# బుద్ధ దర్శనము - విషయానుక్రమణిక

| సంఖ్య. | విషయము | పుటం. |
|---|---|---|

## ప్రథమాధ్యాయము

అనుబంధము

# బుద్ధ దర్శనము

## ప్రథమాధ్యాయము

## (సవిచార మహాభి నిష్క్రమణ సిద్ధార్థము)

కరుణాపూరలహరీ పరీవాహిత చక్షుషే
భాగధేయ నిధానాయ భగవన్! భవతే నమః.

### భారతవర్ష వైభవము

అతి ప్రాచీనకాలమున మన దేశము పేరు 'అజనాభము.' భరతుడను రాజర్షి యీ దేశమును ధర్మనిరతితో పాలించుట వలన, ఆ రాజచంద్రుని పేర నీ 'యజనాభము' భారతవర్షమని ప్రసిద్ధి వహించినది. ఈ భరతుడు శకుంతలా దుష్యంతుల కుమారుడు గాడు; ఈతడు ఋషభదేవుడను రాజర్షి కుమారుడు.

భారతవర్షములో భగవంతుని యవతార మూర్తులని ప్రసిద్ధి పొందిన మహాత్ము లెందఱో జన్మించినారు. వారి జీవితోపదేశములు ప్రపంచమునకు వెలుగు బాటలను చూపించినవి. మహోన్నతములైన హిమాలయ శిఖరములు మన దేశపు విజ్ఞానమునకు, పవిత్రతకును జిహ్నములు. గంగా

యమునా గౌతమీ కృష్ణవేణీ పినాకినీ తుంగభద్రా కావేరీ జీవనదులు మన దేశమును సస్యశ్యామలము జేసి, దేశమాతను అన్నపూర్ణను జేసినవి.

**"సుజలాం సుఫలాం మలయజ శీతలాం**
**సస్య శ్యామలాం, మాతరం ॥వందేమాతరం॥**
**శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం**
**ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం**
**సుహాసినీం, సుమధుర భాషిణీం**
**సుఖదాం, వరదాం, మాతరం ॥వందేమాతరం॥**

అని మన భరతమాతను మహాకవి బంకించంద్ చటర్జీ ప్రస్తుతిగాన మొనర్చినాడు. ఈ గీతము మన దేశమాతను గురించిన దివ్యదర్శనము.

మన దేశపు మహా పురుషులలో బుద్ధభగవానుడు సుప్రసిద్ధుడు. ఆయనను గురించి తెలిసికొనుట దయను, సత్యమును, అహింసను తెలిసికొనుటయే.

## సుమేధ బ్రాహ్మణుడు

బుద్ధభగవానుని గురించియు, నతని యుపదేశములను గూర్చియు పాళీ భాషయం దనేక గ్రంథము లున్నవి. వానిలోని విషయములనే మన మిట సంగ్రహముగా తెలిసికొందము.

పూర్వము కొన్ని వేల సంవత్సరముల క్రిందట 'అమరావతి' యను పట్టణమున నొక సంపన్న బ్రాహ్మణ కుటుంబముండెను. సౌశీల్యమునకు, దానధర్మములకు నా కుటుంబము పేరెన్నిక గన్నది. ఆ కుటుంబములోని దంపతుల కొక బాలుడు

జన్మించెను. తల్లిదండ్రులు లా బాలునికి సుమేధుడని పేరిడిరి. కాని, దైవవశమున తల్లిదండ్రు లచిరకాలములోనే మరణించిరి.

సుమేధుడు చాల తెలివి గల బాలుడు. విద్యలను జక్కగ నభ్యసించి, మహనీయమైన వివేకమును సంపాదించెను. వివేకము వలన నాతనికి జ్ఞానవైరాగ్యములు లభించినవి. తత్ఫలితముగ సుమేధుడు తన సంపదలను పేద సాదలకు దానము చేసి, తపము చేసికొనుటకు హిమాలయ పర్వతములకు బోయెను. అచ్చట ధర్మక పర్వతమున నివసించి చెట్ల నుండి రాలిన పండ్లను, ఆకులను భుజించుచు తీవ్రమైన తపమాచరించెను. ధ్యాన బలము వలన సుమేధుడు గొప్ప సిద్ధులను సంపాదించెను. బౌద్ధ గ్రంథములయం దీ సిద్ధులు అభిజ్ఞలని చెప్పబడినవి.

## దీపంకర బుద్ధుడు

ఆ కాలమున మన దేశమున దీపంకరుడను మహా బుద్ధుడుండెను. ఆయన మహా జ్ఞాని. బుద్ధు డనగా గొప్ప జ్ఞాని యని యర్థము. దీపంకర బుద్ధుడు సరిహద్దు రాష్ట్రములో (ప్రత్యంత దేశ విషయము) రమ్యక నగర సమీపమున నున్న సుదర్శన మహావిహారమున కొన్ని దినములు నివసించెను. ప్రజలు మహా బుద్ధుడైన దీపంకరునికి స్వాగతము చెప్పుటకై నగరమును వైభవోపేతముగా నలంకరించిరి. దీప సహస్రములు వెలిగించిరి. అందువలన రమ్యకనగరము నాటినుండి దీపవతి యని ప్రసిద్ధి గాంచినది.

సుమేధ తాపసి గూడ మహాత్ముడైన దీపంకర బుద్ధుని సందర్శించుటకై వెళ్లెను. మహా బుద్ధుని తేజస్సును, కరుణను జూచి సుమేధుడు భక్తిపరవశుడై, తన జీవితమును వికసించిన కమలము వలె ఆయన చరణ సన్నిధిని సమర్పింప సంకల్పించెను.

## మణిఫలక సేతువు

తన దేహముపైన మహా బుద్ధుడైన దీపంకరుడును, నాతని శిష్యులైన అర్హతులును నడచిన తన జన్మము తరించునని తలచి సుమేధుడు మణుల సేతువు వలె వారి యెదుట సాగిలబడెను. ఆ సమయముననే తన మనస్సున, స్వీయ ముక్తినే కోరక, యనేకుల నజ్ఞాన సముద్రము నుండి తరింప జేయుటకు తాను గూడ బుద్ధుడు కావలయునని సంకల్పించు కొనెను.*

## మంచి సంకల్పము

మహా బుద్ధుడైన దీపంకరుడు తన జ్ఞానదృష్టి వలన సుమేధుని సంకల్పములను గాంచి 'తథాస్తు'ని యనుగ్రహించెను.

---

* బుద్ధుడనగా సుస్థిర జయశాలి, రాగద్వేష మోహాదులను నిర్విశేషముగ జయించినవాడు; లోక సామాన్య బుద్ధి కగోచరమగు మహత్పదమున వర్తించుచు అనంత దర్శనము బొందినవాడు. మోహజాలినియై విషరూపిణియగు తృష్ణకు బుద్ధుడతీతుడు. మనుష్యత్వము, పూర్ణాయువు, సద్ధర్మశ్రవణము, బుద్ధత్వమును దుర్లభములు. అట్టి మహనీయమైన బుద్ధత్వమును సుమేధుడు మనస్సున గాఢముగ వాంఛించెను. సమస్త ధర్మములును మనఃపూర్వంగములు, మనఃశ్రేష్ఠములు. అనగా సర్వ ధర్మముల యందును మనస్సు వ్యాపించియున్నది. మనస్సే ధర్మాచరణమున శ్రేష్ఠ స్థానమును

అనేక జన్మములలో పారమితలను (గొప్ప గుణములు) సాధించి మానవకోటికి జ్ఞానజ్యోతిని జూపి యజ్ఞానాంధకార మును బోదోలి చివరకు సుమేధుడు బుద్ధుడగునని, యాతని భావి జీవిత దశలను గూడ దీపంకరుడు తెలియజేసెను.

సుమేధుని యందు భావి బుద్ధుడు బీజాంకుర దశ నున్నం దున ప్రజలాతని బుద్ధ బీజాంకురుడని యనిరి.

## పది పారమితలు

బుద్ధత్వమును కాంక్షించిన ప్రతి వ్యక్తియు పారమిత లను గొప్ప సుగుణములను సాధింపవలయును. అవి-దానము, శీలము, నైష్కర్మ్యము, ప్రజ్ఞ, వీర్యము, క్షాంతి, సత్యము, అధిష్ఠానము, మైత్రి, ఉపేక్ష అనునవి. వీని నందరూ తెలిసి కొని యాచరింపవలయును. సుమేధు డీ దశవిధ పారమితల ననేక జన్మములలో సాధించెను. అతని దీక్ష మహనీయమైనది. అది అందఱకు ననుసరణీయము. దీక్షయే మానవజీవితము నర్థవంత మొనరించును. దీక్షా విరహితమైన జీవితము తంత్రీ విరహితమైన వీణతో సమానము. ఈ జీవిత కథా సమూహ మును జాతక కథలని యందురు.

పొందినది. కర్మలన్నియు మనోమయములు కావున ప్రసన్న మనస్సున సంకల్పించినను, భాషించినను, కార్యముల నొనర్చినను, అనపాయినియగు ఛాయవలె శివంకరమగు సుఖము మానవు ననుసరించును. సుమేధుని మాన సము నిర్మలము కాననే యాతడు శుభమందెను.*

*మనో పుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా
మనసాచే పసన్నేన భాసతి వా కరోతి వా
తతో'నం సుఖమన్వేతి ఛాయా' వ అనపాయినీ
(ధమ్మపదము 1-2).

సుమేధుడు కడపట విశ్వాంతరుడను రాజనందనుడుగ జన్మించి తన త్యాగమును సంపూర్ణ మొనరించుకొని తుషిత స్వర్గ మను దివ్యలోకమునకు బోయెను.

ఆతడే సిద్ధార్థ గౌతముడుగ మన దేశమున క్రీస్తు పూర్వము ఆరవ శతాబ్దమున నవతరించి యమరమైన జ్ఞానమును బోధించి, మన దేశము నా సమయమున నావరించిన యజ్ఞాన తపస్సు పారదోలెను. అభ్యుదయ కాంతి పథమున నడచుటకు భారతీయులకు మాత్రమె కాక సకల ప్రపంచ వాసులకును జ్ఞానశక్తులను ప్రసాదించెను.

## క్రీస్తు పూర్వము ఆరవ శతాబ్ద పరిస్థితులు

క్రీస్తుపూర్వము ఆరవ శతాబ్దము విప్లవాత్మకమగు కాలము. ఒక వైపున బ్రాహ్మణ పురోహితు లాత్మజ్ఞానమును మఱచి యర్థరహితమైన క్రతుకలాపము లధికముగ గల్పించిరి. యజ్ఞాదులయం దధికమగు పశు విశసన ముండెను. అదియును గాక వీని నాచరించుట కనంతధనము కావలయును. అర్థశూన్యమగు కర్మకాండను బ్రాహ్మణులు విపరీతముగ పెంచి క్షుద్ర విద్యలకు దిగిపోయిరని దీఘనికాయము (సూత్ర పిటకము) నందలి బ్రహ్మజాల సూత్తము చెప్పుచున్నది:

## పురోహితుల పతనము

“కొందఱు బ్రాహ్మణులును, శ్రమణులును నితరులు భక్తిశ్రద్ధలతో సమర్పించిన యన్నముతో జీవించుచు, సకల వ్యసనములకు లోబడిరి. బ్రాహ్మణులు వివిధములైన పానీయములను, నామిషములను సేవింతురు. వారి దుస్తులును

పరిమళములును వారి విలాసజీవన నిదర్శనములు. శ్రద్ధాభక్త లతో ప్రజ లొసగిన యన్నముపై జీవించుచు విలాస జీవన మునకు వారు లోనైరి: నాట్యము (నాక్క్కం), గీతము (వాదితం), నాటకములు(పేక్కం), తాళములు వాయించుట(ఆఘానం పాణి స్వరణం), చచ్చిన వాళ్ళను మంత్రములతో లేపుట (వేతాలము), కుంభ ధూణము (ఒకవిధమైన సంగీతము),శోభ నగరకము, చండాల వంశ ధోపనము, ఏనుగుల గుఱ్ఱముల కారెనుముల పందెపు పోరాటములు సాగించుట మొదలైన వానియందు నిత్యానురక్తులు. శ్రమణ గౌతముడు వ్యసన విలాసాదుల కతీతుడు.” .

## వేదవాదరతులు కామాత్ములు

ఈ విధముగ బ్రాహ్మణులు పరాన్నజీవులై క్షుద్ర విద్యలకు దిగి పతితులై పోయినట్లు బ్రహ్మజాల సూత్తము చెప్పుచున్నది. గీతలోని ఈ క్రింది వాక్యములు సైత మీ యర్థముననే కర్మకాండను నిందించుచున్నవి.

> యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్య విపశ్చితః
> వేదవాద రతాః పార్థ నాన్యదస్తతి వాదినః॥
> “కామాత్మాన స్స్వర్గపరా జన్మ కర్మ ఫలప్రదాం
> క్రియా విశేష బహుళాం భోగైశ్వర్య గతింప్రతి.
> భోగైశ్వర్య ప్రసక్తానాం తయాప హృతచేతసాం
> వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయతే” (గీత II 43-44)

అవివేకులగువారు కర్మకాండను ప్రశంసింతురు. వారు కామాత్ములు. విషయ సుఖాత్మకమైన స్వర్గమును కాంక్షింతురు. బహుక్రియ కలాపములను వారు ప్రశంసించుచుందురు.

ఈ యాపాత మనోహర వాక్యముల కెవరి చిత్తము వశమగునో, భోగైశ్వర్యములయం దాసక్తి కలదియై యుండునో వారి యంతఃకరణమున నిశ్చయాత్మకమగు బుద్ధి స్థిరమగుట లేదు.

సామాన్యప్రజల మూఢవిశ్వాసముల కంతమే లేదు. వారు మతధర్మ శూన్యులు. వృక్షదేవతలను, నాగదేవతలను, యక్షిణీ యక్షులను, గంధర్వులను వా రారాధించు చుండిరి. పూజింపని యెడల నీ దేవత లెంతైన నపకార మాచరింతు రను మూఢవిశ్వాసము వ్యాపించి యుండెను.

## ఋషులు, రాజన్యులు

మరియొక వైపున నీ సమయముననే చాలమంది మహా పురుషులు జన్మించిరి. సత్యమును దర్శించి దానిని లోకమున కెఱిగించి దుఃఖమును తుడిచివేయ వలయునని వారు సంకల్పించిరి. ఉపనిషత్తులలో ప్రసిద్ధులైన యాజ్ఞవల్క్యాది ఋషి వతంసు లిట్టి వారే. జనకుడు, ప్రవాహణ జైవలి, అజాత శత్రువు, అశ్వపతి, చిత్రగార్గ్యాయని వంటివారు ఆత్మజ్ఞాన పూర్ణులు గదా! ఎందరెందఱో రాజకుమారులు జనన మరణముల రహస్యమును దెలిసికొని సత్యమును దర్శించుటకై సింహాసనములను, మధురములైన మానుష్య భోగములను త్యజించి యరణ్యముల తపించిరి. ఇట్లు ఏక కాలముననే తేజస్తిమిరములు మన దేశమున నాడు వ్యాపించి యుండెను.

రాజకీయముగ గూడ నా నాడు మన దేశము నైక్యత లేదు. అన్ని రంగముల నిబిడముగా నలముకొన్న తమస్సును

బోదోలి శాంతిని సమాధానమును ప్రజ్ఞను ననుగ్రహించి విశ్వదుఃఖము నుపశమింపజేయుటకే బుద్ధభగవాని ఆగమనము. (వివరములకు చూడు-బౌద్ధయుగము).

## శాక్య వంశము

పవిత్ర భారతదేశమున కాశీక్షేత్రమున కుత్తరమున కోసల రాజ్యములో కపిలవాస్తను నగరముండెను. ఇది శాక్య రాజ్యమునకు రాజధాని. శాక్యులు ఇక్ష్వాకు వంశమునకు చెందినవారు. శాక్యవంశపూర్వ చరిత్ర 'మహావస్తు' వున నిట్లు చెప్పబడినది. పూర్వ మిక్ష్వాకు వంశమున మహాసమ్మతుడను ప్రభువు జనించెను. ఇతడొక వలపు కత్తెకు లోబడి (దశరథునివలె సత్యబద్ధుడై) విధిలేక యామె కుమారునకు రాజ్య ప్రదానము చేయుటకై తన నైదుగురు కుమారులను రాష్ట్రము విడిచి వెళ్ళవలయునని శాసించెను. వారు శుభకరమైన హిమాలయ పర్వత సానుభాగమున కపిలుడను మహర్షి యాశ్రమ ప్రాంతమున నివసించిరి. కపిల మహర్షి వారి కాచార్యుడై జ్ఞానమును బోధించెను. తమ గురువు గోత్రమే తమ గోత్రముగ శాక్యు లంగీకరించిరి. కపిల మహర్షిది గౌతమ గోత్రము. కావున ముందు కౌత్స గోత్రమునకు చెందిన యీ యిక్ష్వాకులు నాటినుండి గౌతములైరి.

ఈ ప్రాంతమున శాక వృక్షము లధికముగ నున్నందున నిందు నివసించు ఇక్ష్వాకు వంశ్యులు శాక్యులని ప్రసిద్ధివహించిరి.*

---

* "శాకవృక్ష ప్రతిచ్ఛన్నం వాసం యసాచ్చ చక్రిరే। తస్మాత్

ఈ ప్రదేశముననే కపిల మహర్షి యాదేశమున శాక్యులు యాయన పేర కపిలవాస్తు నగరమును నిర్మించిరి. ఈ వైదుగురిలో నొకరి కుమార్తెను కోలుడను రాజర్షి వివాహము చేసికొనెను. ఈతని వంశీయులే కోలీయులు. గౌతముని తండ్రి శుద్ధోదనుడు శాక్య వంశమున జన్మించెను. తల్లి మాయాదేవి కోలీయుల యాడుబిడ్డ. శాక్య వంశము బుద్ధుడు జన్మించుటకు తగిన పవిత్ర వంశమని దేవతలు నిర్ణయించినట్లు బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి.

శాక్యుల రాజ్యలక్ష్మీ నివాసమని ప్రసిద్ధిగాంచిన కపిలవాస్తు సుందరమైన నగరము. ఈ నగర ప్రాసాద పంక్తులు హిరణ్మయములనియు, వీధులు మాణిక్య మయములనియు, వీధుల రాత్రివేళల నక్షత్రములు ప్రతిఫలించి శృంగార రసమూర్తియైన మన్మథుని చాపము నుండి రాలిన ముత్యముల వలె భాసించునని బుద్ధఘోష మహాకవి తన పద్య చూడామణి కావ్యమున నిట్లు వర్ణించినాడు. †

---

ష్వాకు వంశ్యాస్తే భువి శాక్యా ఇతి స్మృతాః॥" అని సౌందర నందకావ్యమున నశ్వఘోషుడు శాక్య శబ్దమును వివరించెను. (సౌందరనందం, ప్రథమ సర్గము 24 శ్లోకము.)

† వీథీషు మాణిక్యమయీషు యస్యాం। జ్యోతీంషి భాతి ప్రతిబింబితాని
అనంగ చాపాదప కృష్యమాణా న్ముక్తాఫలానీవ పరిచ్యుతాని॥
(పద్య చూడామణి I-6)

## శుద్ధోదనుడు

శాక్య నరపాలుడు శుద్ధోదనుడు. ధర్మము ననుసరించి నడుచుట యందును కాంక్షితార్థములను సఫల మొనరించుకొనుటయందును, నాతడు పాపరహితమైన జీవిక నవలంబించుటచే శుద్ధోదన నామ మాతని యందు సార్థకమయ్యెను.

## మాయాదేవి

సముద్రునకు నదీమతల్లి, సూర్యునికి పద్మిని, చంద్రునికి చంద్రిక, విష్ణువునకు లక్ష్మి, మేఘమునకు సౌదామినివలె శుద్ధోదనునకు మాయాదేవియను మహిషి యుండెను. మహిషియనగా నభిషిక్తురాలైన భార్య. మాయాదేవి మనోజ్ఞ గుణశీలముల కాలవాలము. శుద్ధోదనుడు చక్రవర్తి కాడనియు, నాతడు ప్రజలచే నెన్నుకొనబడిన నాయకుడు మాత్రమేననియు చరిత్రకారుల యభిప్రాయము. శాక్య ప్రజలు తమ ప్రాణములకన్న స్వాతంత్ర్యమును గాఢముగ ప్రేమింతురు. వారిది ప్రజాస్వామిక రాజ్యమని చరిత్ర చెప్పుచున్నది.

చిరకాల తపోవ్రత ఫలముగ మాయాదేవి గర్భమును ధరించెను. ఒకనాడామె చక్కగ నలంకరించుకొని చాల మంది సుందరీమణులు వెంటరా, భర్త సన్నిధికి రాజసభకు వెళ్ళి, యొక వారము దినములు తపోజీవితము గడపుటకాతని సమ్మతి బడసెను. ఆ సమయమున బందీల లందఱను విడుదలచేసి, ప్రజలకు దానధర్మములు విరివిగా జేయవలయునని మాయాదేవి శుద్ధోదనుని కోరినది. మనోజ్ఞమైన యామె కాంక్షను శుద్ధోదనుడు మహానందమున సఫల మొనరించెను.

## మాయాదేవి స్వప్నము

అది వసంతకాలము. వైశాఖమాసము. ప్రకృతియంతయు సుందరముగ నలంకరించుకొన్నది. ఆ రమణీయ సమయమున నొకనాడు మాయాదేవి యానంద మగ్నయై నిద్రించినది. ఆమెకొక మనోహరమైన స్వప్నము కలిగినది. ఆ కలలో హిమాలయమువలె ధవళమై ఆరు దంతములు గలిగిన యొక సుందరమైన మహాగజమును, ఐరావతమును బోలిన దానిని శాక్యరాజ మహిషి తన గర్భమున కుడిప్రక్కనుండి ప్రవేశించినట్లు చూచినది.

ఆ సమయమున ఆనందముతో భూమి స్పందించినదట. మెఱపుల కాంతులు విశ్వమంతట వ్యాపించి నరక లోకపు చీకట్లనుగూడ పారదోలినవట!

ఉదయముననే రాణి నిద్రలేచి రమణీయమైన ఆ అశోకవనమునకు బోయి యట నాసీనయై రాజును రమ్మని యర్థించినది. మంత్రులతో శుద్ధోదనుడు వచ్చి మాయాదేవి స్వప్నమును విని యాశ్చర్య పడెను. మాయాదేవి గర్భమందలి శిశువు మహాజ్ఞానియో, లేక చక్రవర్తియో యగునని బ్రాహ్మణులు బాలుని భవిష్యత్తును గూర్చి చెప్పిరి.

మాయాదేవి తాకిన వ్యక్తులు గర్భస్థుడైన శిశువు ప్రభావము వలన వెంటనే యాధి వ్యాధులనుండి విముక్తులగుచుండిరి. భూమి పైని ప్రజలందఱు రోగాది బాధలేమియు లేకుండ సుఖ సంతోషముల నందిరి.



మాయాదేవి స్వప్నము.

## లుంబినీ వనము

స్వప్నము కలిగిన నాటినుండి పది మాసములు గడిచినవి. మాయాదేవి తన పుట్టినిల్లైన 'దేవదాహ' నగరమునకు పోదలచుకొన్నది. 'కపిలవాస్తు'కును 'దేవదాహ'కు మధ్య మార్గమున మనోజ్ఞమైన యుద్యానము లుంబినీ వనమున్నది. దేవదాహ నగరాధిపతి సుప్రబుద్ధుని మంత్రి భార్యయైన లుంబినీదేవి పేర నీ యుద్యానము వేయబడినదట. రెండు నగరములనుండి ప్రజలు తమ విలాస విహారముల కొరకీ యుద్యానవనమునకు వచ్చుచుందురు. ఇది ప్రమోద వనమనియు, రాజోద్యానమనియు ప్రసిద్ధి వహించినది. మాయాదేవి యంతఃపురాంగనా జనముతో గూడి శుద్ధోదనుని యనుమతమున దేవదాహ నగరమునకు బోవుచు, మార్గమధ్యమునున్న యీ రమ్యారామమునుగాంచి విశ్రాంతికై కొంత సేపట నిలిచినది.

వసంతలక్ష్మి పరిమళ పుష్పములతో పక్షుల కలగానముతో పుష్పపరాగముతోడి చల్లని పిల్లగాలులతో లుంబినీ వనములో రాణికి మధుర స్వాగతము చెప్పినది. దేవతలును, నప్సరసలును దివ్య సంగీతముతో, మందార కుసుమములతో వచ్చి జగద్గురుని గర్భమున ధరించిన మాయాదేవి దర్శనము చేసికొన్నారు. లుంబినీ వనమున రాణి స్నిగ్ధచ్ఛాయా మనోహరములైన వృక్షముల క్రింద నిటునటు మెల్లగా సంచరించినది. ఆమె పుష్పభారావలంబినియైన వృక్షశాఖ నవలంబనముగా గొని నిలిచియున్నపుడు మన కథా నాయకుడగు శిశువు జనించినాడు.



సిద్ధార్థుని జననము

ప్రభాత కాలము సహస్రభానుని, ప్రదోషలక్ష్మి చంద్రునివలె మాయాదేవి మంగళాత్మక ముహూర్తమున జగమునకు జ్ఞానప్రదుడైన (భువనైక నేత్రం) బుద్ధ భగవానుని గన్నది యని బుద్ధ ఘోష మహాకవి వర్ణించినాడు. అవతరణ సమయమున పృథ్వి యుదారోదంచితములై పంచవర్ణాలంకృములైన పద్మముల నా ప్రదేశమున నాచ్ఛాదించి భక్తి పూర్వకముగ నుపాయనములు సమర్పించుకొన్నదని కావ్య వర్ణన.

ఆ శుభ సమయమున ద్యావా పృథువులేకమై యానందమును సూచించినవి. వృక్షములు శాఖలను వంచి మాతా శిశువులపై పుష్పములను వర్షించినవి.

అదే సమయమున శాక్యవంశమున నానందుడు, దేవదత్తుడు, ననురుద్ధుడు, ఛన్నుడు మొదలైనవారు జనించినారు.

ఏడు దినములు లుంబినీ వనముననే గడచినవి. ఏడవ నాడు మాయాదేవి దేవ ఋషులతో సమానుడైన నందనుని విశాల ప్రభావమును గాంచి ప్రహర్షమును భరింపలేక యా యానంద నిద్రలోనే సర్వబంధముక్తయై త్రాయస్త్రింశమను దివ్యలోకమునకు బోయినది.

శుద్ధోదనుడు మహావైభవముతో బాలుని కపిలవాస్తుకు గొనితెచ్చినాడు. ఆయన ద్వితీయ భార్య, మాయాదేవి సోదరి ప్రజాపతి గౌతమీదేవి నాటినుండి బాలునికి తల్లి యైనది.

# అసిత మహర్షి

ఆ కాలమున హిమాలయమున నసితుడను మహర్షి యుండెను. ఆయన తన తపస్సువలన నైదు గొప్ప సిద్ధులను పొందెను. వాని నభిజ్ఞలని బౌద్ధగ్రంథములు చెప్పును. దివ్య చక్షువు, దివ్య శ్రోత్రము, పరచిత్త జ్ఞానము, పూర్వ నివాస జ్ఞానము, ఋద్ధి విధి విజ్ఞానము ననునవియే యీ పంచాభిజ్ఞలు.

జ్ఞాన దృష్టి వలన మహా పురుషుని యవతరణమును తెలిసికొని తన శిష్యుడు, మేనల్లుడునైన నాలకుని (నరదత్తుని)తో కపిలవాస్తుకా మహర్షి వచ్చెను. రాజదంపతులా మహర్షిని భక్తి పూర్వకముగా సత్కరించినారు. బాలుని దేహముపైని ముప్పదిరెండు మహా పురుష లక్షణములను మహర్షి చూచి, యా బాలుడు బుద్ధుడని తెలిసికొని కన్నీళ్లు కార్చినాడు.

శుద్ధోదనుడు భయమంది మహర్షి దుఃఖమునకు కారణమడగగా, బాలుడు బుద్ధుడగుననియు, బుద్ధుడై యాయన బోధించు జ్ఞానమును, తాను వృద్ధుడగుటవలన నంతవరకు జీవించి విను భాగ్యము తనకు లేదనియు, నదియే తన దుఃఖ కారణమనియు అసితుడు తెలిపినాడు; బాలుడు బుద్ధుడైన వెంటనే యాతని శిష్యుడవు గమ్మని నాలకుని నాదేశించినాడు.

తరువాత రాజదంపతులు మహర్షిని పూజించి భక్తితో వీడ్కొలిపినారు. జాతకర్మాదికములు నిర్వర్తించి లోకశ్లాఘ



అసిత మహర్షి సిద్ధార్థుని భావి ఘనతను వివరించుట.

నీయమును, ననన్యయోగ్యమునైన సిద్ధార్థ నామమును బాలు నకు పురోహితు డిడినాడు. ఆ సమయముననే కౌండిన్యుడను బ్రాహ్మణుడు, "బాలుడు పెద్దవాడైన తరువాత సంసార సుఖములను పరిత్యజించి బుద్ధుడై, జగతి నజ్ఞాన దుఃఖమునుండి రక్షించు"నని ప్రవచించినాడు.

శాక్య వంశమున జన్మించుటవలన శాక్యసింహు డనియు, గౌతమ గోత్రజుడు గావున గౌతముడనియు సిద్ధార్థుడు ప్రసిద్ధుడైనాడు. నవాంబు మాలచే నభస్థలి, సుధాకర లేఖచే నిశ, సింహశాబముచే మహాటవి విభూషితమైనట్లు బాల సిద్ధార్థునిచే శాక్యవంశము విభూషితమైనది.

## సిద్ధార్థుని బాల్యలీలలు

సిద్ధార్థుని బాల్యలీల లద్భుతముగా బౌద్ధగ్రంథములు వర్ణించును. మహా ప్రజాపతి దేవాలయమునకు శాక్యుల సంప్రదాయానుసారము బాలసిద్ధార్థుని దీసికొని పోగా, నా దేవాలయమునందలి దేవతామూర్తులు సజీవములై యాతని కి నమస్కరించినవి. దీనివలన జ్ఞానము దేవతలకు సైతము నమస్కరింప దగినదనియు, నది యన్నిటికి కంటెను మహనీయ మనియు దెలియుచున్నది. శిల్పి భద్రక శాక్యరాజుచే కుమారునకు మంగళకరముగా నుండుటకు ప్రీతితో శుద్ధోదను డాభరణములను చేయించినాడు. మనోజ్ఞములైన యా యాభరణములు బాలుని దేహము సోకిన వెంటనే కాంతి హీనములైనవి. జ్ఞానము మహాప్రభ. దాని సన్నిధిలో నాభరణముల కాంతి యెంత ?

## విద్యాభ్యాసము

ధృతి, శౌచము, ధీ, శ్రీ మొదలైన గుణముల బాలుడు సాటిలేనివాడాయెను. బాల సిద్ధార్థునికి గురువైన విశ్వామిత్రుడు బాలుని ప్రతిభ చూచి యాశ్చర్యముతో మూర్ఛిల్లినాడు. ఉపనయనానంతరము విశ్వామిత్రుని సన్నిధిలో సిద్ధార్థుడు బ్రాహ్మి, ఖరోష్టి, దక్షిణీ మొదలైన యనేక లిపులను అచిరకాలములోనే గుర్తించి నేర్చుకొన్నాడు. 'అ' మొదలైన యక్షరములు బాలునికి ప్రపంచముయొక్క యనిత్యతను, జ్ఞాన మహనీయతను ధ్వనించినవట. వెనుకటి జన్మముల నభ్యసించిన విద్యలన్నియు నాతనికిప్పుడు లభించినవి.

వర్షకాలమునందలి మేఘము సముద్రమునుండి జలమును గ్రహించునట్లు ధారణాబలముచే బాలసిద్ధార్థుడాచార్యులుపదేశించిన విద్యలను, కళలను నచిరకాలముననే గ్రహించినాడు. సాటిలేని ధీశాలియైన సిద్ధార్థుని వరించి సమస్త కళలు, విద్యలును శరత్కాలమున నిర్మలమైన యాకాశమునందలి చంద్రుని కిరణములవలె ప్రకాశించినవి. షోడశ కలాభిరాముడైన చంద్రునివలన సాగరముప్పొంగినట్లు శాక్యకులము సిద్ధార్థునివలన సముల్లాసవంతమైనది.

## హోలికోత్సవము

ఒకనాడు హోలికోత్సవము జరుపబడినది. ఇది ఏరువాక ఉత్సవము వంటిది. పొలములను దున్నుటకిది ప్రారంభోత్సవము. అందఱు నుత్సవముల వేడుకలలో నిమగ్నులైయున్నపుడు బాలసిద్ధార్థుడొక జంబూవృక్షము క్రింద పద్మాసనము

వేసికొని ధ్యానమున నిమగ్నుడై నాడట. ఆకాశమున బోవు చున్న ఐదుగురు సిద్ధులా వృక్షముమీదుగ బోలేక, దానికి కారణము తెలిసికొనుటకై క్రిందికి దిగి, బాలసిద్ధార్థుని బుద్ధుడని తెలిసికొని భక్తితో నమస్కరించి వెళ్ళిపోయిరి. ప్రొద్దు ననుసరించి అన్ని వృక్షముల నీడలు తిరిగినను, నా జంబూ వృక్షము నీడమాత్రము స్థిరముగ నిలిచినదట. శుద్ధోదనుడా యద్భుత దృశ్యమునుగాంచి తన రాజచిహ్నములను దూరముగ విడిచి బాలసిద్ధార్థునకు సాష్టాంగముగా నమస్కరించి నాడట.

## యౌవన దశ

సిద్ధార్థుడు యౌవన దశను ప్రవేశించినాడు. ఆ నవ వయస్సులో ఆతని మూర్తి గంభీరమనోహరముగా రూపొంది నది. ప్రతిభ పండితుని, దయ సత్పురుషుని నలంకరించునట్లు నవయౌవనలక్ష్మి సిద్ధార్థుని దేహమునకు స్వాభావికమైన మనోజ్ఞాలంకారమై శోభింపజేసినది. తమకు దగిన పతిని పొంది పరమ భాగ్యమును ప్రాపించు సౌందర్యమూర్తులైన కాంతల వలె సకల విద్యలును, కళలును, యువరాజ సిద్ధార్థుని పొంది ప్రకాశించినవి. కాని యా ముఖములో, నా కన్నులలో లోకాతీతమైన శాంతి, ప్రసన్నత, వానితోబాటు విచార రేఖలును గోచరించును.

శుద్ధోదనుడు తన కుమారుడు విరక్తుడై బుద్ధుడగు నేమోయని భయపడి శుభా, సురమ్యా, రమ్యలను మూడు మహాసౌధములను నిర్మించి, యందప్సరసలను బోలిన నృత్య విలాసినుల మధ్య సిద్ధార్థునుంచినాడు. ఆనంద సమయములలో

సైతము విషాద ధ్యానచ్ఛాయలు సిద్ధార్థుని ముఖముపై చంద్ర బింబముపై దేలిపోవు నీలిమేఘములవలె గోచరించుచుండెను.

## వివాహాలోచనలు

శాక్యవంశపు పెద్దలు శుద్ధోదనునితో సిద్ధార్థునికి వివాహము చేయవలయునని చెప్పినారు. కులనందనుడైన సిద్ధార్థుని తండ్రి ఆ విషయమై ప్రస్తావించినాడు. వివాహము బంధమైనను, సంసార సుఖములలోనుండికూడ మానవుడు వానికి లొంగక తరించుట సాధ్యమేనని సామాన్య ప్రజలకు దృష్టాంతముగా నుండుటకై బోధిసత్త్వుడైన యువరాజు తండ్రికి తన సమ్మతిని తెలిపినాడు. పంకములో జనించినను కమలము, దానిపైనున్న జలమునుగూడ దాటి పైన వికసించును గదా! పరిమళములను వ్యాపింపజేయును గదా!!

రాజపురోహితుడు కన్యార్థమై చాలచోట్ల దిరిగి తుదకు దేవదాహనగరమందలి కోలీయ దండపాణి సుప్రబుద్ధుని కన్య యశోధర, లేక 'గోప' యను కన్యకామణి యువరాజునకు దగిన వధువని రాజునకు తెలిపినాడు.

## శాక్య కన్యకామణీ విలాసము

సిద్ధార్థుడు తనకు నచ్చిన కన్యకను గోరుకొనుటకై శాక్యవంశమున బెండ్లియీడు వచ్చిన కన్యకలనందఱిని బహుమతుల ప్రదానమను మిషచే శుద్ధోదనుడు రాజభవనమున కాహ్వానించినాడు. ఏడవనాడు శాక్య కుమారీమణు లందఱు తమ నీలాల నెఱికురులను నున్నగ దువ్వుకొని, సుందరముగ కొప్పులు దీర్చికొని, కనులకు కాటుక దిద్ది, చేతులకు గాళ్ళకు



సిద్ధార్థుడు తన వధువు నెన్నుకొనుట.

పారాణి పూసికొని, ముఖమున తిలకము శోభావంతముగా దీర్చి రమణీయ వస్త్రాభరణములను ధరించి గుములు గుము లుగా రాజసౌధమునకు వెళ్ళినారు.

ఆ సుందరులొకరొకరుగా యువరాజ సిద్ధార్థుని సమీ పించి యాయన యిచ్చు బహుమానములను తీసికొనవలెను. కుమారీమణులందఱు నల్లకలువలవంటి విశాల నేత్రములతో నేలను జూచుచు, హంసగమనముతో సింహాసనము సమీపించి సిద్ధార్థుడొసగు కానుకలను తీసికొన్నారు. కాని, ముఖమెత్తి యువరాజును జూడలేకపోయిరి. నిర్వికారమై, ప్రసన్నమైన యాయన వదన బింబమందలి లోకాతీత గభీరత వారి హృదయ ములలో భయమును గలిగించినది. కానుకలన్నియు నయిపోయి నవి. కడపట యశోధరాదేవి వచ్చినది. ఆమె యాకృతి భూమండలమున నవతరించిన పార్వతిదేవివలె నుండెను.

## యశోధర

యశోధరాదేవి ముఖ కమలము ముంగురులను తుమ్మె దలతో మనోహరమైయున్నందున నామె సంచరించు తామర తీగవలె నుండెను. విలాసముగ లతలను, పూవులను ధరించి రూపుదాల్చి సంచరించుచున్న వసంతలక్ష్మివలె యశోధర శోభించెను. ఆమె యువరాజును సమీపించి లేడి కన్నులవలె విశాలములైన నేత్రములతో తేరిచూచినది; వెన్నెలను ప్రస రింపజేయు మృదుహాసముతో "నాకు కానుక లేదా?" యని యువరాజును పలుకరించినది.

"కానుకలు లేవు కాని, దీనిని దీసికొ"మ్మని తన మెడ లోని పచ్చలహారము ప్రసాదించి, పుష్పములతో యువరాజు

యశోధర నలంకరించి, యామె రూపలక్ష్మిని ప్రశంసించినాడు. వారి చూపులు పరస్పరము కలసి, యనురాగము అభివ్యక్త మైనది.

## జననాంతర సౌహృదము

ఆ ప్రేమ యనేక జన్మములనుండి పరిణమించినదని తాను బుద్ధుడైన తరువాత సిద్ధార్థుడు శిష్యులకు తెలిపినాడు.*

రహస్య సందేశహరులా యానంద వార్తను శుద్ధోదనున కెఱిగించినారు. శుద్ధోదనమహీపతి యశోధరను సిద్ధార్థున కిమ్మని కన్యాదానమును కాంక్షించుచు దండపాణి సుప్రబుద్ధునకు వివాహమంగళ సందేశ పత్రమును పంపినాడు. కాని, దండపాణి సిద్ధార్థుని శక్తి సామర్థ్యములను సంశయించి, యందులకు సమ్మతింపలేదు. యువరాజు పట్టి సుకుమారుడు. క్షత్రియులకు దగిన ధనుర్విద్యాది కళలు, శిల్పాదులు తెలియని విలాస వాతావరణమున బెరిగినాడని దండపాణి యభిప్రాయము.

## శ్రద్ధామయుడు

శుద్ధోదనుడది విని నిరుత్సాహపడెను. కాని, యువరాజు సామాన్యుడుకాడుగదా! తానెవరితోనైన క్షత్రియోచితములైన కళా శిల్పములలోగాని, వీర విక్రమములలోగాని,

---

* "తత్ చేతసా స్మరతి నూనమబోధ పూర్వం భావస్థిరాణి జననాంతర సౌహృదాని"యని మహాకవి కాళిదాస సూక్తి. సమనుభూతానాది సరపరంపరా ప్రసక్సమాకలిత సంసర్గమునన్ (శ్రీనాథ మహాకవి).

శరీరబల ప్రదర్శనములోగాని 'పోటీ' చేయగలనని కులనందను డైన యువరాజు తండ్రిని సంతోషపఱచినాడు.

శ్రద్ధ చాల మహనీయమైనది. అది పౌరుషమునకు మూలము. మహాత్ములు దాని నాశ్రయించియే యనాయాసముగ గొప్ప సంకటములను తరింతురు. ఎవరెవరెట్లు ఎద్దానిని గుఱించి శ్రద్ధతో ప్రయత్నింతురో వారట్లే కోరిన ఫలములను బొందుదురు. శ్రద్ధారహితులు ప్రయత్నశూన్యులై పురుషార్థములకు దూరులగుదురు. కావున మానవులు శ్రద్ధ నాశ్రయింపవలయును. పురుషుడు శ్రద్ధామయుడు. ఎవని కెట్టి శ్రద్ధ గలదో వాడట్టివాడగును. మూలము వృద్ధిబొందిన వృక్షమెట్లు వృద్ధి బొందునో శ్రద్ధవలన జీవితమట్లే వృద్ధిబొందును. వ్యాకులమైన దర్శనము గలవాడును, దృఢ నిశ్చయము లేని వాడును దేనిని సాధింపజాలడు.

యువరాజట్టి శ్రద్ధామయమూర్తి. కాన, నాయన కేదియు నసాధ్యము గాదు. ఏడుదినములలో యువరాజస్త్ర శిక్షయందు సాటిలేని నైపుణ్యము గడించినాడు.

## పరీక్షా ప్రణాళిక

ఎనిమిదవ దినమున కుమార విద్యా ప్రదర్శనమునకన్ని యేర్పాట్లు చేయబడినవి. పరీక్ష యీ క్రింది యంశములలో నుండును. ఏనుగు కళేబరమును దూరముగ విసరుట. అనేక భాషలకు సంబంధించిన లిపులు చదువుట. ఈ పరీక్షకు తీర్పరి విశ్వామిత్రుడు. గణితశాస్త్ర ప్రావీణ్యము. ప్రధాన గణకుడైన అర్జునుడు దీనికి దీర్పరి. బాణప్రయోగ కుశలత. దీనికై

యువరాజితరులకు సాధ్యముగాని, తన వంశ పూర్వపురుషు లైన 'సింహ హానువు' మహా ధనువును ధరించినాడు. మల్ల యుద్ధ నిపుణత, లలితకళా కుశలత, కవితా నిపుణత; జ్యోతి శ్శాస్త్రాది విద్యలయందు పాండిత్యము; వేద విద్యలు, తర్కము తత్త్వశాస్త్రము, నర్థశాస్త్రము, రాజనీతి శాస్త్రములయందు వైదుష్యము.

## జయశాలి

ఆ పరీక్ష లన్నిటిలోను జయశాలియైన వానిని విజయ పతాకమును ధరించి విద్యా ప్రదర్శనమును దిలకించుచున్న యశోధరాదేవి వరించును. ధనుర్విద్యా కౌశల ప్రదర్శనమున యువరాజు ధనువు ధరించినపుడు "పుష్పధన్వుడా! దేవ రాజా!!" యని ప్రజలాశ్చర్యపడినారు.

దేవదత్తుడు, సుందరనందుడు మొదలైన శాక్య వీర కుమారులందఱు నా ప్రదర్శనమున బాల్గొన్నారు. కాని, యందఱును పరాజితులైనారు. యువరాజు అస్త్రశిక్ష, సర్వకళా కౌశలము అదృష్టపూర్వమని ప్రజలందఱు నానందముతో ప్రస్తుతించినారు.

## వివాహము

జయలక్ష్మివలె విజయ పతాకమును ధరించియున్న యశోధర తండ్రితోబాటు అమితానందమందినది. జయశాలి యువరాజును పుష్పమాలాలంకృతుని జేసి వరించినది. తరువాత నొక శుభదినమున నైరావతము వంటి గజముపై, రాజో చితముగా మౌక్తికచ్ఛత్రముచే మంగళ మహోజ్వలముగ

నలంకృతమైన యంబారిపై నాసీనుడై, యిరుపార్శ్వముల వెలదులు వింజామరములు వీచుచుండ నా యువరాజు దేవదాహ నగరమునకు వెళ్ళినాడు. శాక్యకుల ప్రదీపునకు స్వయముగా పాదచారియై పరివారముతో నెదురేగి కోలీయ ప్రభువు వైవాహికమండపమునకు గొని వచ్చినాడు. వైవాహికమంటపమున కరమున ధరించిన లీలారవిందముచే పయోధికన్యవలె భాసమానయగు చంద్రముఖి యశోధరను, చంద్రశోభను తిరస్కరించు దేహప్రభ గలదానిని గాంచి, యువరాజు ఆనందసింధువు అతివేలముగ పొంగి పోయినది.

వివాహము మహా వైభవముగ జరిగినది. పాణిగ్రహణానంతరము బంధువుల నందఱిని సంభావించి నిజరాజధాని కపిలవాస్తుకు యువరాజు బయలుదేరినాడు. కపిలవాస్తు పురమును ప్రదక్షిణించి ప్రజలు గొనియాడుచుండగా యశోధరా సహితుడై యువరాజు రాజభవనమును ప్రవేశించినాడు.

## ఉత్తమ సతీమణి

యశోధర, స్థిరశీల సంయుతమైన సత్కులమున జనించినది; సాధ్వి, సుందరి, హ్రీవినయోపపన్న; యశోధర యను పేరునకు దగిన యశోవిశాలయని అశ్వఘోష మహాకవి వర్ణించినాడు* జ్ఞానమున బ్రహ్మకుమారుని బోలిన యువరాజు హృదయాను రూపమైన సుశీల, యశోధరతో కొన్ని నాళ్లు సంసారసుఖముల ననుభవించెను.

---

* కులాత్తతో సా స్థిరశీలసంయుతాత్ సాధ్వీం వపు హ్రీవినయోపపన్నాం యశోధరాం నామ యశోవిశాలాం. తుర్యాభిధానాం శ్రియముద్వ్యవాహా॥ (బుద్ధ చరితము 2.26).

యువరాజు మనసులో, ఏ వ్యాకులతయు, చింతయు ప్రవేశింపకుండ, శుద్ధోదనుడు శరత్కాల మేఘములవలె తెల్లనై భూమిపై నిలిచిన విమానములనుబోలి, సర్వ ఋతువుల యందును సుఖాస్పదములైన ప్రాసాదముల నిర్మించి, అందు యువరాజు నప్సరసలవంటి రూపవతులైన కాంతల మధ్యనుంచినాడు; నిరంతరము నాట్య గాన వాద్యము లేర్పాటు చేసినాడు.



తరువాత శుద్ధోదనుడు ధార్మికముగ ప్రజలను కన్న బిడ్డలవలె పరిపాలించినాడు. పుత్రవాత్సల్య మాతని హృదయమున నిండి యుండెను. అనేకములైన మధుర విషయానందముల మధ్యనున్నను యువరాజు మనసులో నేదో విచారముండెను. గాయనీమణుల వీణా రావములో నాయనకు విషాదము వినిపించును. దేవతలే యాయన మనసులో వైరాగ్యమును ప్రబోధించినారట! అతని సన్నిధిలో నప్సరసలు అదృశ్యలై యుండి యనేక వైరాగ్యగాథలను పాడినారు.

## వైరాగ్యగాథల సారము

ప్రపంచము కలవలె నశాశ్వతమైనది. సంసార సుఖములు పాములున్న సరస్సులవంటివి. ప్రాపంచిక విషయములు నీటిలో ప్రతిబింబించిన చంద్రబింబములు; గుహలలో వినిపించు ప్రతిధ్వనులు. అవిద్యయే దుఃఖకారణము. క్షణభంగురమైన విషయ సుఖముల గాంక్షింపక మానవుడు శాశ్వతానంద కారణమైన జ్ఞానమును సంపాదింపవలయును. జ్ఞానమువలననే జీవితము సార్థకమై యమృతత్వ సాధనమగును.

అప్సరో దేవతలా గాథలను పాడిన రాత్రి శుద్ధోదనున కొక కల వచ్చినది. యువరాజు సంసారముపై విరక్తినంది రాజసౌధము విడిచిపోయినాడన్న దే కలలోని దృశ్యము. కలవర పాటుతో మేల్కొని రాజు, కుమారుని గుఱించి యందఱి నడిగి, యాతడు నిద్రించుచున్నాడని తెలిసికొని మరల మనస్సును పదిలపఱచుకొన్నాడు.

## విహారయాత్ర

ఉదయముననే యువరాజు వసంత వనశోభను దిల కించుటకై విహార యాత్ర కేగుటకు రథమును సిద్ధము చేయు మని సారథి నాజ్ఞాపించినాడు. శుద్ధోదనుడా వార్త విని భయ మంది, వారము దినముల తరువాత విహార యాత్రకు బోవచ్చునని యన్నాడు. ఆ వారము దినములలో నగరమును చక్కఁగ నలంకరించి, దుఃఖ కారణములైన దృశ్యము లేవియు యువరాజు కంటబడకుండ జేయవలయునని తన యుద్యోగు లను కఠినముగ నాజ్ఞాపించినాడు. రాజెంత ప్రయత్నించినను, వైరాగ్య ప్రబోధకములైన నాలుగు దృశ్యములను యువ రాజు చూచునట్లు దేవతలు తమ మాయతో కల్పించిరట. విధినెవ్వరు నాపజాలరు.

తన యానంద భవనమును దాటి సిద్ధార్థుడు రథస్థుడై బయలుదేరినాడు. ఛన్నుడాతనికి సారథి. పురజనులు, స్త్రీ పురుషులు నా మహనీయ మూర్తిని చూచి యాశ్చర్యా నందముల నందిరి. సౌధవాతాయనములనుండి శాక్యకుల నందనుని కపిలవాస్తుపుర సుందరీమణులు కుతూహలముతో

గాంచిరి. అవిశాలములైన వాతాయనములయందు పరస్పర కపోలములను స్పర్శించు కుండలములతో యువరాజును దర్శించు నా లలనావతంసముల ముఖములు పద్మముల బద్ధ కలాపములను దలపించినవి.

రూప సౌందర్యముతో బాల సూర్యునివలె ప్రకాశించు నా యిక్ష్వాకు కులదీపకుని, యువరాజును గాంచి యా పుర నారీమణు లన్యభావ మేమాత్రములేని పరిశుద్ధ చిత్తముతో "నీతని భార్య ధన్యురా'లని మెల్లగ ననుకొన్నారు.*

## ప్రథమ దృశ్యము

దేవతల మాయవలన రాజమార్గము నొక వృద్ధుని సిద్ధార్థుడు చూచెను. అతడు రక్తమాంస రహితమై చర్మ ముతో గప్పబడిన యస్థి పంజరముతో, పలిత కేశములతో, బోసినోటితో, నూతకఱ్ఱ నాధారముగ జేసికొని జరాభారమున దడబడుచు పోవుచుండెను.

"సారథీ! నెరసిన వెంట్రుకలతో, గుంటలుపడిన కన్ను లతో, శిథిల శరీరాంగములతో, వంగి, యూత కఱ్ఱ నాధార ముగ జేసికొని నడచు నీత డెవడు? ఇది యితనికి కలిగిన విక్రియా లేక, సహజమా?"

సారథి యన్నుడు దేవతలచే నావేశింపబడినవాడై, "ఈతడు వృద్ధుడు. ముసలితనము వలన కన్నులు, చెవులు, చేతులు, కాళ్లు మొదలైన యింద్రియములు, నవయవము

* "ధన్యాస్య భార్యా"ఇతి శనైరవోచన్ శుద్ధమనోభి ఖలు నాన్య భావాత్.

లును క్షీణించును. ఇతడు దిక్కులేని యనాధుడు. బంధుజన ముచే విసర్జింపబడి, యరణ్యములోని పశు పక్షిగణ వివర్జిత మైన శుష్క వృక్షమువలె నున్నాడు. జర రూపమును నశింప జేయును. వ్యసనములకు, శోకమునకు నిది మూలకార ణము; ఇంద్రియములకు శత్రువు. ఈ జర దేశ ధర్మముగాని, కుల ధర్మముగాని కాదు. సర్వజన సామాన్యముగ బాల్య కౌమార యౌవన వార్ధక్య దశలు క్రమముగా వచ్చు" నని యన్నాడు.

'రూపమును, స్మృతిని, పరాక్రమమును పూర్తిగ నశింపజేయు జరను చూచియు ప్రజలు విచారశూన్య వర్త నులు. వారికి సిగ్గులే'దని ఖిన్నుడై యువరాజు రథమును వెను కకు ద్రిప్పుమన్నాడు.

## ద్వితీయ దృశ్యము

మరియొకనాడు సిద్ధార్థుడు మరల వనశోభను చూచు టకై రథస్థుడై బయలుదేరెను. ఈసారి యతడొక రోగిని చూచినాడు. వ్యాధివలనకృశించి, పాలిపోయిన శరీరముతో, స్థూలోదరముతో, శ్వాసతో కంపించుచు, సర్వేంద్రియ విక లుడై, మూత్ర పురీష మగ్నుడై, 'అయ్యో!' యని దీనముగ నాక్రందించు నా రోగిని గాంచి, యాతడెవడని ఛన్ను నడిగి నాడు.

"సౌమ్యుడా! ఈతడు రోగి. వాతపిత్తశ్లేష్మధాతువుల ప్రకోపమువలన గలుగు నీ దశను రోగమని యందురు. ఈ

రోగమను యనర్థమునుండి దేవేంద్రుడు సైతము తప్పించు కొనలేడు.''

అనుకంపముతో నా రోగిని చూచుచు "ఛన్నా! రోగరూపమైన యీ దోషమీతనికి ప్రత్యేకమా? లేక, సర్వ జన సామాన్యమా?'' అని విచారఖిన్నుడై యువరాజడిగి నాడు.

"కుమారా! ఈ రోగరూపమైన దోషము సర్వ సామాన్యము'' అను సారథి మాటను విషణ్ణచిత్తముతో నాకర్ణించి, పవనకంపిత జలచంద్ర బింబమువలె కంపించి, కొంచెము మృదుస్వరముతో మరల యువరాజు, "ప్రజలంద అికి సామాన్యమైన యీ రోగరూప దుఃఖమును గాంచియు మానవులు తమ సుఖము శాశ్వతమని విశ్వసించుచున్నారు. అహో, వారెంత యజ్ఞానులు!'' అని పలికి రథమును వెనుకకు త్రిప్పుమన్నాడు.

యువరాజట్లు విచారగ్రస్తమైన చిత్తముతో నానంద రహితుడై రాజసద్మమును ప్రవేశించుట శుద్ధోదనుడు విని, యాతని విహారయాత్ర నివర్తనమునకు నిమిత్తమునుగూడ తెలిసికొని, యసితముని వచనమును స్మరించి, యట్టి దుఃఖ దృశ్యముల కవకాశము కలిగించినందులకు రాజమార్గశోధాధి కారిపై కోపించెను. అయినను దయాళువు గావున నాతని

యువరాజు మనస్సును విషయములవైపాకర్షించుటకు శుద్ధోదనుడు మరింత యధికముగా విషయోపభోగములను

గల్పించెను. కాని, యంతఃపురమున యువరాజు శబ్ద స్పర్శ రూప రస గంధములైన నింద్రియ విషయముల వలన నేమాత్రమానందింపలేదు. విహారయాత్రవలన నాతని మనస్సాహ్లాదవంతమగునేమోయని మరల విహారయాత్రకు శుద్ధోదను డాజ్ఞాపించెను. ఈ సారి రాజమార్గము మరింత విశేషముగా నలంకరింపబడినది. రాజు వశీకరణాది విద్యలయందారితేరిన యప్సరోరూపలైన వారకాంతామణులను యువరాజు ననుగమింప నాజ్ఞాపించినాడు.

## తృతీయ దృశ్యము

అత్యంత వైభవముగ నలంకృతమైన రాజమార్గమున నీ సారి యువరాజు, బంధువులు దుఃఖించుచు మోయుచున్న మంచముపై పుష్పాలంకృతమైన శవమును జూచినాడు.

"సారథీ! దీనభావమున దుఃఖించు మనుజులు వెంటరా నలంకరింపబడి మంచముపై నలుగురిచే మోయబడుచున్న యీతడెవరు?" అని ముందురీతి ప్రశ్నించినాడు.

శుద్ధాత్ములైన దేవతలచే నావిష్టుడై సారథి చెప్ప గూడనిదైనను యువరాజున కా సత్యము నిట్లు చెప్పెను: "కుమారా! బుద్ధియును, చక్షురాదీంద్రియములును, ప్రాణములును, వైదుష్యాది గుణములును నీతని విసర్జించినవి. ఈతడు దీర్ఘనిద్రను బొంది శుష్క–తృణ కాష్ఠ సమానుడై, చైతన్య రహితుడైయున్నాడు. ప్రియాతి ప్రియులైన బంధువులుసైత మీతని స్మశానమునందు విసర్జింతురు."

ఆ వాక్యములను విని యుద్విగ్న మనస్కుడై రాజ

నందనుడు "ఈ నాశన మీతనికి ప్రత్యేకమా? లేక, సర్వజన సామాన్యమా?" యని హీనస్వరమున సూతుని ప్రశ్నించెను.

"నాశము (మరణము) సర్వప్రాణి సామాన్యధర్మము. హీనులు, మధ్యములు, మహాత్ములునన్న భేదము లేకుండా మరణమందఱికి నియతముగ సంభవించును."

యువరాజు ధీరుడయ్యును నా మృత్యు విషయమును విని విషణ్ణుడయ్యెను.

"ప్రజలు ప్రమాద స్థితియందున్నను భయములేని వారై, శంకారహితులై యున్నారు. ఈ దేశకాలములు విహార యోగ్యములు గావు. వినాశ మెఱిగియు దుఃఖకాలమున జ్ఞానియైనవాడెట్లు విషయముల యందాసక్తుడగును ? కావున, రథమును వెనుకకు ద్రిప్పుము."

సారథి యువరాజు మాటలు వినియు రాజశాసనము వలన రథమును వెనుకకు మరలింపక కమల సరోవర మనోజ్ఞమైన యుద్యానవనమునకు రథమును తీసికొని పోయెను.

## ఉద్యాన ప్రవేశము

ఆ పురోద్యానము పంచమ స్వర మభ్యసించు కోకిలా సమూహమునకు పాఠశాల; మన్మథుని పుష్పబాణములకు మనోహర తూణీరము; షట్పద కామినులకు పానశాల; వసంత లక్ష్మికి క్రీడాగృహము; చరాచరాత్మకమగు విశ్వమున కభివందనీయుడై, ఘనుడైన అతిథి యువరాజున కుద్యానలక్ష్మి వాయువశమున నానమితములైన యారామవృక్షముల మిషచే ప్రణామాంజలి సమర్పించినది. పుష్పపరాగ వ్యాకీర్ణమై ప్రవహించు మకరందములచే సిక్తమై చెట్లనుండి రాలుచున్న పుష్ప

సమూహముచే నుపహారముల సమర్పించుచున్న యుద్యానమున నా వీరుడు విహరించెను.

## ప్రమదా విలాసము

ఆ యుద్యాన వనమున శుద్ధోదను నానతిచే యువరాజునకు మానసోల్లాసము గల్పించుటకై సుందరీమణులు కౌతూహలముచే చలించు కన్నులతో నాతని సన్నిధికి వచ్చిరి. పద్మకోశములతో సమానమైన హస్తములతో వారు భక్తిపూర్వకముగ నమస్కరించిరి. భూతలాప్సరసలను బోలిన యా ప్రమదలు యువరాజు హృదయము హరించుటకు హావభావ విలాసాది శృంగార చేష్టల నన్నిటిని ప్రదర్శించిరి. సాక్షాన్మన్మథ మన్మథుడైన యువరాజును గాంచి వారి హృదయములలో మదన భావ మధికమైనది. నందనోద్యానమున నప్సరసలచే పరివృతుడైన దేవరాజువలె యువరాజు ప్రకాశించెను. కొందఱాయనను మృదుబాహు లతలతో బంధించిరి. కొందఱు చంద్రబింబ సదృశమగు నాతని వదన బింబమును సుధామయమని కొనియాడుచు చుంబించి, యమృతపానము చేసినట్లు తన్మయీ భావమందిరి.

## ధైర్యమేరువు

శృంగార రసాధి దేవతలైన యా ప్రమదావతంసముల గుణములును, చేష్టలును, నలంకారములును ధైర్యమేరువైన యువరాజును చలింపజేయలేదు. ఆయన తన మనస్సున వారిని 'యౌవన మశాశ్వతమనియు, జర రూపమున నశింపజేయుననియు, మృత్యువు సర్వనాశనకారి యనియు నెఱుగని



సిద్ధార్థునకు వైరాగ్యమును కలిగించిన నాలుగు దృశ్యములు.

ముగ్ధ'లని తలంచెను. తమ భూషణములు, పుష్పమాలలు, కలాగుణములు, ప్రణయములును నిష్ఫలములని తమ హృదయములయందే మదనత నణంచుకొని భగ్నమనోరథలై యా కాంతలు పురమునకు మరలిపోయిరి. సాయంసమయమున నుద్యానవనమును జనశోభ వీడుటగాంచి సర్వగతమైన యనిత్యతను భావించుచు యువరాజు రాజభవనమునకు వెళ్ళెను.

## చతుర్థ దర్శనము

మరియొకనాడు విహారయాత్రకు బయలుదేరిన యువరాజొక సన్యాసిని జూచెను. "కాషాయవస్త్రములను ధరించి యధికమైన ప్రశాంతితో దేనిని గమనింపక పోవు నాతడెవ"రని యువరాజు సూతుని ప్రశ్నించినాడు.

"కుమారా! అతడు జనన మరణ భీతిగల శ్రమణుడు. విశుద్ధమానసముతో, పవిత్ర శీలముతో, సర్వవాసనలను, పాపముల నున్మూలించిన తపోధనుడు; సత్పురుషులకు సన్నిహితుడు. జన్మ జరా వ్యాధి మృత్యు వికార తరంగములతో భయంకరమైన సంసార సముద్రమును దాటి,మహోత్తమమైన నిర్వాణ పదమును బొందబోవుచున్నాడు. పరమార్థము కొఱకై యింద్రియార్థములను త్యజించిన భిక్షువు."

తానుగూడ శ్రమణుడై జనన మరణ రహస్యములను దెలిసికొనవలయునని సిద్ధార్థుడు నిశ్చయించెను. వసంత శోభతో వెలిగిపోవు నుద్యానవనమున నాతడానిశ్చయముతో విహరించెను. ముందువలెనే యువతీసమూహమాతని వెన్నంటియుండెను. వారి మనోహ రాలాపములను విని సిగ్గుపడి కోకిలలు సయితము మౌనము వహించెను. యువరాజు

మనస్సు నిశ్చయాత్మకమైనది గాన, నాతడు వరవర్ణినీ బృంద ముతో వనవిహార మొనరించి మధ్యాహ్న సమయమున నొక రమణీయ దీర్ఘిక కేగెను.

మందపవనాందోళిత తరంగముల నుయ్యేలలూగు రాజ హంసలతో, కల్హార పుండరీక రక్తారవిందములయందు మాధ్వీ కము గ్రోలు భృంగీ సమూహముతో నయనానందకరమై సురదీర్ఘికను బోలిన యా దీర్ఘికయందు యువరాజు సతులతో జలక్రీడ లాడెను. కాని, యువరాజు మనస్సున కామవాసన లే మాత్రము లేవు. ఆతని చిత్తము నిస్సంగ స్థితి నందియుం డెను. అట్లు విహరించు సమయముననే తనకు కుమారుడు గలిగినాడన్న శుభవార్తను యువరాజు వినియును సంతసింప లేదు; "పుత్ర జననము నా కొక రాహుల" (ఆటంక)మని యన్నాడు.

శుద్ధోదను డదివిని యా కుమారునకు రాహులు డనియే పేరు బెట్టెను. ప్రజలు తమ యువరాజుకు కుమారుడు గలిగి నాడని యానందముతో నుత్సవములు చేసికొనిరి. రాజకుమా రులకు దగిన సముజ్జ్వల వస్త్రాభరణములచే భూషితుడై రాజ భవనమునకు దిరిగి వచ్చుచున్న యువరాజు దివ్యసుందర మూర్తినిజూచి, కిసగౌతమి యను శాక్య కన్య పార వశ్యముతో సాంజలియై యిట్లు పాడెను. *

---

* సుఖతా బత నిర్వృతా చ సా స్త్రీ। పతి రీదృక్త్వమి వాయ తాక్ష యస్యాః। ఇతి తం సముదీక్ష్య రాజకన్యా। ప్రవిశంతం పథి సాంజలిర్జగాద।
(బుద్ధ 5-24)

## కిసగౌతమి ఆనంద గీతము

నిబ్బుతా నూన సామాతా
నిబ్బుతో నూన సోపితా
నిబ్బుతా నూన సానారీ
యస్సా’యం ఇదిసోపతి.

“ఈతని గన్న తల్లి పరమానందవతి. ఇతని తండ్రి పరమానందవంతుడు. ఈతని భార్య పరమానందవతి” యని దాని భావము.

ఆ గీతము విని యువరాజు పరమ శాంతి ననుభవించెను. అందలి నిబ్బుత (నిర్వృత) శబ్దము నిర్వృత్తి భావము నాతనియందు వెలిగించెను. నిర్వాణ మార్గమున నతని మనస్సు స్థిరపడెను. శరత్కాల లక్ష్మి నిర్మల నీలాకాశమును గోరు రీతి యువరాజు బుద్ధి నిర్వాణ శాంతిని గోరెను. తన మెడలోని మౌక్తిక హారమును కిసగౌతమికి బహూకరించి యువరాజు రాజభవనమున ప్రవేశించెను.

తండ్రి సమ్మతి లేకుండ తాను నిర్వాణ శాంతికై యరణ్యములకు బోయిన సమంజసముగ నుండదని యానాడే సిద్ధార్థుడు తన కోరికను శుద్ధోదనున కెఱిగించెను. కాని, రాజు అందుల కంగీకరింపలేదు. యౌవనమున విషయ భోగముల ననుభవించి, గృహస్థ ధర్మమును నెరపి, వార్ధక్యమున తపోవనమునకు బోవుట ధర్మమని యాతడు సిద్ధార్థునకు బోధించెను.

“రాజా! జీవితమునకు మరణ భయము లేనియెడల, నారోగ్యమును రోగము హరింపనియెడల, యౌవనము జరా

ప్రాంతముగానియెడల, సంపత్తి విపత్తి పాలుగాక శాశ్వత మైన యెడల నేను తపోవనమునకు వెళ్ళను" అనెను యువ రాజు. కాని, రాజేమాత్రము సమ్మతింపలేదు.

ఆ రాత్రి యువరాజు మనస్సు సంతోషింపజేయవలయు నని వరాంగన లెందరో నృత్యగాన విలాసముల నెరపిరి. కాని, యాయన మనస్సు విషయాకర్షణముల కందక బహు దూర మైన ధ్యానభూముల కెగిరిపోయినది; లోకదుఃఖమును గుఱిం చిన విచార మధికమైనది. నృత్య గానముల నెరపి యలసి పోయి నిద్రించుచున్న ప్రమదాజనమును యువరాజు చూచెను.

చెదరిన కేశపాశములతో, న స్తవ్య స్తములైన యలం కారములతో, పుష్పమాలలతో, జారిన వస్త్రములతో, చైతన్య రహితలై, ప్రాణములు బోయినవారివలె కొందఱు పడియుండిరి.

ఒక యువతి నోరు తెఱచుకొని, నోటినుండి లాలా జలము స్రవించుచుండగా, గుహ్యాంగము బయలుపడగా సంజ్ఞాశూన్యయై యుండెను. మదఘూర్ణితయై యామె మౌనము గనే తన శరీర వికారమును వెల్లడించెను.

ఆ యౌవనాంగుల దృశ్యమాతనికి జుగుప్సాకరముగ గనబడెను. ఆకృతిలోని యా చాంచల్యమును జూచి యువ రాజు కామభోగముల నసహ్యించుకొనెను. మనోజ్ఞమైన రాజ సౌధమా విచారశీలునకు మృతకళేబర దూషితమైన శ్మశాన ముగ గోచరించెను. సమస్త జీవలోకము నగ్నిజ్వాలల మధ్య నున్నట్లాయన భావించెను.

ఆయన యీ విధముగ తలపోసెను. "జీవలోకమున

స్త్రీ ప్రకృతి యశుచియును, వికృతమునైనది. వారి వస్త్రా భరణముల వలన వంచితుడై మనుష్యుడు స్త్రీ విషయమున రాగమును బొందుచున్నాడు. స్వప్నవికార సదృశమైన స్త్రీ శరీర ప్రకృతిని విచారించినయెడల మనుష్యుడు ప్రమాదము పాలుగాడు. స్త్రీల గుణములను సంకల్పించుకొనుటవలనే వారి యందు రాగము గలుగుచున్నది. అసలు తత్త్వమును విచారించిన రాగమునకు కారణమే లేదు.''

తరువాత సిద్ధార్థుడు ఛన్నుని బిలిచి ప్రయాణమునకు కంథకాశ్వము నాయత్తము చేయుమని యాదేశించెను. ఛన్నుడశ్వము నాయత్తముచేయులోపల కడసారి యశోధరను, కుమార రాహులుని చూడవలయునని యువరాజు యశోధరా మందిరమును ప్రవేశించెను; సువాసనలు విరజిమ్ము పూల పాన్పుపై శిశువును గౌగిలించుకొని గాఢ నిద్రలోనున్న ప్రియ సతిని చూచెను. ఆమె నిద్ర లేచిన తన నిశ్చయమున కంతరా యము గలుగునని దూరమున నుండియే కరుణాపూర్ణమైన వీక్షణముతో మాతా శిశువులను చూచి యాతడు సౌధమును దిగివచ్చెను.

## మహాభి నిష్క్రమణము

ఛన్ను డెంత బ్రతిమాలినను వినకుండ కంథకాశ్వము నధిరోహించి, యాతడు వెంటరా కపిలవాస్తునుండి సిద్ధార్థుడు నిష్క్రమించెను. పురము నవలోకించి యాతడు ''జనన మరణ ముల యదృష్టపారము నెఱుగువఱకు కపిలవాస్తు ప్రవేశింప'' నని సింహామువలె గర్జించెను. అమ్మహాత్యాగ మహిమ నాల



మహాభి నిష్క్రమణము.

కించిన మూడు కాలములు రోమాంచమును వహించును గదా! ఆ చర్యనే మహాభి నిష్క్రమణమందురు.

ఆ విధమున నా ప్రజ్ఞాశాలి హయ గజ రథౌఘ సంకులమును, శ్రీ మద భయమును, ననురక్తజనమునైన కపిల వాస్తును విడిచి తపమునకై యరణ్యము నాశ్రయింపనేగెను.

రాత్రియంతయు ప్రయాణము జేసి శాక్యరాజ్యము, కోలియ రాజ్యము, మల్లరాజ్యము, మైనేయ రాజ్యమును దాటిపోయెను. ఆయన 'అరోమా' నదీ (అనవమా నది) తీరమును చేరువరకాగ లేదని కొన్ని గ్రంథములు చెప్పుచున్నవి. అనవమా (అరోమా) నది "మరాళ మహిళలచే నాస్వాదితములైన మృణాళ దళములచే మేదుర" మనియు, "కల్లోల వల్లి వలయ సముల్లాసిత సారస" మనియు కావ్యవర్ణన.

సిద్ధార్థు డనవమానదీ పులిన తలమున కంఠకాశ్వము నవరోహించి, తన భూషణములను, వస్త్రములను ఛన్నునకొసగి, కంఠకాశ్వముతో కపిలవాస్తు పురికి తిరిగి వెళ్ళి తండ్రికిని, తల్లి ప్రజాపతి గౌతమికిని, తన యశోధరకును తన పరివ్రజనవార్త తెలిపి వారి నోదార్పవలయునని యాతని కోరెను.

ఛన్నుడేడ్చి యేడ్చి ప్రయోజన మేమియును గానక వెనుదిరిగి కపిలవాస్తుకు వచ్చి, యా వార్తను రాజభవనమున దెలిపెను. ఆ వార్త విని ప్రజలందఱును దుఃఖమగ్నులు కాగా ఇక గౌతమీ శుద్ధోదనులను గుఱించి యేమి చెప్పవలయును; యశోధరా హృదయము నేమని వర్ణింపవలయును?

## శ్రమణుడు

తన ఖడ్గముతోనే సిద్ధార్థుడు తన శిరోజములను ఛేదించుకొని యాదికల్ప సముత్పన్నమును, ఆదిబ్రహ్మ సమాహృతమును, సర్వోత్తమమునైన తపోధన వేషమును పరిగ్రహించెను. అంతలో తపోదీక్షితుడైన శాక్యసింహుని వీక్షించి యానంద మందహాస మొనరించెనేమో యనునట్లు పూర్వదిశ పాండురమయ్యెను. అనల్ప గుణభాసురుడైన యా తపోధనుని శాసనమున నమరేంద్ర దిశ కాషాయాంబరమును ధరించెనో యన నంబరము సంధ్యా పాటల వర్ణమున ప్రకాశించెను.

తన వంశమున జన్మించిన మహాత్ముడైన శ్రమణ గౌతముని నానందమున వీక్షించుటకై వచ్చెనోయన పూర్వాద్రిపై నాదిత్యుడు వెలసెను. ఈ యుదయరాగ కాంతులలో శ్రమణ గౌతముడు రాజగృహ పురాభిముఖుడై వెళ్ళెను.

## రాజగృహము

రాజగృహము మగధదేశపు రాజధాని. రాజగృహ సమీపమున వైహార, వరాహ, ఋషభ, ఋషిగిరి, చైత్యకములను పర్వతములు ఉన్నత శిఖరములతో, శీతల స్నిగ్ధచ్ఛాయలతోడి యున్నత వృక్షములతో దర్శనీయముగ నుండెను. ఆ సమీపముననే సరస్వతీనది ప్రవహించుచుండెను. ఆ పర్వతారణ్యములలో చాలమంది శ్రమణులు తత్త్వ విచారము చేయుచు తీవ్ర తపమాచరించుచుండిరి.

రాజగృహ పురమునకు భిక్షకోసము వెళ్ళిన శ్రమణ గౌతముని మహాపురుష లక్షణములు ప్రజల నాకర్షించినవి.

ఆతడు దేవరాజైన యింద్రుడో, లేక మహాబ్రహ్మయో యని ప్రజలు భావించిరి. మగధాధిపతి బింబిసార మహారాజు సౌధాగ్రభాగముననుండి, బాలసూర్య ప్రభలతో ప్రకాశించుచున్న శ్రమణుని జూచి, యాతని సమాచారము తెలిసికొనుటకై సేవకుల నంపెను. భిక్షను స్వీకరించి యా మహాశ్రమణుడు పాండవ పర్వత గుహకు వెళ్ళినాడని సేవకులు బింబిసారునికి తెలిపినారు.

వారి మాటలు విని రాజు రథమెక్కి యా యద్భుత శ్రమణుని దర్శించుటకై స్వయముగా పాండవ పర్వత గుహకు వెళ్ళినాడు. పర్వత పాదమున రథము దిగి బింబిసారుడు పాదచారియై శ్రమణుని సన్నిధికి పోయినాడు. పరస్పర మైత్రీ సంభాషనానంతరము, ప్రథమ యౌవనమున సుకుమార సుందరుడై యభిజాతునివలె దోచుచున్న యాతడేల శ్రమణుడయ్యెనో తెలుపవలయునని రాజు గౌతముని గోరినాడు; అనంత సంపదను, సైన్యాధ్యక్షుని యధికారమును నొసగెదనని యాశ చూపినాడు. కాని, శ్రమణ గౌతముడు వానినంగీకరింపలేదు.

"రాజా! హిమాలయ పర్వత సానుభాగముననున్న కోసలదేశమున నాదిత్య వంశమునకు జెందిన శాక్యకులమున జన్మించితిని. విషయ సుఖముల యందలి యనర్థమును గాంచి, వానిని పరిత్యజించి పరివ్రజన మానంద దాయకమని వరించితిని.

## సత్యాన్వేషణము

**"నిఖ్ఖభిక్ఖూ ! ఇమంనావం సిత్తాతే లహుమేస్సతి**
**ఛేత్వారాగఞ్చ దోసఞ్చ తతో నిబ్బాణ మేహిసి (పబ్బజ సూత్తము)**



బింబిసారుడు సిద్ధార్థుని దర్శించుట.

"ఓ శ్రమణుడా! ఈ జీవనౌకను భారవిముక్తముగావించుము. భార రహితమైననౌక గమ్యమును శీఘ్రముగ జేరగలదు. రాగద్వేషాది ద్వంద్వనాశనమున నిర్వాణము లభించును."

## తపశ్చర్య

బింబిసారుడొసగు సంపదను, నధికారమును నంగీకరింపక శ్రమణ గౌతముడటనుండి బయలుదేరి యరణ్యములకు వెళ్ళెను. అప్పుడాయన వయస్సు ఇరువది తొమ్మిది సంవత్సరములు. తమ యాశ్రమములలో నివసింపవలయునని యిరువురు బ్రాహ్మణశ్రమణీ మణులాయన నాహ్వానించిరి. రైవతక బ్రహ్మర్షి, రాజకత్రి దండికులను తాపసులాయనను తమ యాశ్రమమునందుండ ప్రార్థించిరి.

## ఆలారకాలాముడు

వారికి వినయ పూర్వకముగా సమాధాన మొసగి శ్రమణ గౌతముడు, వైశాలీ నగర ప్రాంతముననున్న యాలారకాలాముని యాశ్రమమునకు వెళ్ళెను. ఆలారకాలాముడు ధ్యానయోగమున గొప్ప సిద్ధి (సమాపత్తి)ని పొందినాడు. ఆతడు మోక్షవాదియని యశ్వఘోషుడన్నాడు. 'అకించన్యాయతన'మను (దేనిని కోరని మనస్సుయొక్క యున్నత స్థితి) సమాధి నతడు సాధించినాడు. శ్రద్ధా విశ్వాస సంపన్నుడైన శ్రమణ గౌతముడా స్థితిని తన మనోబలనువలన సులభముగ సాధించినాడు.

## రుద్రక రామపుత్రుడు

ఆలారకాలాముని యొద్ద సెలవు గైకొని శ్రమణ గౌతముడు "ప శ మ న మ తి" యైన రుద్రక రామపుత్రుని

యాశ్రమమునకు వెళ్ళెను. ఆయన సన్నిధి "నైవ సంజ్ఞా నా సంజ్ఞాయతన"మను మరొక ధ్యానభూమికను (సమాపత్తి) శ్రమణ గౌతము డాత్మబలమువలన సులభముగ సాధించి నాడు. ఇది పైదానికంటె గొప్పది. ఈ ధ్యాన భూమికలను గురించి పాఠకులు ప్రత్యేకముగ తెలిసికొన వలయును. లోకోత్తరమైన నిర్వాణశాంతి నివి యొసగ జాలవు.

## పంచ వర్గీయులు

ఆకాశమునందలి ఘంటానాదమువలె గౌతముని త్యాగ మహిమ దేశమంతటను వ్యాపించినది. రుద్రక రామపుత్రుని శిష్యులైన కౌండిన్య, (కొండణ్ణ) భద్రక (భద్దియ), వాసవ (వప్ప), మహానామ, అస్సజి (అశ్వజిత్తు) యనువారు గౌతముని యనుచరులైనారు. వీరిలో కౌండిన్యుడు పెద్ద వాడు. కపిలవాస్తుపుర సమీపమునందలి ద్రోణ వాస్తుపుర మున శ్రీమంతమైన బ్రాహ్మణ కుటుంబమున నతడు జన్మించెను. వేదవేదాంగవేత్త. సిద్ధార్థుని భావిజీవితమును గురించి యీతడు ప్రవచించెనని ముందే చెప్పబడినది. వాసవుడు (వప్ప) కపిల వాస్తుపురమున వాశిష్ఠ బ్రాహ్మణుల వంశమున జనించెను.మిగిలిన ముగ్గురిని గురించి మనకంతగా తెలియదు. ఆ యైదుగురు శ్రమణులకే పంచ వర్గీయులని పేరు.

## కఠోర తపశ్చర్య

వారితో కలిసి శ్రమణ గౌతముడు గయాశీర్ష పర్వత మునకేగెను. అచ్చట తాపసులు చాలమంది కఠోర తపస్సును

జేయుచుండిరి. వారెంత కఠోర తపోదీక్షితులైనను వారి మానసములు ప్రాపంచక వాసనాకలుషితములని మహాశ్రమణుడు గ్రహించెను. వాసనా బద్ధమైన మనస్సు దేనినీ సాధింపజాలదని యాయన తలంచెను. అటనుండి యురువేల (ఉరువిల్వ) ప్రాంతమున కాయన యైదుగురు తాపసులతో వెళ్ళెను. సమీపముననే నైరంజరానది కూలంకషముగ ప్రవహించుచున్నది. సేనానీ గ్రామ మచ్చటికి సమీపమే. అచ్చటనైదుగురు తాపసులతో శ్రమణ గౌతముడు కఠోర తపమొనరించుటకు పూనుకొనెను. ఆ కాననమున నైరంజరా నదీతటమున సంసార క్లేశ శాంతికొఱకై మహా తపస్వులకు సైతము దుష్కరమైన తపస్సు నా ధీర హృదయు డాచరించుచుండెను.

అర్ధరాత్రి వేళల చీకట్లలో, రాత్రి సంచారము జేయు జంతుల యఱపులును, ఘూకారావములును మానవ హృదయమునందలి యవిద్యా కాంతారములలో చరించు కామ క్రోధ లోభాదులైన యశుభ గుణముల ప్రేరణలవలె వినబడుచుండెను. ఆరు వత్సరము లావిధముగ నా మునిచంద్రుడు అనన్యసాధ్యమైన కఠోర తపస్సాచరించెను. ఆయన శరీరము శుష్కించి యస్థిపంజరమయ్యెను. చంద్రప్రభా భాసమానమైన యా మహా పురుషుని దేహచ్ఛాయ వివర్ణమై వికృతమయ్యెను; ముప్పదిరెండు మహా పురుష లక్షణము లదృశ్యమయ్యెను.

## శరీర వీణ

ఒక నాడా ముని స్మృతి తప్పి పడిపోయెను. శరీరమును శుష్కింపజేయు కఠోర తపస్సులవలన ఫలము శూన్య

మని యా శ్రమణుడు గ్రహించి, నాటినుండి వానిని వదలి వేసెను. వీణా తంత్రుల నెక్కువగా బిగించినను, లేక వదులుగా విడిచినను మనకు మనోహరమైన నాదము లభింపదు. వీణానాదము మనోహరముగ నుండవలెనన్న దాని తంత్రులు చాల వదులుగాను బిగువుగాను నుండక, మధ్యేమార్గముగ నుండవలయును. తంత్రులు తెగిపోయిన నాద మెగిరిపోవును, వదులుగా నుంచిన నాదము నశించునన్న భావముగల గీతమును నగరముననున్న ఇంద్రదేవాలయమున నాట్యము చేయుటకు బృందముతో వెళ్లుచున్న యొక నర్తన బాలిక పాడినది. ఆ గీతార్థము నా శ్రమణుడు గ్రహించెను; మరల యాహారము గ్రహించి తన శరీరము బలిష్ఠ మొనరించుటకు సంకల్పించెను.

## నాయమాత్మా బలహీనే నలభ్యః

జ్ఞానము బలహీనులకు లభింపదు. ధర్మమునుగాని, జ్ఞానమునుగాని సాధించుటకు బలిష్ఠమైన శరీరము ప్రసాధన సాధనము. అధికము భుజించువానికిని నేమియు భుజింపని వానికిని సమాధి కుదరదు. యుక్తాహార విహారములును, యుక్త చేష్టలును, యుక్త స్వప్నావబోధములు కలవానికే (తగిన నిద్రాజాగరణములు) సర్వ దుఃఖములను నశింపజేయు యోగము లభించునని కదా బుద్ధుల (జ్ఞానుల) సూక్తి! అన్నిటియందును యుక్తత (పరిమితి) యవసరము. విచారశీలుడైన యా శ్రమణుడు మరల భిక్షాన్నమును గ్రహించుటకు మొదలిడెను.

ఒకనాడు ప్రత్యూష సమయ ధ్యానము నాచరించిన తరువాత, భిక్షావేళను నిరీక్షించుచు, పూజా విహిత సత్కృత

మైన నొక న్యగ్రోధ (వట) వృక్షమూల ప్రదేశమున నా ముని యాసీనుడై యుండెను.

## సుజాతాదేవి వ్రతనిష్ఠ

ఉరువేల ప్రాంతమున సేనాని గ్రామముండెనని ముందే చెప్పబడినది. సేనాని యనునాతడా గ్రామమునకు పెద్ద. ఆయనకు సుజాత యనుకూతురు కలదు. ఆమెకు కుమారుడు కలిగినందున నా న్యగ్రోధ వృక్షవాసినియైన దేవతను వైశాఖ మాసమున నిండు పున్నమనాడు (మొలకల పున్నమ) ఆరాధింపవలయునని సుజాతాదేవి వ్రతనిష్ఠ బూనినది. న్యగ్రోధ వృక్షవాసినియైన దేవత వరప్రసాదమున తనకు సంతాన ప్రాప్తి కలిగినదని ఆమె విశ్వాసము. సుజాత క్షీరాన్నమును భక్తితో వండినది. పాయసమును వండునపుడే యామెకు కొన్ని శుభ సూచనలు కనపడినవి. తన పరిచారికయైన పూర్ణను న్యగ్రోధ వృక్షము దగ్గరకు వెళ్ళి, చూచిరమ్మన్నది. పూర్ణ వెళ్ళి, యా వృక్షమూలమున కాంతిరాశియై వెలుగుచు నాసీనుడై యున్న మహాశ్రమణుని గాంచి యా దృశ్యము మునకు కంపించి పోయినది; సుజాతా దేవితో వృక్షవాసినీ దేవత సాక్షాత్కరించినదని చెప్పినది.

## సాక్షాత్కరించిన వృక్షవాసినీ దేవత

సుజాత నూత్నమైన సువర్ణ పాత్రయందు పాయసమును దీసికొని, మంగళకరముగ నలంకరించుకొని, వృక్ష సమీపమునకు బోయినది. వృక్ష మూలమున నివాత దీపకళికవలె నిశ్చల కాంతితో ప్రకాశించు మునీంద్రుని గాంచి మానవ

రూపమున ప్రత్యక్షమైన వృక్ష వాసినియైన దేవతగా భావించి శ్రద్ధా భక్తులతో పాయస పాత్రను సమర్పించినది. *

## నైరంజరా తటము

మహాశ్రమణుడా పాయస పాత్రను గ్రహించి నైరంజరా నదీ తటమునకు బోయెను. శరత్కాల యామిని వలె విమలమైన జలమున నా ముని స్నానమాచరించి సువర్ణ పాత్ర యందలి పాయసమును ప్రీతితో నారగించెను; తనకు 'సంబోధి' (పరమ జ్ఞానము) లభించుట నిజమైనయెడల నదీ ప్రవాహమున కెదురుగా తేలిపోవుగాకయని యా పాత్రను నదిలోనికి విసరివేసెను. ఆశ్చర్యముగా నా పాత్ర ప్రవాహము కెదురుగా కొంతదూరము తేలిపోయి నాగలోకమునకు బోయిన దట!

సుజాతాదేవి యాతిథ్యములోని కరుణను, మాధుర్యమును శ్రమణగౌతము డెప్పుడును మఱచిపోలేదు. జీవితాంతమున మరణ శయ్యయందున్నప్పుడు సైతము సుజాతాదేవి విందు తనకు (సంబోధి) జ్ఞానోదయ కారణమైనదని ప్రశంసించినాడు.

## దయాదరాలు

శ్రమణగౌతముడు తపస్సును మానివేయుట జూచి, యతడు బలహీనదశయందున్నను, సానుభూతి యెంతయాతని

* లలితవిస్తారమున నీ కథ కొంత భేదముగ చెప్పబడినది. బోధిసత్త్వుని కాతిథ్యమొసగుటకే సుజాత యచ్చటకు వెళ్ళినదని అందు చెప్పబడినది.

కవసరమైయున్నను దయలేనివారై అయిదుగురు తాపసులు నాతని చంచలునిగా తలంచి,విడిచిపెట్టి కాశికి వెళ్ళిపోయినారు.

## సాలవనము: వసంత మనోరమము

సుజాతాదేవి యాతిథ్యమువలన బలసంపన్నుడై మహాశ్రమణుడు నైరంజరాతటముననున్న మనోజ్ఞ సాలకాననమున సాయంకాలమువరకు విహరించెను. ఆ సాలవనమున వృక్ష పల్లవముల కాంతి బాల సూర్యప్రభ నుపమించుచుండెను. కోకిలలు మనోజ్ఞముగ బాడుచుండెను మందానిలముచే కదలుచున్న పుష్పలతా డోలికలలో మదించిన యాడు తుమ్మెద లూగుచుండెను. వనప్రియములు (కోకిలలు) బాలరసాల సాల నవపల్లవముల నాస్వాదించి మోద మానము లగుచుండెను. మందార పుష్ప కోరకముల (మొగ్గల) నుండి స్రవించు మకరంద వాసనలెల్లెడల వ్యాపించియుండెను. మద జనకములైన శీతల వాయువుల స్పర్శ మానసోల్లాసముగ నుండెను. వికసించిన పుష్పమంజరులచే నా ప్రదేశము పింజర వర్ణమున ప్రకాశించుచుండెను; భ్రమరము లానందమున ఝుంకరించుచుండెను. రసాల ఫల రస ప్రవాహమున నా ప్రదేశము పంకిలమైయుండెను. ప్రఫుల్లములైన సుమనోవల్లీమ తల్లులతో మలయ సమీరుడు సరము లాడుచుండెను. వసంత సమయ లక్ష్మికి యీ వనము మనోహరసామ్రాజ్యమణిమంటపమై యుండెను. తాలీ తమాల హింతాలాది వృక్షముల నిండిన యీ సాలకాననమున మహాశ్రమణుడు మధ్యాహ్న తాపమును బాపుకొనెను. (బుద్ధఘోషుడు).

## మహాబోధి వృక్షము

ఆనాడేలనో సకల ప్రాణిహృదంతరాళముల లోకో త్తరమైన యానందము స్పందించినది. సాయంకాలమున మహా శ్రమణుడు లేచి సమీపముననున్న యశ్వత్థవృక్షమును చేరెను. యావసికుడను గడ్డి కోసికొను వానినుండి కొన్ని దర్భలను గ్రహించి వాని నాసనముగా జేసికొని యా మహాత్ముడశ్వత్థ వృక్షముక్రింద తూర్పుభాగము నాసీనుడయ్యెను. [బ్రహ్మయే దర్భాసనము నొసగెనని కొన్ని గ్రంథముల చెప్పబడినది. ఆ యాసనమును 'అపరాజిత పర్యంక'మనియును, బోధిపర్యంక మనియును కావ్యములు వర్ణించినవి. వజ్రాసనమనికూడ నది వర్ణింపబడినది.]

ఆ యశ్వత్థవృక్షమే తర్వాత మహాబోధి వృక్షమని ప్రసిద్ధి నహించినది.

## విచార ధార

అంతవఱకు మానవులు మోక్షానందమునకు సాధన ములుగ దలచిన తపోవ్రతాదులు నిష్ఫలములని భావించి యసంతృప్తుడై యున్న యా మహాశ్రమణుని హృదయమున ననేక మోహతరంగములు లేచినవి; అంతయు సంశయాత్మ కమైపోయినది. "సానుభూతి నపేక్షించు సమయమున కరుణా దూరులై యనుచర తాపసులు విడిచి వెళ్ళినారు.. ఆరు ఏండ్లు సాధించిన కఠోరతపమునకు శ్రమ మాత్రమే ఫలముగా మిగిలి నది. శాంతికేది మార్గము? జ్ఞానోదయమగువఱకు, జనన మర ణముల కనపడని పారమును తెలిసికొనువఱకు నే నీ యాసనము

నుండి లేవను. సంబోధి బొందని యెడల నా శరీర మిచ్చటనే నశించిపోవు గాక!'' యని వజ్రసంకల్పముతో నా సంయమి ధ్యాన సమాధిమగ్నుడైనాడు. *

## మార సైన్యము

ఆ సమయమున గౌతముని మనస్సున జనించిన సందేహా భ్రమాదులే మారుని కార్యముగ కావ్యములు వర్ణించినవి. అవి యాయన హృదయాంతరాళమున జనించిన భావ పరస్పర సంఘర్షణా రూపములో, లేక- భౌతికముగ సత్యములో పాఠకులే నిర్ణయించుకొనవలెను.

శ్రమణ గౌతముని ధ్యానసమాధిని గుఱించి మారుడు విన్నాడు. ఆతడు జీసస్సు జీవితములోని 'సేటన్' వంటివాడు. అతని మనస్సు చాల క్షోభించినది. అరతీ తృష్ణారాగాదులును, మారుని ముఖ్య సహచరులైన సక్కాయదిట్ఠి (సంకుచితాత్మ భావము), విచికిత్సా, శీలబ్బత పరమసకామ, పతిఘ, రూప

* ఇహాసనే శుష్యతు మే
త్వగస్థిమాంసం ప్రళయంచయాతు
అప్రాప్యబోధిం బహుకల్ప దుర్లభాం
నైవాసనాత్ కాయమే తత్ చలిష్యతి. (లలిత విస్తారము).

''ఈ ఆసనముననే నా శరీరము శుష్కించి పోవుగాక!
చర్మాస్థిమాంసములు సర్వనాశనమందుగాక!
అనేక కల్పములు శ్రమించినను లభింపని బోధిని-
పరమజ్ఞానమును-
పొందనంతకాలము ఈ ఆసనమునుండి నా శరీరము
చలింపకుండు గాక!''

రాగ, అరూపరాగ, మాన, ఉద్ధచ్ఛ, నివిజ్జలనువా రను శ్రమణుని ముట్టడించినారు.* యక్షులును,రాక్షసులును, కుంభాండులును, నరగులును, పిశాచులును అమ్మహాముసీం ద్రుని బాధించినారు.

ఆ నాడు నిండుపున్నమయైనను కటిక చీకట్లు దిక్కుల నావరించినవి. సముద్రములు పర్వతోన్న తరంగములతో ఘూర్ణిల్లినవి; నదులు వెనుకకు ప్రవహించినవి. ప్రలయకాల సమీరమో యనునట్లు ఝంఝూమారుతము వీచి, కొండలు విరిగిపడినవి. మహాబలసంపన్నమగు ప్రలయమారుతము సర్వ గుణభారగురుడైన మునీంద్రుని చలింపజేయలేకపోయినది. మారసైన్యము వివిధభయంకరాయుధములను ప్రయోగించినది కాని, యవి యన్నియు పుష్పమాలికలై మహాబోధి వృక్షము నలంకరించినది.

చలింపని మునీంద్రుని మారుడు యుక్తితో వంచింప దలచినాడు. "ఈ యాసనము నాది. ఇటనుండి లేచి త్వరగా, దూరముగ వెళ్లుము. నేను పరమ పారమిక (గొప్పధర్మములను) నావర్తించినాను (నెరవేర్చినాను). దానికి సాక్షి యీ నా సైన్యమే."

ఆదిభిక్షువు (పరమేశ్వరుడు)తో సమానుడైన మునీం ద్రుడా మాటలు విని తన యంకమునుండి హస్తమును పైకి యెత్తినాడు. అంతలోనే భయమంది మారుడు పలాయితు డయ్యెను.

---

* వీని వివరణమునకై బౌద్ధయుగము Vol–I Page 68 చూచు నది.

## మారకామినులు

తరువాత మారుని కుమారికలు తమ త్రిలోక కమనీయములైన యౌవన సౌందర్యములతో ముని మనస్సు వశము చేసికొనుటకై వచ్చినారు; మనోహర పద మంజీర ధ్వనులతో సుందర రత్న కంకణ ఝణఝణత్కారములతో మునీంద్రుని ముందభిరామముగ నాట్యమాడినారు. "సిద్ధార్థా! పంచేంద్రియ సమ్మోహనకరములైన శబ్దాది యింద్రియార్థములకు మేము నిధానములము. మమ్మనుభవించి యౌవన మధురిమామృతమును పానము చేయుము. ప్రణయ సుధాకరములైన మా యధర బింబములకంటెను చందన పంక చర్చితములై తుషారగౌర ముక్తాహార భూషితములై యాశ్రితుల తాపము హరించు మా పయోధరములకంటెను, హేమమేఖలా రమణీయములై రసోద్దీపకములైన మా నితంబ బింబముల కంటెను కోరదగినవి త్రిలోకముల లేవు.

"సమాధి యను మిషచే కనులు మూసి యే అతిలోక సౌభాగ్యసంపన్నయగు సుందరిని ధ్యానించుచున్నావు? క్షణకాలము కనులు తెఱచి మనోజ శర శకలిత స్వాంతలమైన మమ్ములను జూడుము. మమ్ములను రక్షించుటకు దక్షుడవయ్యు నుదాసీనత వహించితివి. నీవు మిథ్యాకారుణికుడవు. దీనరక్షణకుగాని కరుణ గగన ప్రసూనము వంటిది. మమ్ము మనోజతాపమునుండి రక్షింపకున్న నీకంటె నిర్దయాగ్రేసరు డెవ్వడు?" అని మారకామినులీర్ష్యచే మునీంద్రు నుపాలంభించిరి.

హృదయమున జనించిన ధ్యానామృత పానమున తృప్తుడై యచలుడైయున్న శాక్యమునిసింహుని జూచి మారాం



సిద్ధార్థుడు, మారకామినులు.

గనలు దీనాతి దీనముగ మోహోద్దీపకముగ తమ్ము పరిగ్రహింపవలయునని ప్రార్థించిరి. మునీంద్రుడు చివరకు కన్నులు దెరచి మృదుహాసముతో నిట్లు పలికెను. "ప్రాపంచిక సుఖములాపాతమాత్ర రమణీయములు. తుమ్మెద రెక్కలవలె నవి చంచలములు. కామము దుఃఖాత్మకమైన జన్మపరంపరకు కారణము. శరీర మస్థి మాంస రక్తముల ముద్ద. అది కొద్ది దినములలోనే విశీర్ణమైపోవును" అని మరల నా యతీంద్రుడు ధ్యాన నిమగ్నుడయ్యెను.

## మారజిత్తు

సాటిలేని లలితభావ రసాను విద్ధములైన నాట్యరీతులతో వచో విలాసాదులతో నెంత ప్రయత్నించినను నవి కంపిత చిత్తవృత్తియగు నా సంయమీంద్రునిగాంచి మార కామినులు సిగ్గుపడి యదృశ్యలై పోయిరి. ఎన్ని విఘ్నములైనను నాత్మేశ్వరులైనవారికి సమాధి భంగమును గలిగింప జాలవుకదా!! మార విజయమున నాతడు మారజిత్తని లోకమున ప్రసిద్ధివహించెను. అతని మానసము నిస్తరంగ సరసివలె విశ్రాంతి నందెను.

## మూర్ధాభిషిక్తుడు

ఆ విధమున మహాశ్రమణుడు మార విజయ వ్యాపారము వలన కృశించియున్న సంబోధి ప్రమదావతంసమును (సమాధిరూప యోషితను), సమ్యగ్దర్శనవతిని, బోధివృక్షమూలమున నివసింపజేసి, అనాది వాసనావృత్తులను, రాగాది

శత్రువులను ఛేదించి, నిర్వాణక్షేత్రమున నివసించు యోగి కుటుంబములను రక్షించుటకు మూర్ధాభిషిక్తుడయ్యెను.

## నాలుగు ధ్యాన భూమికలు

మొదటి ధ్యాన భూమిక (సవితర్క - సవిచార - వివేకజప్రీతి సుఖము) నుండి రెండవ ధ్యాన భూమికకును (అవితర్క - అవిచార సమాధిజప్రీతిసుఖము), అందుండి మూడవ ధ్యాన భూమిక (ఉపేక్షా - స్మృతిమాన్ - సుఖవిహారీ) కును, దానినుండి నాల్గవ ధ్యాన భూమిక (అదుఃఖ అసుఖ ఉపేక్షా - స్మృతి పరిశుద్ధి) నాయన మనస్సారోహించినది. నాలుగవ ధ్యాన భూమిక యందాయనకు సంబోధి (పరమ జ్ఞానము) గలిగి, నిర్వాణము లభించినది. చిత్తవృత్తులన్నియు లయించి, సర్వోత్తమమైన యానందమును పరమమైన విశ్రాంతియును నాతనికి లభించెను. ఆయన సమ్యక్ సంబుద్ధుడయ్యెను. వెనుకటి ముప్పది రెండు మహాపురుష లక్షణములతో యాయన దేహము సముజ్జ్వలముగా ప్రకాశించెను. మకరందము ప్రవహించు దివ్య శతపత్రమువలె యా సంబుద్ధుని హృదయము నుండి ధర్మామృతము ప్రవహించినది. అప్పుడు ఆయన యీ యద్భుత వాక్కు లుచ్చరించెను.

---

* ఇత్థం పుష్పశరాసనస్య విజయ వ్యాపార కుష్మ్ర స్థితాం
సంబోధి ప్రమదాం నివేశ్య సువృశాం శ్రీ బోధిమూలే వరః
సిద్ధార్థశ్చిర వాసనా పరిగతా నుచ్ఛిద్య దోషద్విషో
ముక్తిక్షేత్ర కుటుంబ రక్షణ విధౌ మూర్ధాభిషిక్తోఽభవత్
(పద్య చూడామని - బుద్ధఘోష మహాకవి)

## నిర్వాణ ప్రశాంతి

అనేకజాతి సంసారం సంధావిస్సం అనిబ్బిసం
గహకారకం గవేసంతో దుక్ఖాజాతి పునప్పునం
గహకారక! దిట్ఠోసి పునగేహం నకాహని
సబ్బేతే ఫాసుకా భగ్గా గహకూటం విసంఖితం
విసంఖారగతం చిత్తం తణ్హానం ఖయమజ్ఝగా॥

"అనేక జన్మములలో నీ సంసారమార్గమున నిలకడ లేకుండ పరిగెత్తుచునుంటిని. భవమను గృహమును నిర్మించిన వానికోసమై వెదకుచునే మరల మరల ననేక దుఃఖములను బొందితిని. ఓ గృహ నిర్మాతా! నిన్ను తెలిసికొంటిని. నీవింక గృహ నిర్మాణము చేయజాలవు. భవాయతన నిర్మాణమునకు గావలసిన సామగ్రియంతయు ధ్వస్తమయిపోయినది. పైకప్పు శిథిలమైనది. సంస్కారములనుండి చిత్తము విముక్తమైనది; తృష్ణ నశించినది." ఉదయ కాంతులతోబాటు నిర్వాణోదయ కాంతు లాయన యంతరంగమున ప్రకాశించినవి. *

* మహాశ్రమణుని చిత్తము ద్వంద్వ విషయ ప్రపంచము నుండి నివృత్తమై విషయాంతరముల నప్రవృత్తమై చలన వర్జితమయ్యెను. ఇదియే నిర్వాణము. దీనిని అద్వయ విజ్ఞానైక రసఘనమని పరమార్థవేత్తలు వర్ణింతురు. పరమార్థద్రష్టలగు బుద్ధులీ స్థితి నందుదురు. ఇది సామ్యము, అజము, అద్వయము నైనది. స్వయముగ అనిద్రము, అస్వప్నము, ప్రభాతము, అనగా- ఆదిత్యాద్యపేక్ష లేకయే స్వయంజ్యోతి రూపమని యర్థము. 1, కలదు 2. లేదు 3. కలదు, లేదు 4. లేదు, లేదను నాల్గు లక్షణములకు నిది యతీతము. ఇది ఇట్టిదని తెలిసికొన్న వాడు సర్వజ్ఞుడు, పరమార్థ పండితుడు.

నిర్వాణము-అజాతము, అనుత్తరము, యోగక్షేమము, అజరము, అవ్యాధిరూపము, అమృతము, అశోకము, అసంక్లిష్టము, గంభీరము, దుర్దర్శము, దురనుబోధము, శాంతి రూపమని నికాయ గ్రంథముల వర్ణితము. (అరియ పరియేసన సుత్తం-మజ్ఝిమ నికాయము). నిర్వాణము పూర్ణనాశనమను దుర్వాదము నీ శబ్దములు ఖండించుచున్నవి.

## బుద్ధుడు

నిర్వాణ (పరమ సుఖాత్మకమైన ప్రశాంత) మును బొందిననాటినుండి శాక్యముని బుద్ధుడు, తథాగతుడు, అర్హాతుడు, భగవంతుడు, మహాపురుషుడు, సత్యనాముడు నని ప్రసిద్ధివహించెను.

## ఏడు వారములు

తరువాత బుద్ధభగవానుడొక వారము దినములు మహాబోధివృక్షము క్రిందనే యానందమగ్నుడై గడపెను. రెండవ వారము ధ్యానానంద ప్రశాంతితో పరిసరప్రాంతములలో సంచరించెను. మూడవవారము బోధివృక్షము నాలోకించుచు తాను నిర్వాణ పదవిని సాధించిన మార్గమును స్మరించుచు గడపెను. నాలుగవ వారము మరల సాలకాననమున నిటు నటు సంచరించుచు గడపెను.

ఆ వారమున మరల మారుడు భగవంతునికి కనబడి యతడు సంపాదించిన జ్ఞానము నెవరికి నుపదేశింపక విదేహ మోక్షమును (పరినిర్వాణమును) పొందవలయునని కోరెను. కాని, భగవంతుడందుల కంగీకరింపలేదు; మారుడును, మారకామినులును భగవంతుని క్షమాభిక్ష కోరినారు.

అయిదవవారము భగవంతుడు ముచిలిందుడను నాగరాజు సౌధమున గడపినాడు. ఆరవ వారము పూర్వోక్తమైన న్యగ్రోధ వృక్షచ్ఛాయ నాసీనుడై ధ్యానసమాధియందు గడపెను. ఏడవవార మిరువురు బేహారులు, త్రపుషుడు, భల్లికుడు ననువారు బుద్ధభగవానునకు తేనెను, ఫలములను సమర్పించి

యారాధించిరి. వారే బుద్ధభగవానునికి నిర్వాణానంతరము ప్రథమ భిక్ష నొసగిన పుణ్యాత్ములు.

తాను సంపాదించిన నిర్వాణ జ్ఞానమును సామాన్యు లర్థము జేసికొన లేరు. వారికి బోధించియు ప్రయోజనముం డదు. "దుర్దర్శమును నగమ్యమును ప్రశాంతి దాయకమును మహనీయమునై జ్ఞానులకు మాత్రమే దర్శింప సాధ్యమయిన సత్యపు లోతును నేను తెలిసికొన్నాను. విషయలోలురైన మానవులు - ప్రాకృత బుద్ధులు దీనిని గ్రహింపజాలరు. కారణ ధర్మమును తెలిసికొని, సర్వసంస్కారములను నశింప జేయుటయును, తృష్ణను సంపూర్ణముగ క్షయింప జేసి నిర్వాణ పదవి పొందుటయును దుస్సాధ్యమైన కార్యములు. నేనీ సద్ధర్మ మును బోధించినను మానవజాతి యర్థము జేసికొన లేదు. శ్రమ తప్ప ప్రయోజన మేమియు నుండదు" అని తలచి-

లోకమున కుపదేశమును జేయు ప్రయత్నమును విర మించి శాశ్వతముగ నిర్వాణానందమున నిమగ్నుడై పోవలయు నని బుద్ధ భగవానుడు నిశ్చయించుకొన్నాడు.

అప్పుడు దేవతలలో ముఖ్యుడైన బ్రహ్మసహాంపతి ప్రజలకు సద్ధర్మామృతము ననుగ్రహింపవలయుననియు, వారి భవతాపములను హరింపవలయుననియు ప్రార్థించెను. భగ వంతు డందుల కంగీకరించి పావన ధర్మబోధ జేసి మానవుల దుఃఖమును పరిహరించి వారి కనంత ప్రశాంతి ననుగ్రహించు టకై బయలుదేరెను. అమృతత్వ ద్వార మపావృతమైనది. కరుణా మందాకిని భూతలమున నవతరించినది. ఇక మానవుల జన్మ సస్యములు సంపూర్ణముగ ఫలించును.

తన గురువులైన యాలారకాలాముడు, రుద్రకరామ పుత్రుడును నంతకు ముందే దివంగతులైనారు. తనతోబాటు తపస్సుజేసిన అయిదుగురు శ్రమణులు నీ జ్ఞానమును గ్రహింప పాత్రులని వారి నన్వేషించుచు బుద్ధ భగవానుడు కాశికి బయలుదేరెను.

## జినుడు

దారిలో నుపకుడను (ఆజీవకుడు?) జైన సన్యాసి — దిగంబరుడు — ప్రభారాశియై వెలుగుచున్న తథాగతునిజూచి యాయన గురు వెవరని ప్రశ్నించెను. "పాప బుద్ధులను (ఆస్రవముల) నశింపజేసినవారందఱు జినులు. నేను జినుడను. సర్వరాగములను జయించితిని. తృష్ణాదుఃఖములు నాకు లేవు. మోక్షానందవేత్తనైన నేను నా గురువెవరని నీకు చెప్పుదును? నాకు సదృశుడైన యాచార్యుడు లేడు. దేవమానవలోకము లలో నాకు సములు లేరు. అనుత్తమమైన యర్హత్స్థితిని నేను బొందితిని. నేను సమ్యక్సంబుద్ధుడను. ధర్మచక్ర ప్రవర్తనమునకై కాశీపురమునకు బోవుచుంటిని. ఈ యంధ భూతమైన లోకమున నమృతదుందుభి మ్రోగించెదను." *

---

* సబ్బాభిభూ సబ్బవిదూ రహమస్మి। సబ్బేసు ధమ్మేసు అనూపలిత్తో। సబ్బం జహో తణ్హాక్ఖయే విముత్తో। సయం అభిఞ్ఞాయ కముద్దిసెయ్యం॥ నమే ఆచరియో అత్థి సదిసో మే నవిజ్జతి। సదేవకస్మిం లోకస్మిం నత్థియే పటిపుగ్గలో ॥ అహం హి అరహా లోకే। అహం సత్థా అనుత్తరో। ఏకోమ్హి సమ్మాసంబుద్ధో। శీతిభూతోస్మి నిబ్బుతో ॥ ధమ్మచక్కం పవత్తేతుం గచ్ఛామి కాసినం పురం। అన్ధభూతస్మిం లోకోస్మిం ఆహఞ్ఛమం అమతదుందుభిం ॥ (మజ్ఝిమనికాయము).

## మృగదావము

కాశీనగరమునుండి మృగదావ (మిగదాయ) మను వనమునకు భగవంతుడు వెళ్ళెను. దీనినే "ఇసిపత్తనము," "ఋషిపత్తన" మనియును నందురు. సారనాథమని దీనికి మరియొక పేరు. పూర్వ మీ ప్రదేశమున బుద్ధభగవానుడు న్యగ్రోధుడను హరిణరాజు (జింకలరాజు)గా జన్మించి, కాశీరాజునకు జీవకారుణ్యము బోధించినాడన్న విషయము జాతక కథ (న్యగ్రోధ మృగజాతకము)వలన దెలియుచున్నది. సారంగనాథుడనగా జింకలరాజని యర్థము. సారంగనాథమే సారనాథమైనదని పరిశోధకుల యభిప్రాయము. సారంగనాథ శబ్దము శివునకును బుద్ధునకును నన్వయించును. ఇది పురాతనమైన శైవ క్షేత్రము. చాలమంది ఋషులిచట తపమాచరించి నిర్వాణమును బొందిరి కాన, నిది ఇసిపత్తనము, లేక - ఋషిపత్తన మని ప్రసిద్ధి వహించినది.

## పంచవర్గీయ శిష్యులు

అయిదుగురు తాపసులు నివసించుచున్న మృగదావమును భగవంతుడు చేరుకొన్నాడు. ఆ శ్రమణులు బుద్ధుని చూడగనే, తమలోతాము "శ్రమణగౌతముడు పతితుడు. భోగవిలాసాదులు మరగి మరల బలసౌందర్యములను సంపాదించుకొన్నాడు. గౌరవమున కితడపాత్రు"డని నిశ్చయించుకొన్నారు. కాని, భగవంతుడు సమీపింపగనే తేరిచూడరాని



బుద్ధుని మొదటి బోధ.

యా మహాతేజస్సును జూచి యా భిక్షువు లెదురేగి గౌరవించి, "ఆయుష్మంతుడా!" యని సంబోధించిరి.

"నన్నట్లు మీరు పిలువగూడదు. నేనర్హత స్థితిని సాధించి బుద్ధుడనైతిని. అమృతతత్త్వము నాచే సాధితము" అని భగవంతుడన్నాడు. మొదట సంశయించినను తరువాత నా అయిదుగురు శ్రమణులు బుద్ధుని శిష్యులైనారు. ఆ సందర్భమున భగవంతుడుచేసిన మొదటి బోధకే ధర్మచక్ర ప్రవర్తనమని పేరు. దాని సారమును సంగ్రహముగ మనము గ్రహింతము.

# బుద్ధదర్శనము

## ద్వితీయాధ్యాయము
## (ధర్మచక్రప్రవర్తన సమంతభద్రము)

### ధర్మచక్రప్రవర్తనము

**ఇతిదుఃఖ మేతదియామస్య సముదయా అతాప్రవర్తికా**
**శాంతిరియమయ ముపాయ ఇతి భాగశః పరమమిదం చతుష్టయం॥**

భిక్షువులారా! ఈ రెండు మితిమీరిన పద్ధతులు పరిహరించవలయును. మొదటిది – హీనము, గ్రామ్యము, నతిలౌకికము, ననార్యము, ననర్థాత్మకమునునైన కామ సుఖానుసరణము. రెండవది – దుఃఖము ననార్యము ననర్థకారకము శరీర నాశకమునైన కఠోర తపస్సు. ఈ రెండు అత్యంతములను విడిచి మధ్యమమైన మార్గమున నడువవలయును. ఇది తథాగతునిచే నభిసంబుద్ధము (చూడబడినది). ఈ మార్గ ముపశాంతిని నభిజ్ఞను జ్ఞానమును నిర్వాణ ప్రశాంతిని గలిగించును.

ఈ మధ్యమ మార్గ మష్టాంగములతో గూడినది. ఇదే ఆర్యుల యష్టాంగ మార్గము,

### అష్టాంగ మార్గము

(1) సమ్యగ్దృష్టి
(2) సమ్యక్సంకల్పము } ప్రజ్ఞ (జ్ఞానమునకు సంబంధించిన శిక్షణ)

(3) సమ్యగ్వచనము
(4) సమ్యక్కర్మ
(5) సమ్యగాజీవము
} శీలము (నైతిక జీవనమునకు సంబంధించిన శిక్షణ)

(6) సమ్యగ్వ్యాయామము
(7) సమ్యక్స్మృతి
(8) సమ్యక్సమాధి
} చిత్తము (మానసిక శిక్షణ)

ఇదియే అష్టాంగయుక్తమైన మధ్య మార్గము. *

## చతుస్సత్యమ్ములు

"భిక్షువులారా! చతుస్సత్యముల నెఱుగవలయును. దుఃఖమనునదియే మొదటి యార్యసత్యము. జన్మ జరామరణాదులును, ప్రియవియోగ విప్రియసంయోగములును దుఃఖరూపములే. బాగుగ విచారించిన ప్రపంచము దుఃఖరూపమే.

"దుఃఖ సముదయమనునది (దుఃఖ కారణమనునది) రెండవ యార్యసత్యము. ఇది పునర్భకారిణియగు తృష్ణ; మోహరాగాదులతో నిహపర విషయానంద కాంక్షిణి.

"దుఃఖ నిరోధమనునది మూడవ యార్యసత్యము. ఇది శాంతి రూపము. తృష్ణను నిశ్శేషము నశింప జేయును.

"పైన చెప్పిన మధ్యేమార్గమైన యష్టాంగమార్గమే నాల్గవ యార్యసత్యము. ఈ నాలుగార్య సత్యములును నేను

---

* ఈ అష్టాంగములు ప్రజ్ఞాశీల చిత్తములని పైన చూపిన రీతి విభజింపబడినవి. ఇవి నైతిక మానసిక శిక్షణములు. "శీలేపతిట్ఠాయ నరో సపఞ్ఞో । చిత్తం పఞ్ఞంచ భావయం ఆతాపి నిపకో భిక్ఖు । సోయిమాం విజటయేజటం."

సాక్షాత్కరించితిని. కాన, నా యందు ప్రజ్ఞా విద్యాలోకనము లుదయించి సమ్యక్సం బుద్ధుడనైతిని."

భగవంతుడా ధర్మము నుపదేశింపగా వృద్ధుడైన కౌండిన్యునియందు విరాజమానమును వీతమలమునునైన ధర్మ చక్షువుదయించి యాతడర్హతుడయ్యెను. క్రమముగా మిగిలిన భిక్షువులును నర్హత్స్థితినంది నిర్వాణ ప్రశాంతి ననుభవించి ధన్యులైరి.

తరువాత భగవంతుడు వారికి అనత్తలక్ఖణ సుత్తము (అనాత్మ లక్షణ సూత్రము)ను బోధించి రూపవేదన సంజ్ఞా సంస్కారములను పంచస్కంధములు దుఃఖరూపములును ననిత్యములును నగుటచే నాత్మలక్షణ సంపన్నములు గావని బోధించి, లోకులు భావించు సంకుచితాత్మ భావమును వారి నుండి తొలగించెను. (నమేసో అత్తా - ఇది నా ఆత్మగాదని రూపవేదనాదులను తిరస్కరించుట). ఈ సూత్రమును చాల మంది యపార్థముచేసికొని భగవంతుడాత్మ లేదన్నాడని వాదించిరి. ఆయన కాదన్నది లోకులు భావించు సంకుచిత మైన యాత్మను మాత్రమే. నిర్వాణరూపమైన మహాత్మను యాయన యంగీకరించెను. (చూడు - బౌద్ధయుగము Vol I Page 73 మరియు, ఉదాన గ్రంథము (8) అనత్త లక్ఖణ సుత్తమును చాలమంది No soul theary యని యాంగ్ల మున అనువదించిరి. ఈ విషయము ముందు వివరింపబడును.)

ఋషిపత్తనమున భగవంతుడు కొంత కాలము నివసించెను. ఈ సమయముననే యసితుని శిష్యుడైన నాలకుడు బుద్ధుని సన్నిధి చేరుకొని తన గుర్వాజ్ఞను నెరవేర్చెను.

## యశుడు

కాశీపురమున యశుడు (యశోదుడు)అను గొప్ప శ్రేష్ఠి కుమారు డుండెను. అతడు నృత్య గానాది కళలలో నిపుణులై సుందరాంగులైన జవరాండ్రతో కామభోగములను పుష్కల ముగ ననుభవించెను. ఆ భోగానుభవమున నాతనికి విరక్తి గలిగినది. ఒకనా డాతడు వరణా నదీతీరమున కేకాంతముగా వెళ్ళి "అయ్యో! కాలము గడచిపోవుచున్నది. నేను ప్రమాద ములలో చిక్కుకొంటిని. (ఉపద్దుతం వో ఉపస్సట్ఠంవో)"అని బిగ్గరగా ననెను.

వరణా తటమున ధ్యానమున నున్న భగవంతు డది విని, యశునికి జ్ఞానోపదేశము జేసి, యాతనికి పరమ మన శ్శాంతి ననుగ్రహించెను. బ్రహ్మచర్య మాచరింపక, యౌవనమున ధర్మధనమును సంపాదింపక మనుష్యులు చేపలు లేని కొలనులో నివసించు కొంగలవలె నశింతురని యశునికి దుఃఖమును శీలమును సర్గమును, కామానుభవ సంక్లేశములను గురించి భగవంతు డుపదేశించెను. *

## అరువది యొక్క రర్హతులు

యశుని ముఖ్య స్నేహితులైన విమలుడు, సుబా హుడు, పుణ్ణజి (పూర్ణజిత్తు), గవాంపతి యను వారును భగ వంతునికి శిష్యులైరి. అతని తల్లిదండ్రులును, భార్యయును చతురార్య సత్యములను దెలిసికొని బుద్ధోపాసకులైరి. తరు వాత ఏబదిమంది యశుని బంధువులును బుద్ధునివలన నిర్వాణ

* అచరిత్వా బ్రహ్మచరియం అలద్ధా యొబ్బనేధనం। జిణ్ణకోంచావఖ్ఖాయంతి ఖీన మచ్ఛేవ పల్వలే।

శాంతిని బొంది యాయనకు శిష్యులైరి. ఈ రీతిగ బుద్ధభగవా నునితో గలిసి యానాటికి అరవది యొక్క ర్హాతు లుండిరి.

ఆచరణ ప్రారంభమునను, నంతమునను ప్రశాంత్యా నంద దాయకమైన యా సద్ధర్మమును లోకమున కుపదేశించి సౌశీల్యముతో గూడిన జీవితాదర్శములను వ్యాపింపజేయవల యుని భగవంతుడా మొదటి శిష్యుల కానతిచ్చెను. భగవం తుడు మరల నురువేల ప్రాంతము (నేటి బుద్ధగయా ప్రాంతము) నకు బయలుదేరెను.

## ఆత్మ నన్వేషింపుడు

మార్గమధ్యమున వనవిహారార్థమై వచ్చియున్న సంపన్న వంశస్థులైన ముప్పదిమంది యువకులను, వారి స్త్రీలను బుద్ధుడు జూచెను. ఆ యువకుల యందొకడు మాత్ర మవివాహితుడు. మిగిలిన యిరువది తొమ్మిది మంది వారి భార్యలతో విహార మునకు వచ్చినారు. అతడు మాత్రమొక భోగకాంతను వెంట దీసికొని వచ్చెను. సంతోషోల్లాపముల నందఱు నిమగ్నులై యున్నపు డా భోగిని కొంత ధనమును, వస్తువులను దొంగి లించి, వారిని మోసగించి పారిపోయెను. ఆమె నన్వేషించుచు వారందఱు, నెదురుగా వచ్చుచున్న భగవంతుని నామెను గుఱించి ప్రశ్నించిరి.

"ఆమె నన్వేషించుట కంటె మీ యాత్మ నన్వేషిం చుట మంచి"దని (అత్తానం గవేసెయ్యాథ) భగవంతు డన్నాడు. అత్మ నన్వేషింపుడన్న యుపదేశము వెలుగై వారి యజ్ఞానాంధకారమును బారదోలినది. వారందఱును భగవం

తెలిసి శిష్యులైనారు. బుద్ధుడనాత్మవాది యనువారు దీని కేమని అర్థము చెప్పెదురో!

## జటిల కశ్యపులు

ఉరువేల ప్రాంతమున చాలమంది యగ్ని నారాధించు బ్రాహ్మణ సన్న్యాసులుండిరి. వారిలో జటిల కశ్యపులు ప్రసిద్ధులు. అచ్చట బుద్ధుడు తన మహిమతో నగ్ని దేవాలయమున నున్న భయంకర విష సర్పము (అహినాగము)ను సాధువుగ నొనరించెను. తమ యాశ్రమమున బుద్ధుడు నివసించుటకు స్థలము లేదనియు, నగ్ని దేవాలయమున నతడుండవచ్చుననియు కశ్యపులు చెప్పి, యచ్చట నొక భయంకర విష సర్పమున్నదని గూడ హెచ్చరించిరి. భగవంతుడా రాత్రి యగ్న్యాలయమున ధ్యాన సమాధి యందుండెను. సర్ప విషవాయువులు వ్యాపించినను భగవంతుని సమాధి భంగమందలేదు. సర్ప విష మాయన నేమియు జేయజాలకపోయినది. అహి నాగము తన పడగ వంచి భగవాను నారాధించి యాయన భిక్షాపాత్ర యందు ప్రశాంతముగ పరుండినది. అహింసా మూర్తుల సన్నిధిని వైరత్యాగము గలుగును గదా! *

తల్లియందు విశ్వాసము గలిగి ప్రవర్తించు రీతి; శమశాలి యందు క్రూరములును శాంతములునైన సమస్త భూతములు పరమ విశ్వాసమున ప్రవర్తించును గదా!

## అహింసా శక్తి

ఉదయమున కశ్యపులా యద్భుత దృశ్యమును గాంచి

* అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః
యోగసూత్రములు 2-35

దిగ్భ్రాంతులై యాయన శిష్యులైరి. వారితో బాటు వారి శిష్యులును భగవంతుని శరణు జొచ్చిరి. శిష్య సమేతుడై తథాగతుడట నుండి గయాశీర్ష పర్వతమునకు వెళ్ళెను. అచ్చటనే యాయన ప్రసిద్ధమైన అగ్ని సూత్రము (ఆదిత్య పరియాయ సుత్తము)ను బోధించెను.

## అగ్నిసూత్రము

రాగ ద్వేష మోహములే జ్వాలామయములైన యగ్నులు. ఇవి విషయేంద్రియ సంయోగమువలన జనించును. శబ్ద స్పర్శ రూప రస గంధములను విషయములును, వాని యింద్రియములైన శ్రోత్రాదులును రాగ ద్వేష మోహము లను యగ్నిజ్వాలలను గలిగించును. వీనివలన గలుగు నానంద దుఃఖములుగాని తదితరభావములుగాని జ్వాలామయములే. రాగ ద్వేష మోహాగ్నులే జన్మజరా మరణములవలన గలుగు సకల దుఃఖములకు కారణములు. విషయేంద్రి యాకర్షణము లకు లోబడక నిర్లిప్తుడుగా నుండుటయే యీ యగ్నిజ్వాల లుపశమించుటకు మార్గము. ఈ జ్వాలలు చల్లారి పోవుటయే నిర్వాణ ప్రశాంతి. (వినయ పిటకము-మహావగ్గము).

ఆ ప్రబోధము నాలకించి ఉరువేల కశ్యపు డగ్ని హోత్రములును యజ్ఞాదులును నిరర్థకములని భావించి, యజ్ఞ పాత్రలను వస్తువులను అన్నిటిని నదిలో బారవైచి భగవంతుని శరణుజొచ్చెను. అతని ననుసరించి యాతని సోదరులిరువురు — నదీకశ్యపుడు, గయాకశ్యపుడు అనువారు తమ శిష్యులతో బాటు బుద్ధ భగవాను నాశ్రయించిరి.

## రాజగృహమునకు పునరాగమనము

భగవంతుడు తరువాత మగధ రాజధాని రాజగృహమునకు శిష్య సమూహముతో వెళ్ళి బింబిసారుని యష్టివనమున (లట్ఠివనము) విడిసెను. ఆయన యశః పరిమళము దివ్యమందార మనోహర పరిమళములవలె మగధ రాజ్యమంతట వ్యాపించినది. బింబిసార మహారాజనేక బ్రాహ్మణులతో గృహస్థులతో భగవంతుని సందర్శించినాడు. బ్రాహ్మణులలో చాలమందికి బుద్ధ ఉరువేల కశ్యపులలో నెవరెవరికి గురువను సంశయము గలిగినది.

## ఉరువేల కశ్యపుని భక్తి

జ్ఞానదృష్టితో ప్రజలయొక్కయు, రాజు యొక్కయు సంశయమును తెలిసికొని భగవంతుడు కశ్యపునితో "అగ్ని హోత్రారాధనలను విడిచి పెట్టుటకు కారణమును తెలుపు" మని యడిగెను. కశ్యపుడు "పునర్భవ మూలములును, రాగ ద్వేష లోభ మోహములును పూర్తిగ నశించిన యుపశమన స్థితిని నేను గాంచితిని. భవతృష్ణ యంతరించినది. పరివర్తన రహితమై శాశ్వతమైన ప్రశాంతి ధామమును గనుగొన్న నా కగ్నిహోత్రాది కర్మకాండతో పనియేమి? అగ్ని పూజలును కఠిన తపస్సులును జన్మ పరంపరలకు కారణమై తృష్ణను నశింప జేయలేవు. నిర్వాణ ప్రశాంతిని గోరి భగవంతుని శరణు జొచ్చినాను" అని తథాగతుని పాదములపై సాగిలబడి నమస్కరించెను.

భగవంతుడు మహానారద కశ్యప జాతక కథను వివరించి, పూర్వజన్మమున సైతము కశ్యపుడు తన్ను శరణుజొచ్చె

నని తెలిపెను. బుద్ధు నానతిపైన ఉరువేల కశ్యపుడు తాను సాధించిన యమానుష సిద్ధులను ప్రదర్శించి, బుద్ధుని యసదృశ మైన పరమ పారమ్యమును స్థాపించెను. ఆ రీతి ప్రజల మనస్సు శ్రద్ధా భక్తిపూర్ణమై ధర్మోపదేశమున కర్హ్వత వహించిన సమయమున భగవంతుడార్య చతుస్సత్యములను, ప్రపంచ క్షణిక స్వభావమును వివరించి, సంకుచితాత్మ భావమే జననమరణ దుఃఖములకు కారణమని ప్రబోధించెను.

## వేణువన విహారము

బింబిసారుడా ప్రబోధమును విని, సత్యదర్శనమంది యానందించెను. భగవంతుడు శిష్యసమూహముతో నివసించుటకై రమణీయమైన వేణువన విహారమును భక్తితో, ధారాపూర్వకముగ సమర్పించెను. మగధ దేశమున వేలకొలది భగవంతుని యుపాసకులై సత్యధర్మముల ననుసరించిరి. వేణు వనమున భగవంతుడు కొంతకాలము నివసించి, సద్ధర్మామృతమును ప్రజలకొసంగి, వారి సంసార క్లేశములను పరిహరించెను.

## సారిపుత్త మొగ్గల్లానులు

మగధ రాజధానియందు సారిపుత్రుడు (ఉపతిష్యుడు), మొగ్గల్లానుడు (మౌద్గల్యాయనుడు) అను గొప్ప శ్రమణులుండిరి. వారు సంజయుడు (సంజయ బెలట్ఠి పుత్తుడు)అను మహనీయుని శిష్యులు. సారిపుత్తుడు సకలవిద్యా శ్రీమంతమైన బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. అతడు సకలశాస్త్ర పారంగతుడు. మొగ్గల్లానుడు నట్టివాడే.

ఒకనాడు భగవంతుని శిష్యులైన అస్సజి (అశ్వజిత్తు),

వప్ప (వాస్ప లేక, వాసవ) లను వారు భిక్షార్థమై రాజ గృహ మునకు వెళ్ళిరి. ఇంద్రియ నిగ్రహము వలన చిత్త సమతను సాధించిన వారి వదనములపై యపూర్వ మనోహర తేజస్సు నకు నాకృష్టుడై సారిపుత్తుడు, అస్సజిని వారి గురువెవరని ప్రశ్నించెను.

"సోదరా! మా గురు విక్ష్వాకు వంశమున జన్మించిన సర్వజ్ఞుడైన శాక్యముని; మానవులకును దేవతలకు నారా ధ్యుడు. ఆ భగవంతు ననుసరించుటకై నేను ప్రపంచమును పరిత్యజించితిని."

## బోధ సంగ్రహము

"సౌమ్యుడా! అట్లైన మీ గురువు యొక్క యుప దేశమేమో చెప్పగలవా?" అని సారిపుత్తుడడుగగా, "నేను సాధకుడను మాత్రమే. గంభీరమును, సూక్ష్మమునైన యా మహోపదేశమును నేను వివరింపజాలను. సంగ్రహముగ చెప్ప వలయునన్న యాయన యుపదేశమిది.

"యేధర్మా హేతు ప్రభవా హేతుస్తేషాం తథాగతో హ్యవదత్
తేషాంచ యో నిరోధ ఏవం వాదీ మహాశ్రమణః

"హేతు ప్రభవములైన ధర్మముల (దృశ్యపదార్థ ముల) హేతువును బుద్ధుడు తెలిపినాడు. వాని నిరోధమును (నాశనమును) గూడ నా మహాశ్రమణుడు ప్రకాశితము జేసి నాడు. దృశ్యపదార్థములన్నియు నశాశ్వతములు, ననాత్మక ములు గావున దుఃఖరూపములు. దుఃఖముకు కారణము తృష్ణ. తృష్ణా నిరోధమే నిర్వాణము. బుద్ధుడు నిర్వాణదేశికుడు."

సంగ్రహముగ నీ శ్లోకమార్య చతుస్సత్యములను తెలుపు చున్నది.

జ్ఞానియైన సారిపుత్తు డాశ్లోకభావమును గ్రహించెను. దృశ్య పదార్థములన్నియు కార్యకారణ సంబంధముగలవి. సముదయము గలది (కారణ ధర్మము గలది), నిరోధమందును (నాశమందును), దుఃఖములకు కారణమైన తృష్ణ నశించుటయే నిర్వాణము. తన మిత్రుడైన మొగ్గల్లానునకా శ్లోకార్థమును వివరించెను.

## ముఖ్య శిష్యులు

పూర్వ పుణ్యమువలన పవిత్ర చిత్తముగల వారిలో నుపశమ కారణమైన పరమ జ్ఞాన ముదయించెను. తమ గురువైన సంజయుని విడిచి, ఆతని రెండువందల యేబదిమంది శిష్యులనుసరింపగ సారిపుత్త మొగ్గల్లానులు భగవంతుని సన్నిధికి బోయిరి. దూరముననే వారిని జూచి భగవంతుడు బ్రహ్మవాణితో, నా వచ్చుచున్న శ్రమణులు తన ముఖ్యశిష్యులగుదురని ప్రవచించి, వారి నాదరపూర్వకముగ స్వీకరించెను. వెంటనే యద్భుతావహముగ వారి త్రిదండ కమండలువులును, జటావల్కలములును నదృశ్యమై, వారు ముండిత శిరములతో, కాషాయాంబరములతో విలసిల్లిరి. వారితోబాటు రెండువందల ఏబదిమంది సంజయుని శిష్యులును భగవంతు నాశ్రయించిరి; అచిరకాలముననే వారందఱు నర్హాత స్థితిని బొంది ధన్యులైరి.

## సారిపుత్తుని కృతకృత్యత

అర్హాతస్థితిని పొంది తేజోరాశియై ప్రకాశించుచున్న సారిపుత్తుని గాంచి మొగ్గల్లాను డిట్లు ప్రశ్నించెను: "మిత్రుడా! నీ మనస్సు ప్రశాంతి నందినది. నీ దేహము ప్రసన్న పవిత్ర తేజోమయముగానున్నది. నీవు అమృత స్థితి నందితివా?"

"అవును. అమృతత్వ మందితి"నని సారిపుత్తుని సమాధానము.

తరువాత సంజయుడును బుద్ధుని సందర్శించెను. ఒకప్పుడు సంజయునకు భగవంతుడిట్లు బోధించెను: "అసారమును సారమనియును,సారము నసారమనియు భావించు భ్రాంతిదర్శనులగు వారెన్నడును సారవస్తువును బొందజాలరు. వారు మిథ్యా సంకల్పగోచరులు. సారాసార వివేకులగు సత్య సంకల్పవంతులే సారవస్తువును (నిర్వాణము) గాంతురు." *

## మహా కశ్యపుడు

తరువాత నచిరకాలముననే భగవంతుడు రాజగృహమునకును నాలందగ్రామమునకును మధ్యనున్న బహుపుత్రక చైత్యమునకు వెళ్ళెను. అచ్చట కశ్యపుడు (అగ్నిదత్తుడు, పాలీలో పిప్పలి మానవుడు) అను బ్రాహ్మణ సన్యాసి యాయనను జేరి యుపదేశమందెను.

* అసారే సారమతినో సారేచాసార దస్సినో। తేసారం నాధిగచ్ఛంతి మిచ్ఛాసఙ్కప్పగోచరా।
సారంచసారతో ఞత్వా అసారఞ్చ అసారతో। తేసారం అధిగచ్ఛంతి సమ్మా సఙ్కప్పగోచరా। (దమ్మపదము 1- 11, 12.

అగ్నిదత్తుడు రాజగృహమున నొక శ్రీమంత బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. బాల్యముననే సంసార విరక్తినంది యాతడు వివాహమును నిరాకరించెను. తల్లిదండ్రుల ప్రోద్బలమువలన, తన కనురూపమైన విధమున రచింపబడిన సుందర సువర్ణ విగ్రహమును బోలిన సుందరి లభించిన వివాహ మాడెదననియాత డంగీకరించెను.సువర్ణ విగ్రహసుందరిని బోలిన సుందరిని సాగాల (పంజాబులోని నేటి సియాల్ కోట?) యందు గాంచి తలిదండ్రులు కశ్యపున కుద్వాహ మొనరించిరి.

ఆ సుందరి పేరు భద్రాకాపిలేయ. (భద్రా కపిలానీ). ఆమె సైతము సంసార విరక్తచిత్తయే, వివాహానంతరము వారిరువురు పరస్పరము దాకకూడదని నియమవంతులై ధ్యానజీవితమును గడపుచుండిరి. తలిదండ్రుల మరణానంతరము వారిరువురును సన్యసించి యథేచ్ఛామార్గమున సత్యాన్వేషణ తత్పరులై వెళ్ళిరి. పూర్వ పుణ్య పరిపాకమున కశ్యపుడు శాక్యమునీంద్రుని సన్నిధి జేరెను.

## సమ్యక్ప్రహాణము

శరీరాత్మలను గురించిన తత్త్వ విచారమున మునిగిన కశ్యపునకు మహాశాస్త్రయైన భగవంతుడు "సమ్యక్ ప్రహాణము" (పూర్ణప్రయత్నము, ఇంద్రియ జయమునకై సంపూర్ణ శక్తిని ప్రయోగించుట) గురించి బోధించెను. అశుభగుణములను విసర్జించి, వాని నిరోధమున శుభగుణ సాధన చేయవలయును. శుభగుణముల స్థిరమొనరించు కొనవలయును. శుభ

గుణాధిక్యము నార్జింపవలయును. ఇంద్రియ జేతయై విషయా నందములను గ్రహింపక దృశ్యపదార్థములలోని క్షణిక స్వభా వము నెఱుగవలయును; ఆర్యచతుస్సత్యములను దర్శింప వలయును.

## నాలుగు బ్రహ్మవిహారములు

అగ్నిదత్తుడు శుష్కతత్త్వ విచారమును విడిచి కుశల కర్మపరాయణుడై కామ, భవా, విద్యలను త్రివిధాస్రవముల కును రాగద్వేష మోహములకును దూరుడై యర్హత్‌స్థితిని పరమశాంతిని బొందెను. ఆతడు మైత్రీ, కరుణా, ముదితా, ఉపేక్షలను నాలుగు బ్రహ్మ విహారములయందు విహరించు వాడయ్యెను. భగవంతుడు కశ్యపుని 'ధూతవాది శిరోమణి' (అవధూత?) యని ప్రశంసించెను.

## భద్రాకాపిలేయా ప్రశాంతి

భద్రాకాపిలేయి సైతము తరువాతి కాలమున మహా ప్రజాపతి గౌతమీదేవి సన్నిధిని శ్రమణీదీక్షను గొని యర్హత స్థితి నంది యనుత్తర ప్రశాంతి నందెను. పూర్వనివాసాభిజ్ఞ (పూర్వజన్మ స్మృతి) నందిన శ్రమణీమణులలో నామె మిన్న యని భద్రాకాపిలేయను భగవంతుడు ప్రశంసించినాడు.

## కపిలవాస్తుకు పునరాగమనము

శుద్ధోదన మహారాజు బుద్ధుడైన తన కుమారుని చూడ వలయునని యాతని కపిలవాస్తు కాహ్వానించుటకు రాజపురో హితుని కుమారుడైన యుదాయిని, ఛన్నుని రాజగృహము (వేణు వనము)నకు పంపెను. వారిరువురును భగవంతునితో

సమవయస్కులు. బాల్యమున నాయనకు ముఖ్యానుచరులు. ఛన్ను డాతని ప్రియసారథియని పాఠకులకు విదితము.

వారు కొందఱనుచరులతో గలిసి భగవంతుని సన్నిధికి వెళ్ళిరి. ఆయన బోధామృతము పానముజేసి పరమోప శాంతిని బొంది వారర్హత స్థితి నందిరి. వారివలన తండ్రి సందేశము నెఱింగి భగవంతుడు తండ్రికిని, కపిలవాస్తు ప్రజలకును సద్ధర్మోపదేశ మొనరించుటకై రాజగృహమునుండి బయలు దేరెను. పాదచారియైన యా మహా భిక్షువు, దినమునకు సుమారు మూడు మైళ్లు నడచుచు అరువది దినములలో కపిల వాస్తు చేరెను. మహాభి నిష్క్రమణము తరువాత నేడవ యేట వసంతకాలముననది జరిగి నది.

రాజ కుటుంబమువారును, కపిలవాస్తు ప్రజలు- స్త్రీ పురుష లాబాల గోపాలము ఫలపుష్పాది పూజా ద్రవ్యము లతో భగవంతునకు నెదురుగాబోయి స్వాగత మొసగిరి. ఆయన శిష్యసమూహముతో పురమున కనతి దూరముననున్న న్యగ్రోధ వనమున విడిసెను. పుత్రుని మహనీయతను ప్రత్యక్షముగ గాంచి శుద్ధోదను డాయనపాదములపై సాష్టాంగ పడి నమస్కరించెను.

కపిలవాస్తులో బుద్ధుడు స్వయముగా భిక్షార్థము వెళ్ళెను. శుద్ధోధనుడు తన కుమారుని భిక్షాచర్య తనకు సిగ్గుగా భావించి "జంబూద్వీప మందలి రాజులందఱు నీవెంట వచ్చినను నాతిథ్యసత్కారముల జేయగలను. ఈ భిక్షు సమూహమునకు భోజన మొసగజాలనా? భిక్షుంచుట తగ" దని కుమారుని బ్రతిమాలుకొన్నాడు.

## ఆదిబుద్ధుల సంప్రదాయము

"రాజా! మీది యాది రాజన్య సంప్రదాయము. మాది యాది బుద్ధుల సంప్రదాయము. భిక్షించుట మాకు పరంపరాగతమైన ధర్మ"మని బుద్ధుడన్నాడు.

ఆ సందర్భమున తన యమానుష శక్తితో నాకాశమున వికసించిన యరవిందముపై నాసీనుడై బుద్ధుడు, తన తండ్రికి మమత్వము దుఃఖ కారణమనియును, మమతా బంధమగు పుత్ర వాత్సల్యము విసర్జింప వలయుననియు ప్రబోధించెను.

మనో వాక్కాయములతో నాచరించు కర్మల పైననే మానవుని సుఖ దుఃఖము లాధారపడును. చక్రవర్తి పదవి కాని, శక్రపదవిగాని చంచలము గావున, దుఃఖ రూపమే. అవి విషసర్పమును నగ్నిజ్వాలను బోలినవి. కాన, వివేకవంతుడు దుఃఖ రూపములును చంచలములునైన యా పదవులను గాంక్షింపక పరమశాంతి రూపమైన పదవి గోరవలయును. ఆ పదవిని రక్షించుకొనుటకు చతురంగబల సమూహములనవసరములు. కావున పరమ శాంతికి మార్గమైన ధర్మ మాచరింపవలయును. *

కపిలవాస్తు పురమున భిక్షార్థమై చరించుచున్న యా మహాశ్రమణుని గాంచి పురనారీమణులు మహారాజోచితములైన యుజ్జ్వల వేష భూషణములతో సుచిత్ర కాంచన రథ

---

* ఉత్తిట్ఠే నప్పమజ్జేయ్య ధర్మం సుచరితం చరే॥ ధర్మచారీ సుఖం సేతి అస్మిం లోకే పరమ్హిచ॥

లెమ్ము. ప్రమత్తతను బారద్రోలుము. సద్ధర్మము నాచరింపుము. ధర్మనిష్ఠుడిహాపరలోకముల సుఖించును, (ధమ్మపదము 13-2).

మున నేగవలసిన రాజనందనుడు పాదచారియై వాడవాడల భిక్షించుటకు ననుతప్త హృదయులైరి. యశోధారాదేవి యానందమో, దుఃఖమో తెలియని యనిర్వచనీయ మనఃస్థితి నందెను. తన నాథుడు కపిల వాస్తు వీధుల భిక్షించుటకై యామె దుఃఖించెను. యామె హృదయ వేదనను వర్ణింప నెవరి తరము?

## యశోధరా సందర్శనము

తరువాత శిష్యప్రముఖులైన సారిపుత్త మొగ్గల్లానులతో భగవంతుడు యశోధరాదేవి యంతఃపురమునకు వెళ్ళెను. బుద్ధ భగవానుడు స్వయముగా తన్ను చూచుటకు వచ్చుచున్నాడని యశోధర విన్నది. ఆమె యనురాగ హృదయము శరద్రాకాసమయ వార్ధియై యుప్పొంగినది. భగవంతుడు జగద్గురుడన్న విషయ మామె విస్మరించినది; ఆయన పాదములపై పడి కన్నీటి ధారలతో వానినభిషేకించి శోకక్షోభమైన హృదయ భారమును దగ్గించుకొన్నది. బ్రహ్మాది దేవతలకు సైతము స్పృశింప నసాధ్యమగు భగవంతుని పాద కమలముల నామె యాలింగన మొనరించుకొన్నది.

## మూర్తిగొన్న కరుణ

శరత్కాల కేతకీ గర్భపత్ర సదృశమైన దేహముతో మూర్తీభవించిన కరుణవలెనున్న యశోధరాదేవి యేడేండ్ల తపశ్చర్యను శుద్ధోదనుడు బుద్ధున కెఱిగించెను. వివేకవతియైన యామె యాత్మ సంయమనము వింతగాదని భగవంతు డామె

పూర్వజన్మ చరితను వివరించు చందకిన్నర జాతకమును తెలిపెను.

## వారసత్వపు ధనము

యశోధర నాశీర్వదించి భగవంతుడు శిష్యులతో మరల న్యగ్రోధవనము జేరుకొన్నాడు. రాహులమాత కుమారునితో "శిష్యులతో కలిసివెళ్లు నా మహనీయుడే నీ తండ్రి. ఆయనయొద్ద ననంత ధన నిధులున్నవి. నీ తండ్రి దగ్గఱకు వెళ్ళి నీ వారసత్వపు హక్కుగా నా ధనమును పొందు"మని చెప్పి పంపినది.

చిరునవ్వుతో తన చెంత నిలబడియున్న కుమార రాహులునిచూచి భగవంతుడు శారిపుత్రుని బిలిచి కుమారునికి ధర్మదీక్ష నిమ్మని యన్నాడు. రాహులుడు కాషాయాంబరముల ధరించినాడు. దానిని గాంచి శుద్ధోదనుడు దుఃఖించి, తల్లిదండ్రుల యనుమతి లేకుండ నెవరికిని సన్యాసదీక్ష నివ్వవలదని భగవంతుని ప్రార్థించెను. కరుణానిధియగు నా మహాముని తథాస్తని యన్నాడు.

## సౌందర నందము

ప్రజాపతి గౌతమీదేవి కుమారుడు నందుడు. ఆతడు చాల అందగాడు గావున ప్రజలాతని సుందర నందుడని యనుచుండిరి. భగవంతుడు కపిలవాస్తు పురమునకు వచ్చిన రెండవ నాడు (తఱో దుతీయ దివసే) కుమారనందుని పట్టాభిషేకమును, వివాహమును, నూతన గృహప్రవేశమును జరుపవలయునని పెద్దలు నిశ్చయించిరి.

సుందరనందునకు నిశ్చయించిన వధువు చాల సౌందర్య రాశి. ఆమె పేరు జనపద కల్యాణి. అత్యంత మనోహర రూపలక్ష్మితో, రూపానుగుణములైన చేష్టలతో వెలయు నామెను సుందరియని, రూప నందయని లోకము స్తుతించినది. సుందరీనందుల దాంపత్యము రతీ మన్మథుల దాంపత్యమువలె నుండుననియు, మందహాసమను రాజహంసతో, కనీకలను తుమ్మెదలతో, పీన స్తనములను నున్నత పద్మకోశములతో స్త్రీ పద్మినివలె యామె నంద దివాకరునిచే శోభించునని లోకము తలంచెను.

బుద్ధభగవానుడు కుమారనందుని వివాహమంగళోత్సవ ప్రదేశమునకు భిక్షార్థమై వెళ్ళెను. (పిండాయ పవి సిత్వా). అట భద్రాసనమున నాసీనుడై యుండి, భిక్షాపాత్ర నిండిన తరువాత నాసనము నుండి లేచుచు భిక్షా పాత్రను కుమార నందుని హస్తముల నుంచి యాతని నాశీర్వదించెను; వెళ్ళి పోవుచు నందుని హస్తముల నుండి భిక్షా పాత్రను తీసికొన లేదు.

## నందుని వివశత్వము

భగవంతునిపైనున్న గౌరవముతో "పాత్రను తీసికొను"డని చెప్పుటకు గూడ నందునికి నోరు రాలేదు. సౌధ సోపాన శీర్షమున (సోపాన సీసే) (మేడమెట్లమీద) తన పాత్రను తీసుకొనునని నందుడు తలంచెను. కాని, యట్లు జరుగ లేదు. సోపాన పాదమూలమున (సోపాన పాదమూలే) (మేడ మెట్ల క్రింద) పాత్రను తీసి కొనునేమోనని మరల నందుడను

కొన్నాడు. అదియును జరుగలేదు. రాజాంగణముననైన తన పాత్రను భగవంతుడు తీసికొనునని నందు డడియాస పడి నాడు. నిలువ వలయునని తలచినను వెను దిరిగి చూడకుండ బోవుచున్న తథాగతునిపై గల భక్తి గౌరవమున 'పాత్ర తీసి కొను'డని యనుటకు కూడ కుమార నందు డశక్తుడయి యేమియు తోచక వివశుడై యాయన వెంట బోవు చుండెను.

ఆ సమయమున పెండ్లి కూతురు జనపద కల్యాణి 'అయ్యో! భగవంతుడు నందరాజును వెంట దీసికొని పోవు చున్నా'డని బిగ్గరగా "ఆర్యపుత్రా! త్వరగా రం"డని పిలిచి నది. నందుడా పిలుపు వినియు పిలుపు లోని మధుర వేదన నెఱిగియు భగవంతుని పైనున్న గౌరవమున నిస్సహాయుడై భగ్న ప్రమదా విహారమును విద్యా విద్యా విహారాభిమతము నైన విహారమునకు వెళ్లెను.

నందుని హృదయమందలి మృదుజ్ఞానమును తీవ్ర క్లేశ రజమును భగవంతుడు గాంచెను. నందుడు హేతు బలాధిక్యము గల యాత్మాశ్రయ చిత్తుడు గాడు. అతడు ప్రత్యయ గౌరవముగల బాహ్యాశ్రయ బుద్ధి మాత్రమే. హేతుబలము వలన నాత్మాశ్రయ బుద్ధి ఘట్టితమాత్రుడై (కదుపబడిన వాడై) యా యత్నముననే విముక్తిని బొందగలడు. కాని, ప్రత్యయనేయ బుద్ధి యగువాడు బాహ్యాశ్రయమును గోరును. పరాశ్రయము వలననే యాతడు విముక్తి నందగలడు. నందు డట్టి ప్రత్యయనేయ చిత్తుడు గావున, నెవరి నాశ్రయించిన వారి స్వభావమును పొందును. బుద్ధాశ్రయమున బుద్ధమయ

త్వమును, జనపద కల్యాణి యాశ్రయమున తన్మయత నాతని చిత్తమందును. కృపా సింధువు భగవంతు డది గాంచి, తన యాశ్రయమున నందునికి మోక్షమనుగ్రహింప సంకల్పించెను.

విహారము చేరగానే బుద్ధుడు నందుని సన్యసింపుమని కోరి "కుమారా! అసారము లగుటవలన కామ సుఖములు స్వప్న సదృశములు. వాయు వశమున ప్రజ్వలించు నగ్ని హవ్యముల వలన శమింపనట్లు కామానుభవము వలన తృప్తి లభింపదు. ఇంద్రియ దాస్యము నింద్యమైనది. ధనములలో శ్రద్ధాధనము శ్రేష్ఠతమము. రసము లన్నిటిలో ప్రజ్ఞారసము తృప్తికరమైనది. సుఖములలో నధ్యాత్మ సుఖము ప్రధానమైనది. రతులలో నవిద్యారతి దుఃఖతమమైనది. కావున, నిత్యమును మంగళాత్మకమునైన శాంతి సుఖమును వరింపుము. లోకమంతయు జరామరణ భయగ్రస్తము. అనపేక్షచే లోక మోహముల జయించినవాడు శోక భుజంగము పాలుగాడు" అని ప్రబోధించెను. *

## రూపరాగమున, రూపరాగమును పరిహరించెను

కాని, నందుని హృదయమున జనపద కల్యాణి పిలుపు "ఆర్యపుత్రా! వెంటనే రండు" అని వినబడుచున్నది. "నాకు బ్రహ్మచర్యముపై, సన్యాసముపై నిష్టములే"దని (అనభిరతో౽హం)యతడన్నాడు. కాంతాగతమైన రాగమును, రాగము చేతనే నాశనమొనరింపవలెనని యుపాయ కుశలుడైన భగ

* శ్రద్ధాధనం శ్రేష్ఠతమం ధనేభ్యః ప్రజ్ఞారసస్తృప్తికరో రసేభ్యః
ప్రధాన మధ్యాత్మసుఖం సుఖేభ్యః అవిద్యారతిః దుఃఖతమారతిభ్యః

వంతుడు తన మహిమతో (ఇద్ధిబ లేన) త్రాయతింస దేవలోకము (త్రాయస్త్రింశ దేవలోకము)నకు తీసుకు వెళ్ళినాడు. మార్గ మధ్యమున చెవులును ముక్కును తెగిపోయి పుచ్ఛహీనమై వికృతముగ నున్న యొక మర్కటమును భగవంతుడు నందు నకు చూపి "నీ శాక్యాని (జనపద కల్యాణి) యీ కోతిని బోలి నదా?" యని యడిగెను. తరువాత దేవరాజు శక్రుని సన్నిధిలో నాట్యమాడు జగన్మోహన రూపశాలినులైన యప్సరసలను జూపి నీ శాక్యాని వీరికంటె సౌందర్యశాలినియా? ( అభిరూప తరావా దస్సనీయ తరావా) యని ప్రశ్నించెను. వికృత మర్కట మెట్లు సుందరిని పోలజాలదో, యట్లే శాక్యాని జనపదకల్యాణియు నీ యప్సరస లనురూపలావణ్యముల బోలజాలదు. వీరి సమధిక సౌందర్య సాగరమున జనపద కల్యాణి సౌందర్యమొక బిందువునకు సాటిరాదు (కలంపి న ఉపేతి కల భాగంపి న ఉపేతి) అని కుమారనందు డంగీకరించినాడు. రూప విభ్రమ నైపుణ రూఢలైన యీ యప్సరసల యందు తన మనస్సు రమ మాణమగుచున్నదని కామరాగార్తుడై యాతడు బుద్ధుని ప్రార్థించినాడు.

"కుమారా! వీరిని నీవు కాంక్షించు నెడల వీరికి శుల్క ముగా మహోత్తమ తప మాచరింపవలయును. బలము వలన గాని, సేవ వలనగాని, సంప్రదానము వలనగాని, రూపమువలన గాని వీరు లభింపరు. వీరు బ్రహ్మచర్యము (ధర్మచర్య) చేత నే లభింతురు."

## అప్సరసల కోసము బ్రహ్మచర్యము

అప్సరసల వయో రూప సౌభాగ్యముల యందలి రాగమువలన శాక్యానీ (జనపద కల్యాణీ) గతమైన రాగము నశించినది. అచ్చరల కోసము బ్రహ్మచర్యమును వహించి తపము చేయుటకు నందుడు మొదలిడెను. ఇంద్రియార్థముల కోసమై యాతడు నియతేంద్రియుడయ్యెను. పరమ శాంత మును తీవ్రమైన మదనభావము జలాగ్నులవలె నాతని హృద యము నుశమింపజేసెను; తపింపజేసెను.

అప్సరసల కోసము(అచ్చరానం హేతు బ్రహ్మచరియం చరీతి) బ్రహ్మచర్యమును నెరపు నందుని యాశ్రమము నందలి భిక్షువులందఱును పరిహసించిరి. కారుణ్య గర్భితమైన యా భిక్షువుల పరిహాసము నందుని మనస్సున పరివర్తన గలి గించినది. అతడు తన చర్యకు సిగ్గుపడినాడు. ఆతని హృదయ మున జ్ఞానోదయమైనది. అప్సరసలు తనకు వలదని నందుడు భగవంతునితో చెప్పినాడు. ఆస్రవములు క్షయించినవి. సర్వ కామములనుండి యాతని చిత్తము విముక్తినంది ప్రశాంతిని బొందినది.

## స్థిరచిత్తమున రాగాదులుం లేవు

"ఇంటి పైకప్పు సరిగాలేకున్న వర్షజలము లోనికి ప్రవే శించును. అటులనే యభావితమైన చిత్తమున (అస్థిరమైన చిత్తమున) రాగాదులు ప్రవేశించును. బాగుగ కప్పబడిన గృహములోనికి వర్షజలము ప్రవేశింపజాలనియట్లు సుసంభావి

తమైన చిత్తమున (స్థిరచిత్తమున) రాగాదులు ప్రవేశింప జాలవు.'' * అని భగవంతుడు నందునకు బోధించెను.

థేరీగాథలలో నంద రచితములైన గాథలు కలవు.

> ఆయోనిసో మనసీకారా మండనం అనుయుఞ్జిసం
> ఉద్ధతో చాపలో చాసిం కామరాగేన అట్టితో
> ఉపాయకుశలేనాహం బుద్ధేనాదిచ్చ బంధునా
> యోనిసో పటిపజ్జిత్వా భావేచిత్తం ఉదబ్బహింతి.

కామరాగార్తుడైన తన్ను, ఉపాయ కుశలుడైన భగవంతుడు ఉద్ధరించెనని దీని భావము. (థేరీగాథా 157–158)

భగవంతుడు స్త్రీలకు సన్న్యాసమున స్థాన మంగీకరించిన తరువాత జనపద కల్యాణి సైతము భగవంతుని శిష్యురాలై తన నాథుడైన నందుని ననుసరించి సహధర్మ చర్యము నెరపి యర్హత్స్థితిని పొందినది. జనపద కల్యాణికి బుద్ధు డిట్లు బోధించెను:''రూపనందా! శరీరము రోగాదిదోషములకు నిధానము; అశుచిమంతము. ఎముకలచే నీ నగరము (శరీరము) నిర్మింపబడినది. రక్త మాంసాదులు దీనికి లేపనములు, ఇందు జర, మృత్యువు, క్రోధము, వంచనయను భూతములు డాగియున్నవి.'' ♦

రూపనంద యా యుపదేశము విని బాహ్యాభ్యంతర

---

* యథాగారం దుచ్ఛన్నం వుట్ఠీ సమతి విజ్ఝతి। ఏవం అభావితం చిత్తం రాగో సమతి విజ్ఝతి। యథాగారం సుచ్ఛనం వుట్ఠీ నసమతి విజ్ఝతి। ఏవం సుభావితం చిత్తం రాగోనసమతి విజ్ఝతి॥

♦ అట్ఠీనం నగరం కతం మంసలోహిత లేపనం। యత్థ జరాచ మచ్చూచ మానో మక్కోచ ఓహితో (ధమ్మపదము 11-5)

-ముల శరీర స్వభావమును తెలిసికొని దేహంభావము నతిక్ర మించెను. అప్రమత్తయై సర్వ బంధములను ఛేదించి నిర్వాణ ప్రశాంతిని బొందెను. థేరి గాథలలో నూపనంద రచించిన గాథలు గలవు. *

ఈ సుందరీ నందుల పావన గాథను విస్తరించి యసమాన లలిత శబ్దార్థములతో సౌందర నంద కావ్యము నశ్వఘోష మహాకవి రచించెను. పాఠకులు దానిని చదువ వలయును.

## శాక్యకుమారు పరివ్రజనము

తరువాత భగవంతుడు కపిలవాస్తు నుండి రాజగృహమునకు బయలుదేరెను. మార్గ మధ్యమున యామ్ర వనము (అనుపియా వనము)న కొంత కాలమాయన నిలిచెను. ఈ సమయముననే శాక్యకుమారులైన యనురుద్ధుడు, భద్ధియుడు, కింబలుడు, నానందుడు, దేవదత్తుడు ననువాబుద ద్ధని సన్నిధి చేరి, శిష్యులైనారు.

* ఆతురం అశుచిం పూతిం పస్స నందే సముస్సయం
అశుభాయ చిత్తం భావేహి ఏకగ్గం సుసమాహితం॥
యథా ఇదం తథా ఏతం యథా ఏతం తథా ఇదం
దుగ్గంధం పూతికం వాతి బాలా న మభినందితం॥
ఏవం ఏతం అవేక్ఖంతీ రత్తిం దివం అతందితా
తతో సకాయ పఞ్ఞాయ అభినిబ్బిజ్జ దక్ఖిసం॥
తస్సాయే అప్పమత్తాయ విచినంతియా యోనిసో
యథా భూతం అయంకాయో దిట్ఠో సాంతర బాహిరో॥
అథ నిబ్బింద' అహం కాయే అజ్ఝత్తం చ విరజ్జ అహం
అప్పమత్తా విసంయుత్తా ఉపశాంతంహి నిబ్బాతా॥
థేరి గాథా 82-86.

ఆనందుడు శుద్ధోదనరాజు సోదరుడైన శుక్లోదనుని కుమారుడు. దేవదత్తుడు ఆనందుని కగ్రజుడు. అనురుద్ధుడు శుద్ధోదనుని సోదరుడైన ద్రోణోదనుని కుమారుడు. భద్ధియుడు శాక్య వంశజుడు; అనురుద్ధుని మిత్రుడు. ఛన్నుడు, (సిద్ధార్థుని సారథి), నుపాలియను మంగలివాడును నీ సమయముననే బుద్ధుని శిష్యులైరి.

## ఉపాలి

ఇతడు శాక్య కుమారుల వెంట బుద్ధుని సన్నిధికి వెళ్లెను. వారందఱు సన్యసించి బుద్ధుని శిష్యులై తమ యమూల్యములైన వస్త్రాభరణముల నుపాలి కొసగిరి. కాని, వివేక శాలియైన యుపాలి వానిని పరిగ్రహింపక, తానును బుద్ధుని శరణు జొచ్చెను. శాక్యకుమారుల యాభిజాత్య గర్వముననణచుటకై భగవంతు డుపాలికి పరివ్రజన దీక్ష ననుగ్రహించెను. శాక్యకుమారుల కంటె ముందుగ భగవంతునిచే శ్రమణ దీక్షను బొందిన యుపాలికి వారందఱు నమస్కరింపవలయును. ఉపాలి శ్రమణ జీవితమున మహాత్ముడయ్యెను. వినయ బోధకులలో నుపాలి ముఖ్యుడని భగవంతు డాతనిని ప్రశంసించెను. బుద్ధ భగవానుని జీవిత సమయముననే యుపాలి వినయ సూత్రములను సన్యాసులకు బోధించెను. వినయ సూత్రములకును, వాని వివరణమునకును ఉపాలి ప్రామాణికుడైన యాచార్యుడయ్యెను. మహాపరినిర్వాణానంతరమున రాజగృహ సమీపమున వైహార పర్వతమునందలి సప్తపర్ణి గుహయందు జరిగిన ప్రథమ సంగతియందు తన

ధారణాబలమున నుపాలి వినయ పిటకమునకు సంబంధించిన ఉపదేశ సూక్తములను చెప్పినాడు. బుద్ధోపదేశములను ధారణా వైభవముతో స్మృతియందుంచుకొని వినయ పిటకము నుద్ధరించి యుపాలి యాచార్యుడై జగన్మాన్యుడయ్యెను.

## జాతికంటె శీలమే మాననీయము

జనులు తమలోతాము జాతులను తెగలను నేర్పరచుకొనుటయే - అనగా, జన్మముపైనగాని, సిరిసంపదలపైనగాని యాధారపడిన జాతిభేదము - తాపహేతువని భగవంతుని బోధ. మానవజాతిలో భేదము నామ మాత్రమే. వంశగర్వమును, జాతి గర్వమును మోహబంధములు. ఆభిజాత్యమునకంటె పవిత్రశీలమే మాననీయమని తథాగతుని యుపదేశము.*

## అనాథ పిండకుడు

భగవంతుడు కపిలవాస్తునుండి తిరిగివచ్చిన తరువాత రాజగృహమున కనతి దూరమున శ్మశానముననున్న సీతవనమున కొన్ని దినములు నివసించెను. ఆ కాలమున కోసల దేశము శ్రావస్తి నగరమున సుదత్తుడను గొప్ప ధనికుడుండెను (శ్రేష్ఠి), నిరంతరము దిక్కులేని పేదసాదల కన్నదానము చేయుచున్నందున సుదత్తు డనాథ పిండకుడని ప్రసిద్ధి వహించెను. కాలక్రమమున తలిదండ్రులిడిన సుదత్త నామము

---

* సుత్తనిపాతం 600-611 "చతుష్పాత్తులు, సరీ సృపములు, చేపలు, జలచరములు, పక్షులు మొదలగునవన్నియు ఆకారభేదము చేత తమ జాతిని సూచించును. ఇటువంటి భేదము మానవులలో మృగ్యము. మానవులలో భేదములు నామమాత్రములు." జన్మాధిక్యత కంటే పవిత్ర శీలమే మాననీయమని భగవంతుడు అస్సలాయనుడను బ్రాహ్మణునితో వర్ణాధిక్యభావమును ఖండించెను. (మజ్ఝిమ నికాయము 2-148-154).

నందఱు మఱచిపోయిరి. అనాథ పిండకుడను నామమే యాయ
నకు స్థిరపడినది.

రాజగృహమున నున్న తన మిత్రుని చూచుటకై వచ్చిన యనాథపిండకుడు మిత్రునివలన శాక్యమునీంద్రుని మహనీయ తను, కారుణ్యమును విని యా జగద్గురుని సందర్శించుటకు బోయెను. లోకము మఱచిపోయిన తన పేరును బుద్ధుడు చెప్పగలిగిన నాయన మహిమను విశ్వసింతునని యనాథపిండ కుడు మనస్సున ననుకొనెను. అద్భుతముగ నుదయముననే భగ వంతు డాయనను జూచి "సుదత్తా! రమ్మ"ని పిలిచెను. సర్వజ్ఞు లగు బుద్ధులకు తెలియరానిదేది ?

ఆ కారణమున యనాథపిండకుని విశ్వాసము నిశ్చల మయ్యెను. ఆతడు భగవంతుని గృహస్థ శిష్యుడయ్యెను (ఉపాసకుడయ్యెను). భగవంతుని యెడల భక్తిపూర్ణుడై యనాథ పిండకుడా జగన్మాన్యుని శ్రావస్తీ నగరమున కాహ్వానిం చెను; అనంత ధనరాశిని క్రుమ్మరించి (ఏబది నాలుగు కోట్ల కర్షపణములు లేక, కహాపణములు) జేతుడను రాజకుమారుని నుండి సుందరోద్యానమును కొనెను. ఆ ఉద్యాన ప్రదేశము నాచ్ఛాదింపగలిగినన్ని సువర్ణముల నొసగె నని గ్రంథ ములు చెప్పుచున్నవి.

## జేతవనము

బుద్ధుని కోసమై యనాథ పిండకు డుద్యానమును కొను చున్నాడని తెలిసికొని జేతుడర్ధ ధనమును మాత్రమే స్వీకరించి యుద్యాన వృక్షములుకాక, ప్రదేశమును

మాత్రమే యనాథ పిండకునకు విక్రయించెను. ఫలపుష్పాభి రామములైన యుద్యాన వృక్షములను రాజకుమారుడు (జేతుడు) భగవంతునకు భక్తితో తన యుపహారములుగా సమర్పించెను. భగవంతుని ప్రతినిధిగా శారిపుత్రు డనాథ పిండ కుని నుండి యుద్యాన ప్రదేశమును, జేతుని నుండి ఫలపుష్ప తరులతలను ధారాపూర్వకముగ పరిగ్రహించెను. శారిపుత్రుని పర్యవేక్షణమున రాజ ప్రాసాదముల కంటె సుందర శిల్ప కళాత్మకముగ బుద్ధునకు సన్యాసులకును విహారభవనములు నిర్మింపబడెను. భగవంతుడు నివసించు మందిరము గంధకుటి యని ప్రసిద్ధి వహించెను. పద్మ సరోవరములును, ఫలభరితము లైన వృక్షములును పరిమళ సుమనోమనోజ్ఞములైన లతా సందోహము ను విహార వాటికకు సర్వాతిశాయియగు రామ ణీయకమును గలిగించెను. ఆ విహారపు ప్రహరి గోడ చుట్టు కొలత సుమారు రెండువేల గజములట. ఎత్తు తొమ్మిది గజములట!

## త్యాగశీలము

రాజగృహము నుండి బయలుదేరి భగవంతుడు పాద చారియై శ్రావస్తిని నలుబది అయిదు దినములలో చేరు కున్నాడట. ఈ రెండు నగరముల మధ్య మార్గము సుమారు నేటి మైళ్ళ లెక్కలో నూట ముప్పది అయిదు మైళ్లుండును. కాన శిష్యులతో భగవంతుడు దినమునకు మూడు మైళ్లు మాత్రమే నడచి యుండవలెను. దారి పొడుగున సుమారు మూడుమైళ్ళ కొక విశ్రాంతి శాలను యనాథపిండకుడు

గట్టించెను. అనాథ పిండకుడు నతని భార్యయును పుత్రుడును నిరువురు పుత్రికలును పదునారువేల మంది పరివారముతో భగవంతున కెదురుగ వెళ్ళి భక్తితో గొనివచ్చినారు. బుద్ధ భగవానుని కరకమలములలో సువర్ణ కలశము నుండి జలమును బోసి ధారా పూర్వకముగా జేత వనవిహారము ననాథ పిండకుడు సమర్పించెను.తొమ్మిది నెలలా యుత్సవమును జరిపించెను. అనాథ పిండకు డట్లమర కీర్తియయ్యెను. శీలమునకు త్యాగమునకు నాయన స్థాపించిన యాదర్శము శాశ్వతమైనది. బుద్ధోపదేశము వలన నాతడు భూతగుణ వికారములైన దృశ్యపదార్థముల క్షణిక స్వభావము నెఱింగి, జన్మ మృత్యు జరా వ్యాధుల కందని పరమ శాంతి ధామమును బొందెను.

సుక్షేత్రమున నాటిన బీజ మంకురించి, పల్లవించి, నానాట వృక్షమై పుష్పించి, ఫలించి, నాటిన వానికి చల్లని నీడతోబాటు పుష్పఫలాదుల నొసగురీతి దానశీలము మానవునకు సౌందర్యానందములను భోగ భాగ్యములను, తుదకు పరమ శాంతి రూపమైన నిర్వాణమును ప్రసాదించునని భగవంతుడుపదేశించెను.

అనాథపిండకుడు జేతవన విహారమును బుద్ధునకు సమర్పించుట బార్హూతస్థూప శిల్ప చిత్రమున రచింపబడినది.

అంగదేశమున మహాధనికుడైన ధనంజయుని కూతురు విశాఖాదేవి భద్దియనగరమున జన్మించెను. ఆ నగరమునకు వచ్చిన బుద్ధ భగవానుని విశాఖ ఏడు సంవత్సరముల చిరుత

ప్రాయముననే దర్శించెను. ఆ చిన్న వయసుననే పూర్వ సుకృత పరిపాకమువలన నామెకు బుద్ధునిపై భక్తి గలిగినది. యుక్తవయస్సు వచ్చిన తరువాత, విశాఖను మిగారుడను శ్రావస్తి నగరశ్రేష్ఠి - గొప్పధనికుడు, తన కుమారుడైన పుణ్యవర్ధనునకు వివాహము జేసికొనెను. మిగారుడు జైన భక్తుడు. విశాఖ తన మామగారి మనస్సున గూడ బుద్ధ భగవానునిపై భక్తి గలిగించినది.

## ధర్మచింతనము

బుద్ధునికి విశాఖాదేవి చేసిన సేవ చిరస్మరణీయము. భగవంతునికి తనకుగల ఎనిమిది కాంక్షలను విశాఖ తెలిపి, వాని ననుగ్రహింపవలయునని కోరినది. అవి - జీవితాంతము వఱకు వర్షకాలావసరములైన వస్త్రములను భిక్షువులకిచ్చుట, శ్రావస్తికి వచ్చు భిక్షువులకు నిరతాన్న దానము చేయుట, శ్రావస్తి మార్గమున బోవు నితర పరివ్రాజకులకు భోజనాది సౌకర్యము లొనరించుట, రోగుల పరిచారకులకు భోజనమొసగుట, రోగుల కౌషధ సేవజేయుట, పేదసాదలకు నిరతాన్న దానము చేయుట, భిక్షుకీవర్గమునకు స్నానావసర వస్త్రము లొసగుట, బుద్ధున కంగీకార యోగ్యము ననవద్యమునైన జీవితము జీవించుట యనునవి. భగవంతుడు వాని నను గ్రహించి యామె యౌదార్యమును ప్రశంసించినాడు.

విశాఖాదేవికి చాలమంది పుత్రీపుత్రులును,మనుమలు మనుమరాండ్రు నుండిరి. ఆ శుభ చరిత్రను పవిత్రయజ్ఞాదులైన శుభకార్యములలో నతిథినిగా నాహ్వానించి మొదట

నాతిథ్య మొసగిన పరమ మంగళకరమని కోసల ప్రజల విశ్వాసము.

"గొల్లవాడు కఱ్ఱతో గోవులను తోలుకొని పోవునట్లు జరా మృత్యువులు ప్రాణుల యాయువును వెన్నంటి తీసుకొని పోవుచున్నవి. పుష్పరాశి నుండి సుందరమైన మాలను రచించినట్లు జన్మించిన ప్రతి మానవుడును కుశల కర్మల నాచరింప వలయు" నని భగవంతుడు విశాఖకు బోధించెను. *

## పూర్వారామము

పూర్వారామమను రమణీయ విహారమును నిర్మించి విశాఖ భగవంతునకు ధారా పూర్వకముగా సమర్పించినది. పూర్వారామము యొక్క యందమును విలువయును జేతవన విహారమునకు తీసిపోవునవి కావు.

## కోసలాధిపతి ప్రసేనజిత్తు

కోసలాధిపతి ప్రసేనజిత్తు బుద్ధుని సమవయస్కుడు. ఆతడు జేత వనవిహారమునకు వెళ్ళి భగవంతుని దర్శనము చేసికొన్నాడు. వయస్సున భగవంతుని కంటె పెద్దవారై సజీవులై యున్న పూరణకశ్యపుడు, మంఖలి గోశాలుడు, నిగంధ నాటపుత్త్రుడు (మహావీరుడు) నుండగా బుద్ధుని మాత్రమే

---

*యథా దండేన గోపాలో గావో పాచేతి గోచరం
ఏవం జరాచ మచ్చూచ ఆయుం పాచేన్తి పాణినం
(ధమ్మపదము 10-7)
యథాహి పుప్ఫరాసిమ్హా కయిరా మాలా గుణే బహూ
ఏవం జాతేన మచ్చేన కత్తబ్బం కుశలం బహు (ధమ్మపదము-4-10)

యెందుకు సమ్యక్సంబుద్ధుడనవలయునని ప్రసేనజిత్తు బుద్ధుని ప్రశ్నించాడు.

క్షత్రియుని, సర్పమును, నగ్నిని, నర్హాతుని వయస్సు చిన్నదైనను తిరస్కార బుద్ధితో జూడరాదని బుద్ధుని యుపదేశము. చిన్న చేతిదైనను దివ్వె పెద్ద వెలుగు నిచ్చును. అల్పమయ్యు నగ్ని యన్నిటిని దహించును. త్రాచు చిన్నదైనను ప్రాణాపాయమును గల్గించును. కావున జ్ఞాని వయస్సుతో నిమిత్తము లేకుండగనే యందఱికిని పూజార్హుడు.

ఒకప్పుడు "మిగా రమాతుపాసాద"మున బుద్ధుని సన్నిధి నున్నపుడు ఏడుగురు జటిలులును నేడుగురు నిర్గంధులును నేడుగురు చేలకులును నేడుగు రేక శాటకులును నేడుగురు పరివ్రాజకులును దీర్ఘముగ పెరిగిన కేశములతో, నఖముములతో వికృత రూపమున నాదారి బోవుచుండిరి. భక్తి శ్రద్ధలతో వారికి నమస్కరించి వారి యాధ్యాత్మిక సంపన్నతను రాజు బుద్ధునెదుట ప్రశంసించెను.

"రాజా! సాధువుల మహనీయత సాధువులకు మాత్రమే తెలియును. విషయానంద పరాయణులైన గృహస్థులు దాని నెఱుగజాలరు. సౌశీల్య ప్రవర్తనమును నాపదల యందు ధైర్యమును మహాత్ముల లక్షణములు" అని భగవంతుడు ప్రసేనునకు బోధించెను.

## కీర్తికి అసూయ

మొదట ప్రసేనజిత్తు బుద్ధ భగవానుని కీర్తి లతావరణమున కసూయపడి యాయన వ్యతిరేకులను ప్రోత్సహిం

చెను. రాజ ప్రోత్సాహమున వారొక వింత ప్రచారముచేసి భగవంతుని శీలమున కపకర్ష గలిగింప ప్రయత్నించిరి. భగవంతుడు నివసించు గంధకుటి సమీపమున నెండు పువ్వుల రాసిలో రమణీయమూర్తియైన కన్యక శవమును దాచి యా పాప ప్రవర్తనము బుద్ధునిదేయని వారు ప్రచార మొనరించిరి. కాని, సత్యము తెలిసి భగవంతుని యశస్సు మరింత వా.

## హింస నింద్యము

జేతవనమున భగవంతుడు నివసించునప్పుడు ప్రసేనజిత్తు పశుహింసాత్మకమైన యజ్ఞమును జేసెను. ఇది విని యాయన రాజు హింసాత్మక చర్యను గర్హించెను. అశ్వమేధ పురుషమేధ వాజపేయాది హింసాత్మకములైన యజ్ఞములు కాంక్షిత ఫల ప్రదములుగావు. అహింసాత్మకములైన యజ్ఞములే దేవతలకు ప్రీతి పాత్రములై యాజ్ఞికులకుత్తమ ఫల దాయకములని భగవంతుడు చెప్పెను.

## శాక్యుల వంచన

యజ్ఞాదికమైన కర్మకాండ యందనురక్తుడైనను ప్రసేనజిత్తు క్రమముగా భగవంతుని యుపదేశమునందలి యుత్కృష్టతను గ్రహించెను. త్రిరత్నముల యందాయనకు శ్రద్ధాభక్తు లధికమయ్యెను. భగవంతునిపైగల యత్యంత భక్తిచే ప్రసేనజిత్తు శాక్యవంశముతో వివాహ సంబంధము జేసికొనవలయునని నిశ్చయించెను.

ఆభిజాత్య గర్వితులైన శాక్యులు శుద్ధోదనుని తరు

వాత శాక్యపాలకుడైన మహానామునికిని యాతని దాసికిని జన్మించిన వాసభ ఖత్తియ యను సుందరిని కులగోత్రములను మరుగుపఱచి ప్రసేనజిత్తున కొసగిరి. ఆమెను శాక్యకన్యగా భావించి ప్రసేనజిత్తు వివాహమాడెను. ఆమె కుమారుడే విడూడభుడు.

తనకు జరిగిన వంచనను తెలిసికొని ప్రసేనజిత్తు భార్యా పుత్రులను విసర్జించెను. తల్లి దేవంశమైనను పుత్రుడు తండ్రి వంశమునకే చెందునని, భార్యాపుత్రుల నాదరింపవలయునని భగవంతు డాతనికి హిత ముపదేశించెను. భగవానుని యుపదేశానుసారము ప్రసేనుడు మరల భార్యా పుత్రులను నాదరించెను.

## మల్లికాదేవి

అజాత శత్రునకోడి ప్రసేనజిత్తు కోసలదేశపు మాలా కారుని పూదోట యందు తలదాచుకొనెను. ఈ మాలా కారుని కూతురే మల్లిక. సౌశీల్య సౌందర్యములలో మల్లికకు మల్లికయేసాటి.రూపానుగుణ సౌశీలమున కామే యాదర్శము. మల్లికను రాజు ప్రేమించి తన రాణిగా జేసికొనెను. రాణు లందరిలోను మల్లికా దేవియే ప్రసేను హృదయమునకు రాణి యయ్యెను.

మల్లికకు కూతురు కలుగగా కొడుకు గలుగ లేదని రాజు విచారపడెను. కాని, బుద్ధుడు గుణశీల రమణీయమైన పుత్రిక పుత్రున కంటె మిన్నయని స్త్రీ గుణములను ప్రశం సించెను.

## విచారశీల

మనకు ప్రియులైనవారే దుఃఖ కారకులగుదురని భగవంతుడొకప్పుడు చెప్పగా ప్రసేనజిత్తు దాని నంగీకరింపలేదు. కాని, వివేకశాలినియగు మల్లిక భగవంతుని సూక్తి యందలి సారార్థము నెఱిగినది. తానును తన పుత్రిక వజీరయును, వాసభఖత్తియయును, ఆమె కుమారుడు విడూడభుడును రాజునకు ప్రియతములైనను వారందఱును జన్మమృత్యు జరా వ్యాధులకు లోబడవలసిన వారే కావున తుదకు దుఃఖ కారకులేయని విచారశీలయైన మల్లికాదేవి రాజుతో నన్నది.

ప్రియుల నుండి యెడబాటెన్నాడైన గలుగవలసినదే. ఈ వియోగమే దుఃఖ హేతువు. ప్రియాప్రియములు లేని వానికి హృదయ గ్రంథులు వీడిపోవును. ప్రారంభమున మధురముగ నున్నను ననురాగాదులు తుదకు దుఃఖ రూపములే యగును. ఇది వినుటకు కఠోరముగ నున్నను పరమ సత్యము.

## ధర్మము శాశ్వతమైనది

భగవంతుడొకప్పుడు జేతవనమున మల్లికాదేవికిట్లుపదేశించెను: "సుచిత్రములైన రాజరథములు గూడ కొంత కాలమునకు శిథిలములగును. అటులనే శరీరము వార్ధక్యమును జెందును కాని, సత్పురుషుల ధర్మము మాత్రము జరామరణ భయరహితమని మహాత్ములు పలుకుదురు."*

మల్లికాదేవి మరణించిన సందర్భమున దుఃఖితుడైన

* జీరన్తి వే రాజరథా సుచిత్తా। అథో సరీరమ్పి జరం ఉపేతి
సతంచ ధమ్మో నజరం ఉపేతి। సన్తో హవే సబ్భి పవేదయన్తి॥

రాజుపశమన కాంక్షియై భగవంతుని సన్నిధి కేగెను. ఆయన యమృతవాణి నాలకించి స్వస్థచిత్తుడయ్యెను.

రాజకుటుంబమునకు చెందిన సుమన, సుకుల యను వారును భగవంతుని యందు భక్తి ప్రపూర్ణలే. థేరిగాథలలో వీరు రచించిన గాథలు గలవు.

## ధర్మసంభాషణ సంగ్రహము

కోసల సంయుక్త నికాయమున భగవంతునకును, ప్రసేనజిత్తునకును జరిగిన ధర్మ సంభాషణ వివరముగ గలదు. అందలి బుద్ధ భగవానుని యుపదేశము నిట సంగ్రహింతుము.

రాగము, ద్వేషము, మోహమను నవియే దుఃఖమునకు ప్రధాన హేతువులు. ఎంత శ్రీమంతులైనను మానవులందఱును జరామరణములకు లోబడవలసినవారే. కావున, నందఱును ధర్మమాచరింపవలయును. ఆత్మ సర్వజనులకు ప్రియతమమైనది. కావున, మనోవాక్కాయ కర్మములలో పరిశుద్ధులై చరింపవలయును. త్రికరణ పాపములవలన నాత్మ జన్మపరంపరలలో దుఃఖమందును. త్రికరణములలో పాపశీలురైన వాని నేయక్షౌహిణులును రక్షింపజాలవు. ప్రాపంచక విషయాసక్తు లందఱును వ్యసన శీలురే. ప్రాపంచక విషయ లాభమునకై చాలామంది తెలిసియు నసత్యవాదులై చరింతురు. ఆహారమునందు యుక్తత యవసరము. తిండిపోతు కారాదు. పరిజనుల కాదర్శముగా రాజు కార్యాచరణ శీలుడు కావలయును. బుద్ధ దర్శితమైన యష్టాంగమార్గమే యుత్తమ మిత్రము, మార్గదర్శకమును. లోభము నింద్యము. చిత్త శుద్ధి

గలిగి యధ్యాత్మనిష్ఠా సంపన్నులగు సర్హాతులకు దానమొన రింపవలెను.

ఆరోగ్యమే పరమలాభము, సంతుష్టియే పరమ ధనము. విశ్వాసమే పరమ మిత్రము. నిర్వాణమే పరమ సుఖము.(1) సోమరి, అధికముగ భుజించువాడును, నిద్రాళువును, నిటు నటు ద్రొల్లుచు పరుండువాడును, మదించిన పందిని బోలువాడునైన మూర్ఖుడు జన్మపరంపరలనంది దుఃఖించును.(2)

## అహింస అక్షౌహిణులకన్న శక్తిమంతము

ప్రసేనజిత్తు పాలనా సమయముననే యంగుళీమాలుడు కోసల ప్రజలకు చాల బాధ గలిగించుచుండెను. వానికి భయపడి ప్రజలు దేశముసే వదలి పోవుచుండిరి. అయిదువందల మంది యాశ్వికులతో నంగుళీమాలుని పట్టుకొనుటకై ప్రసేనజిత్తు స్వయముగా బయలుదేరెను; పోవుటకు ముందు భగవంతుని సందర్శించుటకు జేతవన విహారమునకు వెళ్ళెను.

ప్రసేనజిత్తు సేనాసమేతముగ బయలుదేరుటకు కారణమును తెలిసికొని, యంతకుముందే తనను శరణుజొచ్చి, నవజీవన ధన్యత నందిన యంగుళీమాలుని భగవంతుడు పిలిచి

(1) ఆరోగ్యపరమాలాభా సంతుట్ఠీ పరమం ధనం
విస్సాస పరమాఞాతి నిబ్బాణం పరమంసుఖం (ధ 15-8).
(2) మిద్ధీయదాహోతి మహగ్ఘసోచ నిద్దాయితా సమ్పరివత్తసాయీ
మహావరాహోవ నివాప పుట్ఠో పునప్పునం గబ్భముపేతిమందో
(ధ 23-6).

ప్రసేనజిత్తునకు జూపెను. భగవంతుని యహింసా ప్రభావము నకు ప్రసేనజిత్తు సంభ్రమాశ్చర్య మగ్నుడయ్యెను.

## బాహ్యాశ్రయుడు

విడూడభు డసూయాపరులైన మంత్రుల ప్రోత్సాహము వలన తండ్రి భగవంతుని సన్నిధి నున్నప్పుడు రాజ్య సింహాసనము నాక్రమించెను. తరువాత నిరాశాహతుడైన ప్రసేనజిత్తు తన యల్లుడైన యజాత శత్రువును సాహాయ్యమును కోరుటకై రాజగృహమునకు బోయెను. రాజగృహము కోట వెలుపలనే దుఃఖ పరిశ్రాంతుడై యాతడు మరణించెను.

ప్రసేనజిత్తు భగవంతుని యుపదేశములను సమగ్రముగ సాధింపజాలక పోయెను. అతడశోకుని వంటి మహారాజశేఖరుడు కాకపోయినను సౌందర్యమయ హృదయము గలవాడు. ప్రసేననజిత్తునందు జ్ఞానము చాల మృదుస్థాయి యందుండెను. ఆ జ్ఞానము వలననే యాతడు బుద్ధ భగవానుని మహనీయతను గుర్తింపగలిగెను. కాని, యాతడు స్థితప్రజ్ఞుడు గాడు. అతనియందు క్లేశరజ మధికము. నాత్మాశ్రయమును బొందక బాహ్యాశ్రయమునే నాతడు కాంక్షించెను. కావున ధర్మమును సాధింపజాలక పోయెను. నిర్వాణ స్థితిని గురించి యాతడు సంశయగ్రస్త చిత్తుడయ్యెను; క్షేమయను భిక్షుకి వలన సంశయచ్ఛేదమందగలిగెను. ఆ విషయము ముందు వివరింపబడును.

## జీవితములోని యానందము

తన బుద్ధ చర్య యందు నాల్గవ సంవత్సరము భగవంతుడు జేతవనమున నున్నప్పుడు శాక్యులకును కోలియులకును రోహిణీ నదీ జలముల పంపకమును గుఱించి కలహము జరిగి భగవంతుడు కపిలవాస్తుకు వెళ్ళి యిరు పక్షముల వారికి హితముపదేశించి, దారుణ హింసను రక్తపాతమును నివారించెను.

వైరులమధ్య నవైరభావముతో, భీతచిత్తుల మధ్య నిర్భయ చిత్తముతో, నాసక్తుల మధ్య ననాసక్తితో వర్తించుటయే జీవితములోని యానందమని భగవంతుడు బోధించెను.* తరువాత వైశాలి సమీపమున మహావనమునందలి కూటాగారాశాలకు తిరిగి వెళ్ళి వర్షావాస మచ్చటనే చేసెను.

## శుద్ధోదన నిర్యాణము

నిర్వాణప్రాప్తి తరువాత (బుద్ధచర్యయందు) అయిదవ సంవత్సరమున తొంబది ఏడు సంవత్సరముల వృద్ధుడైన తన

*సుసుఖం వత! జీవామ వేరినేసు అవేరినో। వేరినేసు మనుస్సేసు విహరామ అవేరినో॥ సుసుఖం వత! జీవామ ఆతురేసు అనాతురా। ఆతురేసు మనుస్సేసు విహరామ అనాతురా॥ సుసుఖం వత! జీవామ ఉస్సుకేసు అనుస్సుకా। ఉస్సుకేసు మనస్సేసు విహరామ అనుస్సుకా॥
(ధ. 15-1, 2, 3)

తండ్రి శుద్ధోదనుడు మరణశయ్య యందున్నాడని తెలిసికొని దయామయుడైన భగవంతుడు కపిలవాస్తుకు బోయెను. సాక్షాత్కరించిన నిర్వాణ ప్రశాంతినలె ప్రభారాశియై ఎదుట నిలిచి, "సకల పదార్థములు నాశన ధర్మము కలవియె. అవి శాశ్వతములు గావు. శాశ్వతమైన నిర్వాణ సుఖము మీకు లభించు" నని చెప్పుచున్న కుమారుని చూచుచు శుద్ధోదనుడు సర్వబంధ విముక్తుడై నిర్వాణపదవి నందెను. తరువాత భగవంతుడు కూటాగార శాల కేగెను.

## స్త్రీలకు ధర్మచర్య

శుద్ధోదనుని మరణానంతరము మహాప్రజాపతి గౌతమీదేవి, యశోధర, రూపనంద (సుందరి) మొదలైన రాజకుటుంబ స్త్రీలును, శాక్య కోలియ వంశములకు జెందిన స్త్రీలును శ్రమణదీక్షకొఱకు భగవంతు నర్థించిరి.

మొదట స్త్రీలను బుద్ధ సంఘమున జేర్చుకొనుటకు సంసార తత్త్వజ్ఞుడైన భగవంతు డంగీకరింపలేదు. అయినను వారందఱు ముండిత శిరస్కలై కాషాయాంబరధారిణులై భిక్షాపాత్రలతో పాదచారిణులై భగవంతుని సన్నిధికి కూటాగారశాలకు బోయిరి. యంతఃపురోద్యానముల యందు మాత్రము విహరించు నా సుకుమారగాత్రలు శ్రమణధర్మమున కనురూపముగ నట్లాచరించిరి.

వారు కూటాగార విహారము చేరుసరికి సాయంకాలమయ్యెను. దూరప్రయాణమువలన వారి పాదములుబ్బి రక్తము స్రవించుచుండెను. ధూళిధూసరిత గాత్రములతో

సగము ప్రాణము పోయిన వారివలెనున్న యా సుచరిత్రలను గాంచి యానందుని హృదయము కరుణార్ద్రమై యాతని నేత్రము లశ్రుసిక్తములయ్యెను. ఆనందుడు వారికొఱకై బుద్ధుని ప్రార్థించెను.

భగవంతుడు ముమ్మారానందుని ప్రార్థనను త్రోసి పుచ్చెను. కారణమేమన-సంఘముననున్న పురుష సభ్యులకు స్త్రీల సన్నిధి మనశ్చాంచల్యము నుదయింప జేయనచ్చునని యాయన తలచెను. "స్త్రీలకు గార్హస్థ్యమే సముచిత ధర్మము. శ్రమణ జీవితము వారికి తగ"దని యాయన చెప్పెను.

ఆనందుడిట్లు ప్రశ్నించెను: "భగవంతుడా! గృహ మును పరిత్యజించి సన్న్యాసమును స్వీకరించి ధన్యచరిత్రలైన స్త్రీలు ధ్యానఫలమగు నర్హత్‌స్థితిని పొందజాలరా? బుద్ధుల యాగమనము పురుషుల మోక్షము కొఱకును, వారి నుద్ధరిం చుటకు మాత్రమేనా?"

భగవంతుడా ప్రశ్నకు సమాధాన మొసగజాలక పోయెను.

## నిర్వాణమున స్త్రీపుం వివక్షత లేదు

"ఆనందా! నిర్వాణమున స్త్రీ పురుష భేదము లేదు. తథాగతుల యాగమనము నిశ్చయముగా స్త్రీలనుద్ధరించుటకు గూడ. జరామరణ ధర్మముగల - ఇహ జీవిత దుఃఖముగల - మానవమాత్రులందఱు నిర్వాణ ప్రాప్తికి శ్రమింపవలయును. వారికి ధర్మదీక్ష నిమ్ము. కాని, స్త్రీలు బుద్ధసంఘమున చేర కున్న యెడల సద్ధర్మము వేయి సంవత్సరములు జీవించి యుండె

డిది. కాని, యిప్పుడది యొక అయిదు వందల యేండ్లు మాత్రమే నిలుచును" అని త్రికాలజ్ఞుడగు భగవంతుడన్నాడు.

## సామాన్య ధర్మమును విశేష ధర్మము బాధించును

స్త్రీపురుష పరస్పర సంగమువలన సామాన్యులకు కామాదుల ప్రమాదము సంభవించి ధర్మనాశన కారకమగు నని భగవంతుడు తలచియుండును. స్త్రీ సంసారలతకు మూల కందముగదా! కాని, ఇది సాధారణ ధర్మము. యశోధరాదుల కిది వర్తింపదు. సామాన్యులైన స్త్రీపురుషులందఱు సన్న్యాసము స్వీకరించి బుద్ధ సంఘమున తరువాతి కాలమున చేరుట చేతనే యది కలుషితమై నశించెను. దూరదృష్టితో బుద్ధుడు స్త్రీలకు(సామాన్య ధర్మము ననుసరించి) సన్న్యాసము వల దనెను. పరిపక్వ చిత్తులైన స్త్రీ పురుషులందరును నిర్వాణ పథమున నిర్భయముగ పయనింపనచ్చును. కాని, లోకమున సామాన్యముగ నపరిపక్వ చిత్తులు ప్రాపంచక విషయ లాభము నకై కాషాయముల ధరింతురు. వీరి వలననే ధర్మమునకు ముప్పు.

మహాశాస్త్రయె భగవంతుడా ప్రమాదమును పరి హరించు నుద్దేశమున భిక్షుకీ వర్గమునకు ప్రత్యేక నియమావళి నేర్పాటు చేసెను. ముఖ్యముగా నెనిమిది నిబంధనలను స్త్రీలు పాటింపవలెను. వినయ పిటకమునందలి పాతి మోక్ష సూత్తము నందలి రెండు వందల ఇరువది ఏడు నియమము లను పురుషులతోబాటు స్త్రీలును పాటింపవలయును.

భిక్షుణీ పాతిమోక్షమున స్త్రీ స్వభావాను గుణముగ నీ సూత్రములు కొలది మార్పులతో నున్నవి. శ్రావస్తి జేత వనముననే భిక్షుణీ పాతి మోక్షమునందలి నియమావళి కూర్పబడినదని చరిత్ర తెలుపుచున్నది.

## భిక్షుణీ సంఘము

వైశాలియందు బుద్ధభిక్షుణీ సంఘమట్లు రూపొందెను. మహా ప్రజాపతి గౌతమీదేవి ఆ సంఘమునకు పెద్ద. భిక్షుణీ సంఘమున నాడు అయిదు వందల మంది సభ్యురాండ్రుండిరి. గౌతమీదేవియును, యశోధరయును నచిరకాలముననే శ్రామణ్య ఫలమునంది, యర్హత్స్థితిని పొందిరి. భిక్షుణీ సంఘమున గౌతమీ, యశోధరా, రూపనంద మొదలైన శాక్య నారీమణులు మాత్రమే కాక, ఖేమ (క్షేమ), ఉప్పలవణ్ణ, పటాచార, భద్ద (భద్ర), కిసగౌతమి, ధమ్మదిన్న, విశాఖ మొదలైన వారర్హత స్థితిని బొంది, యమర కీర్తులైరి. ముందు వీరిలో కొందఱిని గూర్చి తెలిసికొందము.

## క్షేమాదేవి

కౌశాంబీ ప్రాంతమున నున్న మంకుల పర్వతమున వర్షావాస మొనరించి భగవంతుడు తిరిగి రాజగృహ వేణువన విహారమునకు వచ్చెను. ఆ సమయముననే బింబిసార భూపాలుని రాణి క్షేమాదేవి (ఖేమ) బుద్ధ భగవానుని శిష్యురాలై భిక్షుణీ సంఘమున జేరినది.

క్షేమాదేవి యధిక లావణ్యరాశి. ఆమెకా రూప గర్వ

మధికము. సౌందర్య గర్వమున నామె బుద్ధులను గౌరవించదు. బింబిసార మహారాజాలోచించి ఖేమాదేవి బుద్ధుని సందర్శించునట్లు సన్నివేశమును గల్పించెను.

కంటకమును కంటకము చేతనే తొలగించునట్లు రూప వయస్సంబంధమైన క్షేమాదేవి గర్వములు (రూపనిర్మదమును) రూపము చేతనే యుపశమింపజేయుటకుపాయకుశలుడైన మహాముని తలంచెను. తన యిద్ధి (ఋద్ధి) బలమున షోడశప్రాయము గల యభిరూపవతులను క్షేమాదేవి యెదుట సృష్టించెను. వారి ముఖబింబములు పూర్ణచంద్ర సశ్రీకములై ప్రకాశించెను. సహజ శరీర సౌందర్యమునకు వారి యాభరణములు మరింత శోభను కలిగించెను. వారి రూప మనువ్యంజన సముజ్జ్వలమై ప్రకాశించెను.

క్షేమాదేవి వారి యెదుట సువర్ణమయ రాజహంసల యెదుట కాకమువలె శోభావిహీన మయ్యెను. ఆమె 'అహో ముఖబింబ శోభ! అహో లలాట శోభ! అహో కేశసౌభాగ్య' మని సర్వశరీరావయవ రూపశ్రీచే సమాకర్షిత చిత్తయయ్యెను. ఆ రూపముపై నామెకధిక స్నేహభావము గలిగెను.

చూచుచుండగనే యా రూపలక్ష్ములు షోడశ వర్ష ప్రాయము నతిక్రమించి వింశతి వర్ష ప్రాయలైరి. క్రమముగా యౌవన మతిక్రమించి వారు వార్ధక్యమును బొందిరి. వారి శరీరము జరాజీర్ణమై విరూపమందెను. వయోరూప సౌభాగ్యమునందలి యీ చాంచల్యమును ప్రత్యక్షముగ నా క్షణమున జూచి క్షేమ విరక్తచిత్తయయ్యెను.

ఆమె చూచుచుండగనే వారందఱు మరణించిరి. కంకాది క్రవ్యాద పక్షులు వారి శరీరములను భక్షించెను. మనోరమ లైన యా కాంతలట్లు జరావ్యాధి మరణములపాలై నశించుట క్షేమ ప్రత్యక్షముగ గాంచినది.

ఆ భయంకర సత్యసందర్శనమువలన క్షేమాదేవి యభిరూప గర్వము తీక్ష్ణ సూర్యప్రభలో నదృశ్యమగు తుషార మేఘమువలె నశించిపోయెను. భక్తి వినమ్రతలామె నావేశించెను. క్షేమ భగవంతునికి శిష్యురాలై సన్యసించి భిక్షుణీ సంఘమున జేరినది.

## తృష్ణ స్వయంకృతజాలము

తృష్ణచ్ఛేదనమును గుఱించి యొకప్పుడు భగవానుడు క్షేమ కిట్లు బోధించెను:

"పట్టు పురుగు తనచే నిర్మితమైన గూటియందే తాను పడి నశించునట్లు రాగానురక్తులు స్వకృత తృష్ణా ప్రవాహమున బడి నశింతురు. ధీరులు తృష్ణాచ్ఛేదన మొనరించి సర్వ దుఃఖములను క్షయింపజేసి యనాసక్తులై చరింతురు."*

క్షేమాదేవి కృతకృత్యురాలైనది. ఒకప్పుడు కోసలాధిపతి ప్రసేనజిత్తు క్షేమాదేవిని శ్రావస్తి సాకేతముల మధ్య నున్న తోరణవత్థు దగ్గర సందర్శించెను. నిర్వాణ స్థితిని గుఱించి ప్రసేనుడు సంశయచిత్తుడై యుండెను. భిక్షుకి క్షేమను

* యే రాగ రత్తానుపతన్తి సోతం। సయంకతం మక్కటకోవ జాలం ఏతంపి ఛేత్వాన వజన్తి ధీరా। అనపేక్ఖినో సబ్బదుక్ఖం పహాయ॥ (ధ 24 - 14)

కోసల ప్రభువు భక్తి పూర్వకముగ సంభావించి–మరణాంత రము బుద్ధుడుండునా (హోతి తథాగతో పరం మరణాతివా) యని ప్రశ్నించెను. ఆ విషయము తమకు భగవంతుడు తెలుప లేదని యామె సమాధానము.

అయిన, మరణాంతరము బుద్ధుడు లేడా? (నహోతి తథాగతో పరం మరణాతివా) అని రాజు మరల ప్రశ్నించి నాడు. అదియును భగవంతుడు తమకు తెలుపలేదని క్షేమ చెప్పినది.

"అయిన, మరణానంతరము బుద్ధుడు ఉండును, లేడు కూడనా? (హోతి న చ హోతి తథాగతో పరం మరణా తివా)."

"అది కూడ మాకు భగవంతుడు తెలుపలేదు."

"అయిన, బుద్ధుడు మరణానంతరము లేడు లేడు అని భావింప వచ్చునా?" (నేవహోతి నహోతి తథాగతో పరం మరణాతివా).

ఆ విషయమును భగవంతుడు తమకు చెప్పలేదని క్షేమ చెప్పినది.

అవి చెప్పక పోవుటకు కారణమేమి అని రాజు ప్రశ్నిం పగా క్షేమ ఆయనకు ఎదురు ఒక ప్రశ్న వేసినది. "మహా రాజా! గంగా సైకతము ఇన్ని వేలు, లక్షలు, కోట్లని లెక్కించి చెప్పు గణకుడు లేక, కోశాధికారి మీ దగ్గర కలడా?" అట్టి వాడు లేడని రాజు సమాధానము.

"మహా సాగరము నందలి జలమును కొలిచి ఇన్ని వేల, లక్షల, కోట్ల కొలపాత్రల జలమున్నదని తెల్పువారెవరైన మీా దగ్గర కలరా?" లేదని రాజు అన్నాడు.

మహాసాగరము కొలుచుటకు సాధ్యముకాదు. గంగా సైకతమును గణింప నసాధ్యము. ఆ విధముగనే మరణానంతరము తథాగతుని భౌతిక లక్షణములతో కొలుచుటకు సాధ్యముగాదు. అప్పుడు ఆయన పంచస్కంధ విముక్తుడు, గభీరుడు, మహా సాగరము వలె పరిమితి కతీతుడు. నీ వడిగిన ప్రశ్నలేవియు ఆయన కన్వయింపవు.

"తథాగతో గంభీరో, అప్పమెయ్యో దుప్పరిగాహో, సెయ్యథాపి మహాసముద్దో." (అంగుత్తర నికాయము).

క్షేమాదేవి సమాధానమును విని రాజు ఆనందమగ్నుడైనాడు. క్షేమ అందుకొనిన మహోత్తమ స్థితి ఆమె వాక్కులలో ప్రకాశించినది.

## సోమాదేవి

ఈ సందర్భమున బుద్ధ భగవానుని ఆశ్రయించి అర్హాత స్థితిని పొందిన ధన్యురాండ్రయిన మహిళా రత్నములను గుఱించి కొంత తెలిసి కొందము. ఈ శ్రమణీమణులు ఉపనిషత్కాలము నందలి గార్గీ మైత్రేయీ సులభ మొదలైన వారిని విస్మరింప జేసినారు.

సోమాదేవి బింబిసారనృపాలుని పురోహితుని కూతురు. భగవంతుని ఉపదేశము ననుష్ఠించి యామె నిర్వాణానందధారిణియై శ్రావస్తి నగరమున నివశించుచుండెను. తన అమృతానుభవమును ప్రకాశిత మొనరించు గాథలను సోమ రచించినది. వానివలన ఆమె చిత్తభూమిక మనకు తెలియుచున్నది.

## మారుని అపలాపము

ఒకనాడు ఆమె అంధవనమున వృక్షచ్ఛాయ నాసీనయై యుండగా మారుడామె మనస్సున వ్యామోహమును గలిగించుటకు ప్రయత్నించెను. "మునులు పొందు నిర్వాణపదము స్త్రీజన సాధ్యముగాదు. సుదూరమై మహోన్నతమైన నిర్వాణ శిఖరమును స్త్రీలు చేరజాలరు. ఏడు సంవత్సరముల వయసు నుండి అన్నము వండుచున్నను రెండువ్రేళ్ళతో పట్టిచూడక స్త్రీలు అన్నము ఉడికినది లేనిది చెప్పలేరు" అని మారుడన్నాడు.

"అర్హంత పథమున వికసించు జ్ఞానముతో, హృదయ స్థైర్యముతో, అప్రమాద గమనముతో నిర్వాణ శీతల సత్య శిఖరములకు పయనించు మాకు స్త్రీ ప్రకృతి నిరోధకము కాదు. ధర్మసాక్షాత్కారము వలన విషయకామన లంతరించినవి. అవిద్యావరణము రెండుగా చీలిపోయినది. ఓ మృత్యూ! అశుభరూపీ! నీ నైజము బోధపడినది. నిన్ను నేను జయించితిని" అని యా యోగిని పలుకగనే మారుడు సిగ్గుపడి అదృ

శ్యుడయినాడు. సంధ్యా శీతలచ్ఛాయలలో నా థేరి ధ్యాన నిమగ్నయైనది. ఇదియే సోమ భవ్యచరితము.

## భిక్షుకి సుక్క

మరియొక థేరి 'సుక్క', రాజగృహమున సంపన్న కుటుంబమున జన్మించినది. భగవంతుడు సంబోధి నందిన మొదటి సంవత్సరముననే సుక్క ఆయన శిష్యురాలయినది. తరువాత భగవంతుని శిష్యురాలై బోధిమూర్తియైన 'ధర్మ దిన్న' అను తపస్విని దగ్గర విద్యాభ్యాస మొనరించినది. అనంతరము బోధి విజ్ఞానమున నిష్ణాతయై అర్హత్స్థితినిపొంది రమణీయముగ ధర్మబోధ చేసినది.

## వనదేవత ఆనందము–ఆహ్వానము

రాజగృహ సమీపమునగల ఆమె ఆశ్రమమునకు జనులు ధర్మశ్రవణమునకు అనుదినము వెళ్లుచుండిరి. వృక్షచ్ఛాయా రమ్యమైన గృహోపరితలమున నిటు నటు పచరించుచు ఆమె ధర్మబోధ చేయుచుండును. వృక్షవాసినియైన యప్సరోదేవత ఆమె జ్ఞానవైభవమునకు పొంగి పరవశయై, శీతలచ్ఛాయా మనోజ్ఞమైన తన నివాస వృక్షమును వీడి రాజగృహమునకు వెళ్ళి, సుక్క బోధామృతమును గ్రోలి అమృతత్వమును పొందుటకు ప్రజల నాహ్వానించు చుండెనట. వనదేవత ఆహ్వానమున రాజగృహవాసులు సుక్క సన్నిధికి వెళ్ళి బోధామృతమును తనివిదీర గ్రోలుచుండిరట.

## అనుభూతి ప్రకాశము

తన జీవిత చరమ సంధ్యలో ఆ శ్రమణీమణి తనలో తానీ విధముగ ననుకొన్నది. "ప్రభానందినీ! సుకా! సత్య సాక్షాత్కారమున తృష్ణా విముక్తిని బొంది స్థిరవై, ఆత్మ భూతవై; శాంతవై, కడపటిదియై నశ్వరమైన ఈ దేహబంధ మును నశింపజేయుటకు ఓర్చుకొనుము. నీవు సపరివారముగ మారుని జయించితివి కదా!"

## భిక్షుకి శుభ

శుభ అను మరొక తపస్విని బుద్ధుని శిష్యురాలు. జీవ కుని వనమున నామె సంచరించుచుండగ, నొకడామెను మోహించెను. విషయ సుఖానుభవమునందలి నిర్వృతిని గురించి వా డుపన్యసించి, శుభ నేత్రములు హరిణీనేత్ర రమ్యములని, తన హృదయమున కామోజ్జ్వలనమున కవి ఉద్దీ పనములని ప్రలాపించినాడు.

ఆతని మోహాలాపములకు శుభ చింతించి, కామోద్దీ పన కారణములైన తన సుందర నయనములను పెరికి వేసినది. త్యాగోజ్జ్వలమైన ఆ శ్రమణి చర్యకు మోహితుడు పశ్చా త్తప్తు డయినాడు.

బుద్ధ భగవానుని దివ్యసన్నిధి నాయన కారుణ్య వీక్షా ప్రసారమున శుభ మరల నేత్రసిద్ధి నందినది.

## భిక్షుకి ధర్మదిన్న

ధర్మదిన్నయను తపస్విని పరమబోధమూర్తి. ఈమె భగవంతుని ధర్మమును విశదమనోజ్ఞముగ ప్రజలకు బోధించినది. విశాఖుడను నతడా పరమ భిక్షుకిని నిర్వాణమును గుఱించి ప్రశ్నించినాడు.

## జీవితమునే నిర్వాణసిద్ధి

"విశాఖా! నీవీ ప్రశ్నను చాలదూరము గొనిపోవు చున్నావు. ధార్మికుని జీవనము నిర్వాణమున నిమగ్నమై యున్నది. జీవిత పరమ లక్ష్యమును, పరమ గమ్యమును నిర్వాణమే. ఇంకను తెలిసికొనవలయునన్న జిజ్ఞాస ఉన్నచో భగవంతుని సన్నిధికి వెళ్ళి ప్రశ్నింపుము."

తరువాత విశాఖుడు బుద్ధ భగవానుని సన్నిధికి వెళ్ళినాడు. భగవంతు డతని ప్రశ్నను, ధర్మదిన్న సమాధానమును విని ఇట్లన్నాడు: "భిక్షుకి ధర్మదిన్న జ్ఞానవంతురాలు. నీవీ ప్రశ్నను ముందే నన్నడిగియున్నను, ఆమె చెప్పినట్లే చెప్పియుండెడివాడను. ఇది నీ మనస్సున పదిల పఱచుకొనుము. ధర్మము నెఱిగిన ఈ జీవితముననే దుఃఖాత్యంత నివృత్తిని పొందవచ్చును."

"దిట్ఠే ధమ్మే దుక్ఖస్స అంతకారోహోతి" (మజ్ఝిమ నికాయము).

## థేరీగాథలు తన్మయ గీతికలు

ఇంకను చాలమంది శ్రమణీమణులు అర్హత్స్థితిని

పొంది కృతకృత్యులైనారు. నిర్వాణానుభూతి ప్రకాశకము లైన వీరి తన్మయగీతములే థేరీగాథలని ప్రసిద్ధి వహించినవి.

నిర్వాణమనగా సర్వనాశనమను దుర్భావమును ఆ తన్మయామృత గీతములు తీవ్రముగ నిరసించుచున్నవి.

## చించా మానవిక

బుద్ధ చర్యయందేడవ సంవత్సరమున భగవంతుడు నగర సమీపమందలి జేత వనవిహారమున నివసించుచుండెను. ఆయనకు వ్యతిరేకులైనవారా సమయమున నాయన భ్రష్ట శీలుడని యపవాదులు వేయుటకు క్షుద్ర మార్గముల ప్రయత్నించిరి.

అపవాదును తప్పించుకొన్న వారీ ప్రపంచమున నెవ్వరును లేరు. ఇది యద్యతన విషయము కాదు. మౌనిని, బహుభాషిని, మితభాషిని గూడ జనులు నిందించుచునే యుందురు. కేవలము నిందితుడు గాని, కేవలము ప్రశంసితుడు గాని నేటి వఱకెవరును యుండియుండలేదు. ఇప్పుడును నిక ముందును నుండబోరు.

చించా మానవికయను యువతి చాల నందగత్తె. కాని, యామె హృదయము మాత్రము చూపానుగుణము గాదు; అది వంచనకు నిధానము. ఆమె బుద్ధ వ్యతిరేకులైన యసన్మతవాదుల శిష్యురాలు. వారి యాదేశానుసారము ప్రతి సాయం సమయమున నామె జేతవన విహారమునకు వెళ్లి రాత్రి యచ్చటనే రహస్యముగ గడపి యుదయకాలమున జేతవనము

నుండి వెనుదిరిగి ప్రజలు జూచుచుండగ వచ్చుచుండెను. కొంత కాల మట్లు జరిగెను.

ఒకనాడు భగవంతుడు ధర్మబోధ జేయు సమయమున నామె గర్భవతివలె వేషము ధరించి యచ్చటకు వచ్చినది. తన గర్భధారణకు కారణము బుద్ధుడనియు, తన ప్రసూతికి గావలసిన యేర్పాట్లాయన జేయవలయుననియు నామె యందఱితో జెప్పినది. ప్రజలు భగవంతుని సౌశీల్యమును గుఱించి శంకించుచుండిరి,

అప్పుడు భగవంతుడు "సోదరీ! నీ మాటలు సత్యమో, యసత్యమో యది నీకు, నాకును మాత్రమే తెలియును" అనెను. బుద్ధుడట్లను చుండగనే దేవరాజైన శక్రుని యాగ్రహమువలన యామె కృత్రిమ గర్భము (దారుగోళము) సూత్రనులూడి క్రిందబడినది. ప్రజలామె వంచన నెఱిగిరి. భగవంతుడు దయార్ద్ర వీక్షణములతో చించామానవికను జూచుచు నిట్లన్నాడు: "ధర్మము నతిక్రమించువారు, మృషావాదులు, పరలోక చింతాశూన్యులునైనవారు చేయని యకార్యముండదు." (*)

## మిథ్యాదృష్టి నిరయహేతువు

ఆ పాపము వలన భూమినుండి యగ్నిజ్వాలలు లేచి చించామానవికను కబళించినవి. ప్రత్యంత నగరమును (సరి

(*) ఏకం ధమ్మం అతీతస్స ముసావాదిస్స జంతునో।
వితిణ్ణి పరలోకస్స నత్థి పాపం అకారియం॥ (ధ. 13-10)

హద్దుననున్న నగరము) బాహ్యాభ్యంతరముల బాగుగ రక్షించు నట్లు మానవులు క్షణమైనను వ్యయము జేయక తమ్ము దాము రక్షించుకొనవలయును. క్షణమైనను ప్రమత్తతచే ప్రవర్తించినవారు నరకముపాలై దుఃఖింపవలసి యుండును. మిథ్యాదృష్టిచే అభయమునందు భయదర్శినియై భయమునం దభయ దర్శినియై చించ, యసన్మత వాదులును మిథ్యా సంకల్ప గోచరులునైన వారి మాట విని దుర్గతిని బొందెను. కావున ప్రజలకు సమ్యగ్దృష్టి చాల ముఖ్యమైనది.

## మాతృదేవత ఋణము

ఆ సమయముననే భగవంతుడు త్రాయస్త్రింశ స్వర్గమున దేవతగానున్న తన తల్లి మహామాయకు నిర్వాణోపదేశము జేయవలయునని సంకల్పించెను; బుద్ధి ప్రభావము వలన నా దేవలోకమునకు వెళ్ళెను. కాని, తనది మర్త్యశరీర మగుటవలన ప్రతిదినము భూలోకమునకు తిరిగివచ్చి తన కొరకు శారిపుత్రుడు భక్తితో సిద్ధము జేసి యుంచిన యాహారమును భుజించుచుండెను. భోజనానంతరము తన తల్లి మాయాదేవి కుపదేశించిన యా మహనీయ ధర్మసారమును(మాతికా) శారిపుత్రునకు బోధించుచుండెను. ఆ బోధయే యభిధమ్మ పిటక రూపమును (మూడవ పిటకము) ధరించినదని కొందఱి యభిప్రాయము. (ధమ్మసంగణి వ్యాఖ్య).

దేవలోకము నుండి శ్రావస్తి నగరమునకు ముప్పది యోజనముల దూరమున నున్న సంకాస్య నగరమున బుద్ధుడు

కడపట దిగివచ్చినాడట. ప్రాచీన శిల్పులీ విషయము నాకాశము నుండి భూమిని తాకు నిశ్రేణికా (నిచ్చెన) రూపమున చిత్రించినారు. దేవరాజైన శక్రుడు బ్రహ్మలకు, దేవతలకు, బుద్ధునికి, మూడు నిచ్చెనలు కల్పించినాడట. ధ్యానపరాయణులు, నైష్కర్మ్య సిద్ధి నందినవారు, నుపశమనరతులు, స్మృతిమంతులు, ధీరులనైన బుద్ధులు బ్రహ్మాది దేవతలకును వందనీయులు గదా! *

## కృషిక భరద్వాజుడు

బుద్ధ చర్యయందు పదునొకండవ సంవత్సరమున భగవంతుడు రాజగృహ పరిసర ప్రాంతమున 'నేకనాల' బ్రాహ్మణాగ్రహారమునకు సమీపమున నున్న దక్షిణాగిరి విహారమున వర్షావాసము జేసెను.

ఆ సమయమున కృషిక భరద్వాజుడను బ్రాహ్మణుడు హాలికోత్సవము జేయుచుండెను. ఎద్దులను, నాగళ్ళను చక్కగ నలంకరించి, యుత్సవమున పాల్గొన్న వేలాది ప్రజల కన్నదాన మొనరించుచుండెను. కృషిక భరద్వాజుని యందలి పుణ్య లక్షణముల నెఱిగిన భగవంతుడా యుత్సవ ప్రదేశమునకు వెళ్ళి యెత్తైన మట్టి దిబ్బపై నాశీనుడయ్యెను. ఆయన మూర్తి నుండి యలౌకిక మనోహర ప్రభలు ప్రసరించు

* యేఝాన పసుతా ధీరా నెక్ఖమ్మూప సమేరతా। దేవాపి తేసం పిహా యన్తి సంబుద్ధానం సతీమతం॥ (ధ - 14 - 3).

చున్నందున నాకృష్ట హృదయులై ప్రజలందఱాయన సన్ని ధికి బోయి భక్తి శ్రద్ధలతో నమస్కరించుచుండిరి.

## నిర్వాణ కృషీవలుడు

"బుద్ధుడు సోమరి; శ్రమించి తన యాహారము నార్జింపని పరభాగ్యోపజీవి" అని కృషిక భరద్వాజుని యభిప్రాయము; కాన, నా బ్రాహ్మణునికి బుద్ధునిపై భక్తి గౌరవములు లేవు.

"భరద్వాజా! నేనును కృషీవలుడనే. ధర్మ క్షేత్రమే నా కృషి క్షేత్రము. దుష్కాంక్షలే యందలి కలుపు గడ్డి. వాటిని తొలగించి శ్రద్ధా బీజములను చల్లి, కుశల కర్మలను వర్షము జలములతో పెంచి, సర్వదుఃఖములను నశింపజేయు నిర్వాణ ఫలములను పండితు"నని నిర్వాణ కృషీవలు డాలౌకిక కృషీవలుని మందలించి, తన ప్రబోధ జ్యోత్స్నచే నాతని యందు శ్రద్ధాకైవారములను వికసింప జేసెను.

మానవుల హృదయ క్షేత్రముల యందు రాగద్వేష మోహేచ్ఛలను తృణదోషములను నశింపజేసి నిర్వాణఫల ప్రాప్తి పొందవలయునని మహాశాస్త్రయగు భగవంతుడు ప్రబోధించెను.

## ఆలవిక యక్షుడు

బుద్ధ చర్యయందు పదునారవ వర్షావాసము శ్రావస్తికి సమీపము నందలి యాలవియందు గడచినది. ఆలవిని పాలించు రాజు వేటకై యరణ్యమునకు వెళ్ళెను. ఆలవిక యక్షుడను నరమాంసభోజి యా రాజును బంధించెను. దినమొక మను

ష్యుని తన కాహారముగ పంపు నిర్ణయమున యక్షుడు రాజును వదలివేసెను.

రాజు తన బందీలుగానుండు దోషులను మొదట యక్షుని కాహారముగ బంపెను. కడపట నిలువరుస ప్రకారము ప్రతి కుటుంబము వారును ప్రతిదినమొక మనుష్యుని యక్షుని కాహారముగ బంపు నట్లేర్పాటు చేయబడెను. రాజ కుటుంబమున కా వరుస వచ్చినది. చేయునది లేక రాజు తన కుమారుని యక్షున కాహారముగా బంపెను.

ఆ సమయమునసే బుద్ధ భగవానుడా యక్షునివాసమునకు వెళ్ళి యక్ష సింహాసనమున నాసీనుడయ్యెను. కొంత సేపటికి హిమవంతమునకు బోయి యుండిన యక్షుడు తిరిగివచ్చి భగవంతుని జూచి క్రోధోజ్వలుడై యాయనపై బడ నుద్యుక్తుడయ్యెను.

భగవంతుడు తన యమృతవాణితో యక్షుని ప్రబోధించెను. ఆతని హృదయ తమస్సు బుద్ధ ప్రబోధ చంద్రోదయ కాంతులలో నశించినది. నరాదుడైన యక్షుడు మేఘావరణ నిర్ముక్తుడైన చంద్రునివలె శీలప్రభలతో ప్రకాశించినాడు. మహాపురుషులతోడి సంగతి క్షణకాలమైనను, భవ సాగరమును తరింపజేయు నౌక గదా! సత్సాంగత్యము వలన వేదాధ్యయన శూన్యులును నుపాసనారహితులును తపోవ్రత బాహిరులునైన వారెందఱో పూర్వకల్పములయందు నిర్వాణ పదవిని బొందిరి.

## సుతసోమ జాతకము

బుద్ధ భగవానుడు పూర్వభవమున బోధిసత్త్వుడుగా

నున్నప్పుడు కౌరవ వంశమున జన్మించెను. షోడశ కలాభి రాముడైన చంద్రునివలె ప్రకాశించు కుమారునకు తండ్రి సుతసోముడని పేరిడెను. అప్పుడు సైతము సుదాసుని కుమారుడైన కల్మాషపాదుడను నరమాంస భోజికి కారుణ్య ముపదేశించి, యాతని నహింసా పరాయణునిగా జేసెను. అనేక జన్మములయందు భగవంతు డారీతి కారుణ్యోపదేశమున లోకమును తరింపజేసెను. (చూడు – పాళీ జాతక 537, ఆర్యసూరుని జాతకమాల 31).

## సత్సంగ మహిమ

పరిమళములవలె వ్యాపించు సత్పురుషుల సుగుణ శీలములు పుష్పపరాగమువలె సమీపించిన వారిని పొందును. సత్పురుష సమాగమము వలన శూన్యప్రదేశము జనాకీర్ణమగును. మృత్యువు నుత్సవమగును. ఆపదలు సంపదలగును. ఆపత్సరోజముల కది హేమంత సమయము; మోహతుషారమునకు మారుతము. మనోవ్యాధుల కది సముత్సారణము. అజ్ఞాన వృక్షము నది భేదించివైచును. జలాసేకమువలన పుష్పగుచ్ఛములు ప్రఫుల్లమగునట్లు సాధు సంగమమువలన మనోహరోజ్వలమగు పరమ వివేకముదయించును. రాగాది రహితులును, గలిత గ్రంథులును, సందేహరహితులును నగు సాధువుల సంగతి యున్నచో తపస్తీర్థముల యవసరమేల?

దారిద్ర్య మరణ దుఃఖాది విషయ భ్రమలన్నియును సాధు సమాగమమున నుపశమించును. సంతోషము, సాధు సంగమము, విచారము, శమము ననునవియే నరులకు

భవాంబోధిని తరించుట కుపాయములు. నక్షత్ర పథమును చంద్రుడు సేవించినట్లు ప్రజలు సత్పురుషులను సేవించవలెను. (భజేత నక్షత్ర పథమివ చందమాః)

## కుశలకర్మ పరాయణత

కోసల ప్రజలను భయకంపితులను జేసి ప్రసేన జిత్తునకు ప్రబల సమస్యగా పరిణమించిన యంగుళీమాలుని వంటి క్రూరులైన బందిపోటులు సైతము బుద్ధ ప్రబోధమువలన సత్వగుణ పరాయణులగుట ముందే చెప్పబడినది. వారు నవ జీవనమును బొందిరి. మొదట ప్రమాదవశమున పాప మొనరించినను, మరల నద్దాని నెన్నటికి జేయక కుశలకర్మ పరాయణులైనచో మేఘావరణనిర్ముక్తుడైన చంద్రునివలె మానవులు ప్రకాశింతురని భగవంతుడే యొకప్పుడంగుళీమాలుని నోదార్చెను.

ఆ సమయముననే భక్తుడైన యనాథ పిండకుడు తన కూతురైన సుభద్రా దేవిని అంగదేశముననున్న తన మిత్రుని కుమారున కొసగి వివాహ మొనరించెను. సుభద్రాదేవికి బుద్ధ భగవానిపై భక్తి మెండు. కాని యామె భర్త కుటుంబము వారు నిర్గంథులను జైన మతాచార్యులకు శిష్యులు. నూత్న వధువు దిగంబర సన్యాసులను పూజించుట కంగీకరింప లేదు.

## బాహ్యాచారములర్థ శూన్యములు

"నిర్వాణ ప్రశాంతి ననుభవింపని వారికి దిగంబర

త్వమున ప్రయోజనమేమి? నిర్వాణ ప్రాప్తికి సాధనములైన శీల ప్రజ్ఞా సమాధుల నభ్యసింపక బాహ్య వేషములను, నాచారములను మూఢులు ప్రేమింతురు. లజ్జింప దగని కార్యమందు లజ్జితులగు వారును, లజ్జింపదగిన కార్యమందు లజ్జితులు గానివారు నగు సమ్యగ్దృష్టి హీనులు (మిథ్యా దృష్టిగల వారు) దుర్గతిని బొందుదురు*'' అను భగవంతుని యుపదేశమే సుభద్ర హృదయమున దీపకళిక.

## సుభద్ర హృదయసిద్ధి

కాన, నింటిలో సుభద్రకు కష్టము గలిగినది. చివరకామె యత్తగారి హృదయమున జిజ్ఞాసాంకుర ముదయించి, బుద్ధభగవానుని యుపదేశము వినవలయునని కాంక్షించినది. అంగదేశమును తన బోధామృతపూరమున దేల్ప భగవంతుడు అయిదువందలమంది శిష్య సమూహముతో నచ్చటకు వెళ్ళెను. సుభద్ర హృదయము జయించినది. ఆ కుటుంబము వారందఱును సద్ధర్మము నాలకించి ధన్యులైరి.

యంగదేశపు రాజధానియైన చంపానగర సమీపము నందలి మనోహర పుష్కరిణి తీరమున బుద్ధుడు విడిసినట్లు సోణదండ సుత్తము వలన దెలియుచున్నది. ఆ పుష్కరిణి 'గగ్గరా' యను రాణిచే నిర్మింపబడి, యామె పేరనే వ్యవహరింపబడుచుండెను.

---

* అలజ్జితాయే లజ్జన్తి లజ్జితాయే న లజ్జరే। మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తా గచ్ఛంతి దుగ్గతిం॥ (ధ 22 - 12)

## చంపక వనము

ఆ మనోజ్ఞ పుష్కరిణి చుట్టును నీలాది పంచవర్ణ కుసుమ ప్రతిమండితమును, మహోంతమునైన చంపకా రామ ముండెనని బుద్ధఘోషుడు సుమంగళ విలాసినియందు వివరించి నాడు. ఈ చంపకారామము పరివ్రాజక బోధకులకు నివాసమై యుండెనట. మగధరాజైన బింబిసార మహారాజు చంపానగర మును సోణదండు డను బ్రాహ్మణునకు రాజ్యాధికారముతో బాటు దాన మొనరించెను.

## సోణదండుని ప్రశంస

సోణదండ బ్రాహ్మణుడు భగవంతుని ప్రశంసించి నాడు. అయిదువందల మందిగల బ్రాహ్మణ సభలో నాతడిట్లు భగవంతుని ప్రశంసించెను.

"మహాశయులారా! వెనుక నేడు తరములుగా తలి దండ్రుల యుభయ వంశములు పవిత్రముగనున్న కుటుంబ మున మహాత్ముడైన గౌతముడు జన్మించెను; బంధుకోటిని, ననంత ధన సువర్ణ రాసులను పరిత్యజించి, పరివ్రాజకుడయ్యెను. రమణీయ మధుర యౌవనముననే మానుషానందముల తిర స్కరించి యాతడు ముండిత శిరస్కుడయ్యెను.

"తలిదండ్రుల కపోలముల కన్నీటి ధారలు దొరగినను లక్షింపక, ముండిత శిరస్కుడై, కాషాయాంబరధారియై, గృహ జీవనమును పరిత్యజించెను. గౌతముడు సుందరుడు, ప్రియదర్శ నుడు, విశ్వాసదీపకుడునై మహోన్నతుడుగా కనపడును.

## భగవంతుని గుణశీల వర్ణనము

"ఆయన స్వనము గంభీర మధురము; వాణి విశద మనోజ్ఞము. చాలమందికి గురువులైన వారి కాతడు గురూత్త ముడు. ధర్మమే బ్రాహ్మణ జాతికి ప్రధానమని యాయన బోధ. అనేక దూర ప్రాంతములనుండి జిజ్ఞాసువులై వచ్చిన వారి నమ్మహాత్ముడు కరుణ నాదరించి సంశయచ్ఛేద మొన రించును.

"శ్రమణులును బ్రాహ్మణులును దిగంబరత్వము మొదలుగాగల యర్థశూన్య బాహ్యాచారముల బాటింతురు. కాని, శ్రమణ గౌతముడు శీలధర్మ సంపన్నతచే ప్రసిద్ధుడు. మగధాధిపతి బింబిసారుడు, కోసలాధిపుడు ప్రసేనజిత్తు, బ్రాహ్మణాచార్యుడైన పౌష్కరసాది, ప్రజలాబాల గోపాల మును, నమ్మహాత్ముని విశ్వసించి భక్తితో గౌరవింతురు."
(సోణదండ సుత్తము)

అనురుద్ధుడను శిష్యుని నంగదేశమున నిలిపి భగవం తుడు మరల జేతవన విహారమును జేరుకొనెను.

## కిసగౌతమి కరుణగాథ

కిస గౌతమి శ్రావస్తి నగరమున నొక పేద కుటుంబ మున జన్మించెను. యుక్త వయస్సున నామె వివాహితయై భర్త గృహమునకు బోయెను. పేద కుటుంబమున జన్మించి నందున నత్తగారింట నామె నందఱు హీనముగ జూచుచుండిరి. కొంత కాలమునకు కిసగౌతమి కొక కుమారుడుదయించెను. పుత్ర సౌభాగ్యమున నామె యందఱకు ప్రీతి పాత్ర యయ్యెను.

## పుత్రశోకము

ఆటలాడు ప్రాయమున నున్న కిసగౌతమి కుమారుడు సర్పదష్టుడై మరణించెను. శోకవివశయైన కిసగౌతమి "నాకు కుమారుడు గలిగిన తరువాతనే యందఱు గౌరవించుచుండిరి. ఆ కుమారుడును మరణించె"నని దుఃఖించుచు, మృతబాలుని చంక నిడుకొని ఆతని బ్రతికించు మందునకై యిల్లిల్లు దిరిగి యందఱి నడిగినది.

## ద శ బ లు డు

మరణించిన వారిని బ్రతికించు నౌషధ మెందైన నున్నదా యని యందఱు నా ముగ్ధ హృదయను పరిహసించిరి. ఒక సాధువా యమాయకురాలను గాంచి, "అయ్యో! శోకభరమున నీమె యున్మత్త యగునేమో! దశబల సంపన్నుడైన బుద్ధుడొక్కడే యీమెకు శాంతి నొసగ సమర్థు"డని తలచి, "అమ్మా! మానవుల కంటెను, దేవతల కంటెను మహోన్నతుడై, దశబల సంపన్నుడైన మహాముని జేతవనమున నున్నాడు. ఆయన దగ్గఱకు వెళ్లుము. మార్గము నీకు లభించు" నని చెప్పెను.

సాధువాణిని విశ్వసించి కిసగౌతమి మృతబాలు నెత్తుకొని సంభ్రమమున జేత వనవిహారమునకు వెళ్ళినది. అర్హతుల మధ్యమున నక్షత్ర మండలమున ప్రకాశించు యమృత కిరణుని వలె బుద్ధాసనముననున్న మహామునినిగాంచి కిసగౌతమి "భగవంతుడా! నా బిడ్డను బ్రదికింపు"మని దీనముగ విలపించెను.

## మరణమెఱుగని కుటుంబమునుండి యావాలు

కరుణామయుడైన జగద్గురువు కిసగౌతమీ నిర్మల హృదయము తెలిసికొని "గౌతమీ! నీ విచ్చటికి వచ్చుట మంచిదైనది. నగరమున మొదటి యింటి నుండి కడ యింటి వరకు వెళ్ళి, మరణ మెరుగని కుటుంబము నుండి కొన్ని యావాలను తీసికొనిరమ్ము. నీ బిడ్డను బ్రదికింతు"నని చెప్పెను.

కిసగౌతమి వెంటనే నగరమునకు వెళ్ళి యింటింట "దశబల సంపన్నుడైన భగవంతుడు నా బిడ్డను బ్రదికించుటకు మరణ మెఱుగని కుటుంబము నుండి కొన్ని సాసువులను తెమ్మ" న్నాడని యడిగినది.

కాని, మరణ మెఱుగని కుటుంబమే యా నగరమున లేదు. ప్రతి గృహమునను నెందఱో మరణించినారని కిసగౌతమి తెలిసికొన్నది. ప్రతి కుటుంబము మరణ దుఃఖము తనవలె ననుభవించినదే!

సర్వజ్ఞుడైన భగవంతుడా పరమ సత్యము నుపదేశించుటకే తన్నట్లు పంపెనని కిసగౌతమి ప్రబోధితమైనది. స్వస్థ చిత్తయై యా ధన్యురాలు కుమారుని శ్మశానమునకు దీసికొని వెళ్ళినది.

## కిసగౌతమి ప్రబోధము

"బిడ్డా! నిన్నొకనినే మృత్యువు హరించెనని యనుకొంటిని కాని, సర్వత్ర మానవులను మృత్యువు కబళించినది. మరణము మానవుల కందఱికిని సామాన్య ధర్మము" అని కుమారుని ప్రశాంత చిత్తమున నామె దహన మొనరించినది. అప్పుడామె హృదయమిట్లు పలికినది:

"మరణము గృహ ధర్మముగాని, గ్రామ ధర్మముగాని, పట్టణ ధర్మముగాని కాదు. దేవ మానవ లోకములలో నన్ని పదార్థములును క్షణిక ధర్మము కలవియే. ఈ నియతికి లోబడని దొకట్టియు లేదు." కిసగౌతమి హృదయమున జ్వాలోప శమనకరమైన అమృత ప్రశాంతి యుదయించినది. ఆనంద ధారిణియగు నామె జగద్గురుని చరణ సన్నిధికేగినది.

## ఉ ప దే శ ము

"గౌతమీ! మరణ మెఱుగని కుటుంబమునుండి యావాలను గొని తెచ్చితివా?"

"భగవంతుడా! ఆవాలతో నాకిక నవసరము లేదు. కరుణతో శరణ మొసగిన చాలును."

కరుణాసింధువగు నా మహర్షి కిసగౌతమి నిట్లు ప్రబోధించెను: "అమృతపదమును బొందక నూరేండ్లు జీవించుట కంటె, దానిని పొంది యొక దినమేని జీవించుట శ్రేష్ఠము.* నిద్రించుచున్న గ్రామము (గ్రామస్థులు) మహాప్రవాహమున గొట్టుకొని పోవు విధమున పుత్ర పశ్వాదుల యందాసక్తుడైన వానిని మృత్యువు తీసికొని పోవుచున్నది."♦

## కిసగౌతమి యర్హత స్థితి

కిసగౌతమి సర్వదుఃఖములను జయించి బుద్ధ భగ

---

* యో చ వస్ససతం జీవే అపస్సం అమతం పదం।
ఏకాహం జీవితం సెయ్యో పస్సతో అమతం పదం॥ (ధ. ౮. 15.)

♦ తం పుత్తపసు సమ్మత్తం వ్యాసత్త మనసం నరం।
సుత్తగామం మహోఘో'వ మచ్చూ ఆదాయ గచ్ఛతి॥ (ధ. 20.15)

వానుని శిష్యురాలై, యర్హాత స్థితిని బొందెను. థేరిగాథలలో నామె రచించిన పరవశ గీతములు గలవు. "ప్రాపంచక విషయ రాగములు నశించిపోయినవి; తమస్సు వీడిపోయినది. మృత్యు పరివారమును నేను జయించితిని. తృష్ణాభయంకర ప్రవాహము లింకిపోగా, నిర్వాణ ప్రశాంతిలో నేనున్నాను." (థేరిగాథ).

## జీవితచర్య

భగవంతుని పరివ్రాజక జీవితమట్లు సంవత్సరము తరువాత సంవత్సరము గడచి పోయినది. ఆ దినములలోని జీవిత చర్యను నిర్దిష్టముగ కాల నిర్ణయ పూర్వకముగ వ్రాయుట సాధ్యముగాదు. భగవంతుని నిత్యచర్య సర్వసాధారణముగ నీ క్రింది విధముగ నుండెడిది.

అహోను మేఘేన జలం విముక్త
మహోను తోయేన విపూరితా భూః
అహోను భూమౌ పరిపోషి తశ్చ
జలైర్ధనాఢ్యైః ప్రణయీవ దీనః ।

## వర్షావాసము

ప్రతి సంవత్సరము వర్షఋతువున దప్ప మిగిలిన ఋతువులలో నాయన నిజశిష్య సమేతుడై దేశమున పల్లెలు, పట్టణములు తిరిగి ధర్మప్రబోధ మొనరించును. ఆషాఢారంభమున నూత్న నిర్మల వర్షబిందువుల కోసము తపమొనరించు చాతక పక్షీ సమూహమునకు పరమోత్సవముగ నాకాశమున నీలతోయద మాలికలు నిండి లోకమునకు జీవనమును

గురియు సమయమున భగవంతుడు తన సంచారచర్యను మాని యేదో యొక విహారమున నివసించును. వర్షాసమయ మున పక్షులు సైతము గూండ్లను నిర్మించుకొని తలదాచు కొనును గదా! అటులనే సన్యాసులందఱు నా వర్షఋతువున సంచారమును మాని యొకచో జేరి విశ్రాంతి నందుదురు. వర్షా సమయమున హంసలు మానసమున కేగును గదా!

భారతీయ సన్యాస సంప్రదాయము ననుసరించి పరి వ్రాజకులా వర్షా సమయమున నొకచో జేరి ప్రజల ధర్మామృత పూరమున దేల్చి, సంసార గ్రీష్మతాపమును దొలగింతురు. దానినే చాతుర్మాస్య విధియని యందురు. ఆ సమయమున భక్తులైన ప్రజలు (గ్రామవాసులు, పట్టణవాసులును) ఆచా ర్యులకును, శిష్యులకును భోజనాది సదుపాయముల నేర్పాటు చేయుదురు.

వర్షా సమయమున మూడు మాసములు భగవంతుని శిష్యులందఱు పరివేష్టించియుందురు. రాజులును, శ్రీమంతులైన ప్రజలును అహమహమికతో భగవంతునికిని, శిష్యకోటికిని నాతిథ్య మొసగుట కుత్సహింతురు.

### ఆరామ విహారములు

వర్షా సమయము గడచిపోయినది. ఈషణత్రయమును త్యజించి ముక్తకిల్బిషులై శాంతులైన మునుల మానసమువలె నాకాశము నిర్మలమైనది. శరత్సమయమున మరల భగవం తుడు ధర్మబోధ జేయుటకై బయలుదేరును. పురమునుండి పురమునకు, గ్రామమునుండి గ్రామమునకు శిష్యకోటితో భగవంతుడు పాదచారియై వెళ్లును. ఈ సంచార చర్య పురా

తన రాజ్యములైన కాశీ, కోసల, మగధ రాజ్యములలోను, పరిసర ప్రాంత జనపదములలోను సాగును. పట్టణముల కతిదూర మును, నతి సమీపమును గాని ప్రదేశముల నారామ విహా రము లుండెడివి. ఇవి ప్రజల సద్ధర్మ శ్రవణమునకును, జ్ఞానుల యేకాంత ధ్యానములకును దగిన ప్రశాంతి నికేతనములు.

బింబిసారు డొసగిన రాజగృహ సమీపమునందలి వేణు వన విహారమును, అనాథ పిండకుని శ్రావస్తి యందలి జేత వనవిహారమును నట్టివే. దూర ప్రాంతముల నుండి ప్రజ లును, తైర్థికులైన సన్యాసులును శ్రమణ గౌతముని యమృతోపదేశమును వినుటకై సంసార దుఃఖములకు దూరములై ప్రశాంతి ధామములైన నా విహారములకు వచ్చు చుండిరి. మహారాజులు సైతము సద్ధర్మశ్రవణమునకై విహార ములకు వచ్చుచుండిరి.

## దినచర్య

బుద్ధ ఘోషుడు భగవంతుని దినచర్యను దీఘ నికాయ భాష్యము సుమంగళ విలాసిని యందు వివరించినాడు. భగవం తుడు వేకువనే మేల్కొని, యితర శిష్యులను నిద్ర లేవకయే స్నానాదులాచరించి, దుస్తులు ధరించు కొనును. అప్పటినుండి భిక్షార్థమై పోవు వేళవరకు నొక యేకాంత ప్రదేశమున ధ్యాన నిమగ్నుడగును. భిక్షార్థమై వెళ్ళునపుడు మూడు కాషాయాంబరములను ధరించి, భిక్షాపాత్రను తీసికొని, యొకప్పు డొంటరిగా, మరియొకప్పుడు శిష్య సమేతుడై ప్రాంత గ్రామమునకో, పట్టణమునకో పోవును.

## సుమంగళ విలాసిని

భగవంతుడట్లు పోవునపుడు కొన్ని యద్భుతములు జరుగును. మలయ సమీరములు వీచును. భూరజము ప్రశాంతమగుటకై యల్పమున వర్ష శీకరములు రాలును. సూర్యాతప వారకములై యాత పత్రములవలె మేఘము లాయనపై యావరించి యుండును. ఆకాశము భగవంతుడు పోవు మార్గమున పుష్పములను రాల్చును. కఠిన ప్రదేశములు మృదువులై, వక్ర పథములు సరళములగును. ముందు మార్గము మృదుల పుష్పాచ్ఛాదితమై భగవంతుని పాదముల నారాధించును. ఆరు రంగులతో గూడిన ప్రభా వలయ మాయనమూర్తి నుండి ప్రకాశించుచుండును. పశు పక్షులు సైత మాయనకు మృదులస్వనముతో స్వాగతము చెప్పును. గాలిలో దివ్యగీతములు వినిపించును. మనుష్యులు ధరించిన యాభరణములు తమంత తామే భగవంతుని సన్నిధిలో కొద్దిగా మ్రోగును.

ఆ సూచనను గాంచి ప్రజలు భగవంతుడు భిక్షార్థమై వచ్చుచున్నాడని తెలిసికొని, యందముగ నలంకరించుకొని, పుష్ప మాలికలతో నెదురేగి, యాయన నారాధింతురు. "ప్రభూ! మా యింట భిక్ష గ్రహింపుడు. పదిమంది భిక్షువుల కాతిథ్య మొసగెదము." "ప్రభూ! మాయింట భిక్ష స్వీకరింపుడు. ఇరువది మంది భిక్షువుల కాతిథ్య మొసగెదము" అని భగవంతుని ప్రార్థించుచు, ఆయన భిక్షా పాత్రను తీసికొని, శిష్యసమేతుడగు నమ్మహాత్ముని మృష్టాన్న పరితృప్తుని జేయుదురు.

భోజనానంతరము వారి వారి గ్రహణ యోగ్యతల ననుసరించి భగవంతుడు పవిత్ర ధర్మోపదేశము చేయును. ఆ ధర్మశ్రవణము వలన కొంద ఉపాసకులై గృహస్థ శిష్యు లగుదురు; మఱికొందఱు గృహ జీవితము పరిత్యజించి పరి వ్రాజకులగుదురు. దానివలన వారనంత మంగళముల నందు చుండిరి. ప్రజలపై కరుణ గంగాలహరులను ప్రవహింపజేసి భగవంతుడు మరల విహారమునకు వచ్చును.

ఆ విధముగ మధ్యాహ్నకాలము వరకు జరిగిపోవును. తరువాత తన మందిర ద్వారము దగ్గర నిలచి భగవంతుడు సంఘ భిక్షువుల నిట్లు ప్రబోధించును: "భిక్షువులారా! శ్రద్ధా వంతులు, ప్రయత్నశీలురు కండు. ప్రపంచమున బుద్ధులైన మహాత్ములతోడి సంగతి దుర్లభము; మనుష్యత్వము దుర్ల భము; సదవకాశము లభించుట దుర్లభము; సంసృతిని పరిత్య జించుట దుర్లభము; సద్ధర్మ శ్రవణము దుర్లభము." *

తరువాత సంఘభిక్షువులు తమకు ధ్యానసాధనల నుప దేశింపుమని భగవంతుని కోరుదురు. ఉపదేశానంతరము భిక్షువులందఱు నేకాంత ప్రదేశములకు వెళ్ళి ధ్యానానంద నిమగ్నులగుదురు. తరువాత భగవంతుడు తన ప్రత్యేక మంది రమున విశ్రమించును. ఆ మందిరము మనోహర పుష్పగంధ భరితమై ప్రశాంతిధామమై యుండును. మధ్యాహ్న సమయ మున నట్లు కొంతసేపు భగవంతుడు విశ్రమించును. లేచిన తరువాత తనకు సన్నిహితులై యున్న ప్రజల స్థితిగతులను,

* **కిచ్ఛో మనస్స పటిలాభో, కిచ్ఛం మచ్చానం జీవితం**
**కిచ్ఛం సద్ధమ్మ సవణం కిచ్ఛో బుద్ధానం ఉప్పాదో॥ (ధ. 14-4)**

వారి క్షేమ సాధనమును గుఱించి యా కరుణానిధి యాలో చించును.

## ధర్మమునకు జీవద్భాష్యము

అపరాహ్ణసమయమున సమీప జనపదములనుండి పట్టణములనుండి ప్రజలు భగవంతునికి పుష్పాంజలులు సమర్పించుటకై వత్తురు. వస్తుతత్త్వజ్ఞుడైన భగవంతుడు యథార్థ్యమగు రీతి వారికి సద్ధర్మప్రబోధ మొనరించును. ధర్మశ్రవణానంతరము భక్తిశ్రద్ధలతో నందఱు మునీంద్రునకు నమస్కరించి వెళ్లుదురు. అపరాహ్ణ సమయమట్లు గడచి పోవును.

సాయం సంధ్యా సమయమున నవసరమని భావించిన భగవంతుడు స్నానము చేయును. అన్ని దుస్తులు ధరించియే యేకాంత ప్రదేశమున కొంతసేపు భగవంతు డుపవిష్టుడగును. భిక్షువు లందఱు వచ్చి యాయనను పరివేష్టింతురు. కొందఱు తమ సంశయముల నాయన కెఱిగించి వాని బరిష్కార మార్గము నడుగుదురు; ధ్యానానుభవములను గుఱించి కొంద ఱాయన కెఱిగింతురు. మరికొందఱు సత్యప్రబోధమును కోరుదురు. అట్లు రాత్రి మొదటి యామము గడచి పోవును. సంతుష్ట మానసులై యందఱు భగవంతుని యనుజ్ఞగొని తమ తమ నివేశములకు వెళ్లుదురు.

పరిశిష్ట రాత్రి యందొక కొంతసేపు భగవంతుడు ధ్యానావస్థితుడగును. ధ్యానోపరామమున తన మందిర ప్రాంగణమున నటు నిటు దిరుగుచు కొంత సమయమును గడుపును.

మిగిలిన కాలమున నిర్వికార చిత్త వృత్తితో నాత్మస్థుడై ప్రశాంతముగ నిద్రించును.

ఉషోదయముననే తన పర్యంకమున లేచి కూర్చుండి ప్రపంచములోని ప్రజలను తన మనో భూమికపై గాంచుచు వారి పూర్వజన్మములలోని యాశయాకాంక్షలను, ప్రస్తుతము వారు వాటిని సఫల మొనరించుకొనుటకు తానే విధముగ సాయపడగలనన్న విషయములను భగవంతుడు విచారించును. అట్టి దినచర్య సాధారణ పరిస్థితులలో భగవంతుడొకచోటనే నిలిచియున్నపుడు జరుగుచుండును.

# బుద్ధదర్శనము

---

## తృతీయాధ్యాయము
## (ధర్మసుమంగళ విలాస తథాగతము)

---

### జీవన్నిర్వాణ వర్ణనము

సమాధిః ఆర్యాణామ్ ధ్వజా, ప్రజ్ఞా ఆర్యాణామ్ ధ్వజా,
విముక్తిః ఆర్యాణామ్ ధ్వజా, విముక్తి విజ్ఞాన దర్శనం
ఆర్యాణామ్ ధ్వజా ।

తత్త్వవేత్తలు ప్రారబ్ధ మనుభవించునపుడు సర్వావస్థలయందును సమచిత్తులై యథాప్రాప్తములగు వాని ననుభవించుచు జగన్మంగళమైన పథమున చరించుచు లోకమును గూడ తమతోబాటు తరింపజేయుదురు. ప్రవాహపతితములైన కార్యములయందు కామ సంకల్ప రహితమై శారదాకాశమువలె నిర్మలమైన చిత్తమున వారు వర్తింతురు. పద్మపత్రము నంటని యుదబిందువువలె శ్రుతదృష్టములైన విషయములయందు మునీంద్రు లనుపలిప్తులు. *

ఉపేక్షా శాంతి సంశుద్ధమైన మానసముతో యవిద్యను భేదించి దుఃఖతమోబంధురమైన జగతికి వారాశాజ్యోతులై

---

*ఉదబిందు యథాపి పోక్ఖరే పద్మే యథాపి న లిప్పతి ఏవం మునీనోపలిప్పతి యత ఇదం దిట్ఠసుతం ముతేసువా. (సుత్తనిపాతం)

ప్రకాశింతురు. అమృత పద మప్రమాదము; ప్రమాదమే మృత్యుపదమని యెఱిగినవారై పండితు లార్యగోచరమైన యప్రమాద పథమున చరింతురు. సతత ధ్యానపరాయణులై ధృతిపూర్ణులై యోగ క్షేమము ననుత్తరమునైన నిర్వాణము నొందుదురు. ప్రమత్తులయందు వారప్రమత్తులు; సుషుప్తుల యందు వారు జాగరితులు. భగవంతు డట్టి జీవన్నిర్వాణ దశ నంది యుపాధి జలమును, నాధి జంతుకమును, క్రోధ మద భయ తరంగ చపలమునై యగాధమునైన దోషసాగరమును స్వయముగ తరించి లోకమును తరింపజేసెను. [సహి దోష సాగర ముపాధి జలమాధి జంతుకం క్రోధ మద భయ తరంగ చపలం, ప్రతతారలోక మపి చాప్యతారయత్. (అశ్వఘోష సౌందరనందము).]

## ఆనందుని పరిచర్య

పక్ష మాస ఋతువులను వలయముతో, దినములను అరములతో, క్షణమును నాభితో, స్పందమయమగు కాలచక్ర పరిభ్రమణమున భగవంతున కప్పుడు ఏబదియారు సంవత్సర ముల వయస్సు గడచుచున్నది. శిష్యులు నియమిత కాలమున నాయనకు పరిచర్య చేయుచుండిరి.

తనకు వయస్సు నిండుచున్నందున, నియమితముగ నన్ని వేళల తన సన్నిధినుండి పరిచరించుట కొకరుండ వలయునని భగవంతుడు శిష్యులతో నన్నాడు. శారిపుత్రుడు, మొగ్గల్లా నుడును తాము భగవంతునికి పరిచర్య చేయుదుమని, తమ సేవ యంగీకరింపవలయునని మునీంద్రుని ప్రార్థించినారు. కాని, వారినెవరిని తనకు నిత్యపరిచారకులుగా నంగీకరింపక భగ వంతు డానందుని పరిచర్య నంగీకరించినాడు.

ఆనాటినుండి మహా పరినిర్వాణము వరకు భగవంతుని సర్వవేళల కాచిపెట్టుకొనియుండి హృదయార్పణముతో నానందముడు సేవించినాడు. పరి నిర్వాణానంతర మాతడర్హాత స్థితిని బొంది ధన్యుడై నాడు.

## దేవదత్తుని శాత్రవము

దేవదత్తు డానందుని కగ్రజుడు. ఇరువురేక గర్భసంజాతులన్న విషయము పూర్వోక్తమే. హాలాహలము నమృతము నొకే క్షీరార్ణవమున జనించినట్లు వారిద్దఱు నొకే మాతృగర్భమున జన్మించిరి. కాని, యానందుని జీవిత మొక యారాధన; దేవదత్తుని జీవితము తద్భిన్నమైన శాత్రవము. పూర్వజన్మములలో సైతము దేవదత్తుడు భగవంతునకు ప్రత్యర్థియన్న విషయము జాతక కథలవలన తెలియుచున్నది. (న్యగ్రోధ మృగజాతకము – బౌద్ధయుగము VOL II పుట 689; ఖంతివాది జాతకము – పాళీ జాతకము నెం. 313).

ఖంతివాది జాతకము నిట సంగ్రహముగ వివరింతుము.

## ఖంతి (క్షాంతి) వాది జాతకము

బుద్ధ భగవానుడు పూర్వభవమున బోధిసత్త్వుడుగనున్నపు డొక యేకాంతారణ్యమున తపస్విగనుండెను. ఆయన గొప్ప క్షమాశాలి. క్షాంతిశీలురైనవారే యవస్థలయందును చిత్తసమతను విడనాడరు. వారన్ని బాధలను నిర్భర క్షమాశీలమున భరింతురు. గృహ జీవనము నిర్వాణ సాధనమునకు నిరోధకమని తలంచి యాతడరణ్యసీమ నేకాంతత నాశ్రయించెను.

## క్షాంతి శీలుడైన ముని

నిరంతరము క్షమా శీలమును గుఱించి ప్రబోధించు చుండుటవలన జగమున నాయన "క్షాంతివాది" యని ప్రసిద్ధి నందెను. ఆయన నిజ నామము నందఱు విస్మరించిరి. స్వభావ సిద్ధమైన క్షాంతి, యితరులు తన్ను హింసించినపుడు సైతము చలింపని యాయన ప్రశాంతియందు దీపించుచుండెను.

మహితాత్ముడైన యమ్ముని చంద్రుడు నందన వన సదృశమై నిర్మానుష్యమైన యరణ్యసీమ నివసించుచుండెను. సర్వఋతువుల యందును పుష్పఫల భరితములైన వృక్షము లందుండెను. పుండరీక నీలోత్పల రమ్యమై నిర్మలోదక పరి పూర్ణమైన సరోవర మాయరణ్యమున నుండెను.

## బుద్ధులు తీర్థంకరులు

బుద్ధు లెచట నివసింతురో, యా ప్రదేశమే శుభకర మైన తీర్థము. బుద్ధులే తీర్థంకరులు. ధర్మము నారాధించు ముముక్షువు లపుడపు డాయనను సందర్శించుచుండిరి. సంద ర్శించినవారి శ్రవణములకు, హృదయములకు నాహ్లాదకరముగ క్షాంతిని గుఱించి బోధిసత్త్వుడు ప్రబోధించుచుండెను.

## మదమత్తుడైన రాజు

గ్రీష్మ సమయమున నాదేశపాలకుడైన రాజు ఆ యర ణ్యమునందలి పద్మసరోవరమున తన శుద్ధాంత రమణీమణు లతో జలకేళి సలుపుటకై నందనారామ సదృశమగు నా యరణ్యమునకు వారితో వెళ్లెను. పుష్పములతో నవ్వుచున్న నికుంజములలో, వికచారవింద మనోజ్ఞమగు సరోవర జలము

లలో కామినీ జనముతో నాతడు విహరించెను. అతివేలముగ నా మదవతులతో విషయ సుఖానుభవ తరంగముల నాతఁ డోలలాడెను. నికుంజములలో, కమల షండ సన్నిధిలో భృంగీ గణమువలె గాన విలాసము బరపు ప్రమదా విలాసమును నేత్ర నిర్వాణముగ నాతడు గాంచెను. లలనా మణులు తమ కలనాద నృత్యగానములచే కోకిల వనమయూర భ్రమర గణమును జయించిరి. మధుపానమత్తుడై విషయ విహారము వలనను, విషమ విహారము వలనను శ్రాంతుడై రాజాశోక పుష్ప నికుంజమున నుజ్జ్వల రాజపర్యంకమున శయనించి నిద్రించెను.

## మదవతీ విలాసము

తమ స్వామి నిద్రించుటజూచి వనశోభను గాంచుటకై కామినీవారము మదన విలాసము మెఱయ పుష్పాపచయము జేయుచు, చివుళ్ళను గిల్లుచు, లతలను త్రుంచుచు, సుకుమార శాఖలను విఱుచుచు మదనోన్మత్తలై విహరించి, తుదకు శాంతివాది మునీంద్రుని యాశ్రమమును సమీపించిరి.

## క్షాంతిబోధ

ఆశ్రమమున స్నిగ్ధ వృక్షచ్ఛాయ పద్మాసనస్థుడై ధ్యాన నిమగ్నుడైయున్న మహర్షి నా కామినులు కాంచిరి. నిర్వాణ ప్రశాంతి ముఖమున ప్రకాశించుచుండ నాతని చిత్త గభీరత వారికి భయము గొల్పినది. మూర్తిగొన్న ధర్మము వలె భాసించు మునీంద్రుని శీల ప్రభావమువలన రాజకాంతల హృదయమున వినయము వాసించినది. వారాయనను పరివేష్టించి యాసీనలైనారు.

క్షాంతివాది వారికి దానశీలాది శుభగుణములను గుఱించి ప్రబోధించినాడు. "క్షమా శీలము వీరుల కలంకారము; సాధువుల శక్తి; దోషాగ్నుల శమింపచేయు వర్షము. కావున క్షాంతి శీలము నార్జింపు"డని మునీంద్రుడు బోధించి నాడు.

అంతలో రాజు మేల్కొని, సుందరీమణుల నన్వేషించుచు, కామాంధుడు కావున, భామినీ మదన విలాసములను నర్మోక్తులను విను కుతూహలమున బయలుదేరెను. రాలిన పుష్పములవలనను, విఱిగిన శాఖలవలనను, అటనట పడియున్న తాంబూల రాగ రసము వలనను ప్రమదా విహారమార్గమును నెఱిగి తుదకు క్షాంతివాది యాశ్రమమును ప్రవేశించెను.

## బుద్ధి నాశాత్ ప్రణశ్యతి

సుందరీ పరివృతుడైన మునిచంద్రుని జూచి, రాజు హృదయమున నసూయాద్వేషాగ్నులు రగుల్కొనెను. మదనభావమున తన శుద్ధాంత జన సౌందర్యమును కనులార గాంచుచున్నాడని, యా యసూయాంధుడు మునీంద్రుని మిథ్యాచారుడని భావించెను.

మునిచంద్రుడు సద్ధర్మమును గుఱించి యెంత ప్రబోధించినను క్రోధోన్మత్తుడై యాతడు మర్యాదా భంగమొనరించెను. కామము క్రోధ సమ్మోహాది బుద్ధి నాశక గుణములకు నిదానమని ఆది బుద్ధుల సూక్తి గదా!

"నీ క్షాంతిని పరీక్షింతు"నని యా బుద్ధి హీనుడు బోధిసత్త్వుని దక్షిణ బాహువును ఛేదించెను. రాజట్లు శుభసీమ

నతిక్రమించినను, ముని తన చిత్త సామ్యమును గోల్పోలేదు. రాజు మరల, రెండవహస్తమును సైతము ఛేదించి, యంతతో నిలువక ముని నాసికాశ్రవణములను పాదములను ఖండించెను.

కరుణామయుడైన మహర్షి దుఃఖము నేమాత్రము బొందక నిశ్చల ప్రశాంతి వహించియు, రాజు పాపాచరణమును గాంచి పరితపించెను.

ఆ పాప కర్మమువలన రాజునకు వెంటనే భయంకర దాహకజ్వరము సంభవించెను. ఆశ్రమము దాటిన వెంటనే క్షమారూపిణి యగు భూమిసైతము బిట్టవిసి పటిల్లున బగిలి మహాభీలమగు బిలంబున నా దుర్మార్గుని కబళించినది; అందుండి యగ్నిజ్వాలలు బయలుదేరినవి.

ఋషిచంద్రుని మాహాత్మ్యము నెఱిగిన రాజమంత్రులు ఆయన యాశ్రమమునకు వెళ్ళి యమాయకులైన ప్రజలను నాశనమునుండి రక్షింపవలయునని ప్రార్థించిరి.

## అశుభవాసనలు బలీయములు

ప్రశమన శీలుడైన ముని వారి కభయమొసంగి యగ్నిజ్వాలల నుపశమింపజేసెను. "దుఃఖ, వ్యాధి, మృత్యువులకు లోబడువ్యక్తి, రాగద్వేష దోషావిష్టుడై తన పాపము వలన నశించిన, అట్టివాడు నిజముగ దయనీయుడు. అట్టి దీనులు కోపమునకు పాత్రులుగారు" అని వారికి శాంత్యానందములను గలిగించి, దుఃఖరూపమగు భౌతిక శరీరమును విడిచి మునిచంద్రు డానందధామ మందెను. ధర్మభంగముజేసి దుష్కర్ముడైన యారాజే దేవదత్తుడుగ జన్మించి యశుభవాసనా

ప్రభావము వలన బుద్ధుని ద్వేషించెను. (ఖాంతి వాది జాతకము – పాళీ 313, మరియు ఆర్యసూరుని జాతకమాల–28).

దేవదత్తుడు జీసస్సు శిష్యులలోని "ఇస్కరి యోతు జూడస్" వంటివాడు. భగవంతునిపై యసూయా ద్వేషము లాతని హృదయమున జనించినవి. మొదట సాధన జేసికొని ఋద్ధుల నాతడు సంపాదించినాడు. ఆ శక్తులతో ఆజాతశత్రువునకు తన ఋషిత్వముపై విశ్వాసమును గల్గించినాడు.

దేవదత్తుని ప్రేరణచే నజాతశత్రువు తన తండ్రి బింబిసారుని మరణమునకు కారణుడై పితృహంతయైనాడు. భగవంతుడు వయస్సు నిండినవాడు గావున, ఆయన స్థానమున తన్ను బుద్ధ సంఘమున కాచార్యునిగా నియమింపవలయునని దేవదత్తుడు బుద్ధ భగవాను నర్థించెను. సర్వజ్ఞుడైన శాక్య ముని దేవదత్తుని కాంక్ష ననుమతింపలేదు. దేవదత్తుని మనస్సున నసూయా ద్వేషాగ్ని జ్వాలలు ప్రజ్జ్వలించినవి.

## ఘాతుక ప్రయత్నములు

అజాత శత్రువు సాహాయ్యమున దశబలసంపన్నుడైన మునీంద్రు నంతమొందింప దేవదత్తుడు ప్రయత్నించినాడు. ఆ ఘోరకార్యమునకై కొంతమంది ఘాతుకులను నియోగించినాడు. నియోగానుసరణమున, వారొక గండశైలమును శైలాగ్ర భాగమున నుండి భగవంతునిపైకి త్రోసినారు. అద్భుతావహముగ నా గుండు పుష్పగుచ్ఛమువలె మహాశ్రమణుని పాద పద్మ సన్నిధి నిలిచినది. దానిని గాంచిన ఘాతుకులు హృదయ

పరివర్తనమును బొంది తమ పాపకార్యమునకు పశ్చాత్తప్తులై దుఃఖించి భగవంతుని శరణు జొచ్చినారు.

## సర్వభూత సుహృత్తు

తన ప్రయత్నమట్లు విఫలమగుట గాంచి దేవదత్తుడు 'నాలాగిరి' యను మత్తేభమునకు మద్యమును ద్రావించి భగవంతునిపైకి యుసికొల్పునట్లేర్పాటు గావించెను.

మదవారణము వెఱ్ఱులెత్తినట్లు వీథులలో బరువెత్తి చాలమందిని ద్రొక్కి చంపినది. ప్రజలు భయమంది కొంది శీకులైనారు. శిష్యులు; భగవంతు నా దుష్టమదకలము బారి నుండి తప్పించుకొమ్మని ప్రార్థించి ప్రక్కలకు బారిపోయి నారు. ఆరాధన మూర్తియగు నానందుడు మాత్రము స్థిత చిత్తుడై భగవంతుని పార్శ్వము నుండి యొక యడుగైనను కదపలేదు.

నాలాగిరి సమంత భద్రుడగు తథాగతుని దగ్గరకు చేర గనే దాని మదము పరిచ్యుతమైనది. అది సాధువై భగవంతుని పాదసన్నిధి మేను వ్రాల్చినది. సర్వజ్ఞుని యుదారామృత వాణిని బుద్ధియుక్తుడు మానవుని వలెనె యాలకించినది. బుద్ధులు సర్వభూత సుహృదులు గదా! *

---

*అమరావతి శిల్ప చిత్రమున నీ విషయము రూపింప బడినది. మదోన్మత్త గజము వలన క్షోభ నందిన వారి యాకృతులలోని యశాంతిని, బుద్ధుని కరుణాశక్తిచే మద గజము శమింపగా గలిగిన ప్రశాంతిని, అత్యంత స్వాభావికముగ నీ శిల్ప చిత్రము ప్రదర్శించుచున్నది. ప్రస్తుతము మద్రాసు మ్యూజియములో అమరావతీ స్థూపమునకు సంబంధించిన యీ శిల్ప శిలాఫలక మున్నది.

భగవంతు డానాటికి భిక్షమాని జేత వనవిహారమునకు తిరిగి వచ్చినాడు. అగ్నిజ్వాలలవలె దేశము నలుదిక్కుల వ్యాపించిన యావార్తను విని యజాతశత్రువు పశ్చాత్తప్తుడై నాడు.

## అంతరంగ సంస్కరణము

భగ్న మనోరథుడైన దేవదత్తుడు నూతన మార్గము నన్వేషించినాడు: "సన్యాసులకు సుఖజీవనము మంచిదిగాదు. నూతన కఠిన నియమావళి జేర్చి భిక్షువుల యాహారవిహార ములను శాసింపవలయును. సంఘమును సంస్కరింపవలయు"నని దేవదత్తుడు షడభిజ్ఞుడైన మునీంద్రున కుపదేశింప మొదలిడి నాడు.

"సంస్కరణ మంతరంగమున జరుగవలయును. బాహ్య సంస్కరణము వలన నధ్యాత్మ ప్రయోజనము శూన్యము. రాగద్వేషములను కషాయములను వీడక కాషాయము ధరించువాడు సత్యదమములకు దూరుడు. వాడు కాషాయ ధారణ కనర్హుడు. కషాయములను వమన మొనరించి శీలముల సుసమాహితుడై సత్యదమోపేతుడై యుండువాడు కాషా యాంబర ధారణ కర్హు"డని మహాశాస్తయగు ముని దేవ దత్తుని ప్రబోధించెను. *

*అనిక్కసావో కాసావం యో వత్థం పరిదహిస్సతి। అపేతో దమ సచ్చేన న సకాసావ మరహతి।యోచవన్తకసావస్స సీలేసు సుసమాహితో, ఉపేతో దమ సచ్చేన సవే కాసావ మరహతి. (ధమ్మపదము 1-9, 10).

## భేదవాది

దేవదత్తుడు భిక్షు సంఘమున భేదమును గల్పించి సంఘము నుండి యైదువందల భిక్షువుల చీలదీసి, వారికి గురువై గయాశీర్షమునకు బోయెను. ఆ శిష్యులకు సద్ధర్మమును బోధించి హితోపదేశము జేయుటకై భగవంతుడు శారిపుత్ర మొగల్లానులను దేవదత్తుని విహారమునకు బంపెను.

వారిని గాంచి యా తమోబుద్ధి, తన శిష్య సంఘమున జేరుటకు వచ్చిరని భావించి శారిపుత్రుని శిష్యులను ప్రబోధింప నియమించి తాను నిద్రించెను. శారిపుత్ర, మొగ్గల్లానుల సద్ధర్మ ప్రబోధము నాలకించి భిక్షువులందఱు పశ్చాత్తప్తులై మరల భగవంతుని చరణ సన్నిధి చేరినారు.

## అలంఘనీయతా హేతువు

పర్వతమున కుత్తుంగత్వము మాత్రమే యున్నది. సాగరమునకు గభీరత మాత్రమే కలదు. కాన, వాని నెవరైన నతిక్రమింపగలరు. బుద్ధులు కైలాస శిఖరము వలె నున్నతులు; సముద్రము వలె గభీరులు. కాన, వారు త్రిలోకముల నలంఘనీయులు గదా! దేవదత్తుడు చింతాక్రాంతుడై పరితప్త హృదయమున పల్లకి నెక్కి జేతవనవిహారమునకు వెళ్ళెను. విహార సమీపమున శిష్యులు పల్లకి దింపి సరస్సున స్నానమొనరింప నేగిరి. బుద్ధుని దర్శింపవలయునన్న తహతహతో నడచుటకు శక్తి లేకున్నను దేవదత్తు డాయనను చేరుటకు ప్రయత్నించినాడు.

"క్షాంతియే పరమ తపము, తితీక్షయే పరమ నిర్వాణ" మని బుద్ధుల యుపదేశము. పరోపఘాతశీలురగువా రెట్లు

బుద్ధులను పొందగలరు? తన పాపమనంతమగుట వలన నాతనికి బుద్ధ దర్శనమే గాలేదు. వేయి మంది బుద్ధులైనను దేవదత్తుని వంటి పాపాత్ములను రక్షింపలేరని భగవంతుడే యన్నాడట!

భూమిపై యడుగు మోపిన వెంటనే నరకాగ్నులు దేవదత్తుని యావరించినవి. "భగవంతుడా! నేను నీకపకారినైనను బంధువును. బాంధవ్యమును జూచియైన నన్ను క్షమింపు" మని త్రిరత్నములను శరణుజొచ్చి యా యంతిమ సమయమున దేవదత్తు డాక్రందించెను.

వెంటనే యాతనికి రక్షణను భగవంతు డనుగ్రహించెను. పాపాత్ము డిహపరలోకముల దుఃఖయే. అంత్యసమయమున త్రిరత్నములను పశ్చాత్తాప హృదయమున శరణుజొచ్చిన పుణ్య ఫలమున దేవదత్తుడు మరుజన్మమున సత్తిసారుడను ప్రత్యేక బుద్ధుడుగ జన్మించి, యర్హాతస్థితిని బొంది తరించెను.

## అజాత శత్రువు శరణాగతి

పితృహంతయైన యజాత శత్రువు శాంతిదూరుడై చిత్తక్షోభనందెను. ఒక మనోహర శరత్కాల రాత్రి యావై దేహినందనుడు సౌధాగ్రభాగమున మంత్రి సమేతము నుపవిష్టుడై యుండెను. "శారదయామిని రమ్యమై ప్రేమాస్పదముగ నున్నది. ఈ కౌముదీ ప్రసారము మంగళానంద శకునములను కలిగించుచున్నది. మానసానందమునకై యే శ్రమణుని యుపదేశమునైన వినిన బాగుండు"నని యాయన తలంచెను.

ప్రధాన చికిత్సకుడైన జీవకుడు రాజుతో, "మహా

ప్రభూ! నా యామ్రవనమున భగవంతుడు బుద్ధుడు తన శిష్య కోటితో, పండ్రెండు వందల యేబదిమంది యర్హ్వతులతో విడిసియున్నాడు. మహాత్ముడైన యాయన కీర్తి పరిమళము జగమంత వ్యాపించినది. ఆయన సర్వజ్ఞుడును, సర్వోత్తముడునై, దేవమానవుల కందఱ కారాధ్యుడునై యున్నాడు. ఆయన బోధవలన మీా హృదయమునకు ప్రశాంతి లభించును” అనెను.

జీవకుని మాటలు విని యజాత శత్రువు తన శుద్ధాంత కాంత లైదువందల గజములపై వెంటరా, భద్రగజము నధిరోహించి, దివిటీలు వెలుగగా, నా వెన్నెల రాత్రి రాజగృహమును వీడి జీవకుని యామ్రవనమునకు వెళ్ళెను.

రాజామ్రవనమును సమీాపించి భయముచే రోమాంచితగాత్రుడయ్యెను. “జీవకా! నీవు కైతవ మాడుటలేదు గదా? వంచించుటలేదు గదా? మోసమున నన్ను శత్రువశ మొనరించుట లేదుగదా? పండ్రెండు వందల యేబది యర్హ్వతులున్నయెడల, వారు దగ్గుట గాని, తుమ్ముటగాని లేదా? అంతయు నిశ్చల నీరావముగనున్నదే!” యని యడిగెను.

“రాజా! వంచన యేమాత్రముగాదు. మరికొంత ముందుకువెళ్ళిన మండపమున దీపములు వెలుగుచుండుట చూడగలము.”

తరువాత రాజు గజగమనమునకు సాధ్యమగునంత దూరము వెళ్ళి, గజావరోహణ మొనరించి పాదచారియై మండపద్వారము సమీాపించెను.

“జీవకా! భగవంతుడేడి?”

"మండప మధ్యస్థ స్తంభమున కానుకొని పూర్వాభిముఖుడై శిష్య పరివేష్టితుడై యున్న యా పరమ కల్యాణుడే భగవంతు"డని జీవకుడు చెప్పెను.

## నీరావ నిశ్చల ప్రశాంతి

రాజు ముందునకు వెళ్ళి యొదిగి గౌరవభావ పూర్వకముగ నిలబడెను. అలలులేని కొలనువలె విమలమై నిశ్చలా నీరావమైయున్న భిక్షు సంఘమును గాంచి రాజు "ఈ భిక్షు సంఘమునకున్న ప్రశాంతి నా కుమారుడు ఉదయ భద్రునకు గల్గుగాక!" యని బిగ్గరగా బలికెను.

## ప్రపంచమున వృత్తిజన్యమగు ప్రత్యక్షఫలము

తరువాత రాజు భగవంతునకు నమస్కరించి, భిక్షు సంఘమునకు నమస్కార సూచకముగ నంజలిని ముందుకు సాచి, భగవానునితో నిట్లు పలికెను: "భగవంతుడా! ప్రశ్న నడుగు నవకాశమొసగిన మిమ్ములనొకటి ప్రశ్నించెదను."

బుద్ధుడు :-రాజా! నీ యిచ్ఛాను సారము చేయ వచ్చును.

రాజు :-భగవంతుడా! లోకమున జాల వృత్తులతో జీవించువారున్నారు. మావటులు, ఆశ్వికులు, సూతులు, విలుకాండ్రు, తొమ్మిది యంతస్థులకు జెందిన యుద్ధవీరులు, సేవకులు, సూపకారులు, క్షురకులు, సంవాహకులు, మిఠాయి వర్తకులు, మాలాకారులు, రజకులు, సాలెలు, మేదరులు, కుమ్మరులు, సంఖ్యా శాస్త్రవేత్తలు, గణకులు – వీరందఱు ప్రపంచమున వారి వృత్తిజన్యమైన ప్రత్యక్షఫలము ననుభ

వింతురు. తల్లిదండ్రులను, పిల్లలను, మిత్రులను పోషించుచు సుఖ సంతోషముల బొందుదురు. దివ్యలోక ప్రాప్తిగలిగించి, యానందఫలముల నొసంగు దాన ధర్మములను శ్రమణులకు, బ్రాహ్మణులకు నాచరింతురు. ప్రపంచమును పరిత్యజించి శ్రమణ జీవితమును వరించిన నట్టి సుఖరూపమైన ప్రత్యక్ష ఫలము కలుగునా ?

## శ్రామణ్యఫల నిరూపణము

బుద్ధుడు:-రాజా! నీ ప్రశ్నకు సమాధానము చెప్పెదను గాని, ముందు నిన్నొకటి ప్రశ్నింతును. యథార్థమగు రీతిని బదులు చెప్పుము. రాజు సదనమున నీ కనుసన్నల మెలగి నిన్ను సర్వవేళల సేవించు సేవకుడిట్లు భావించు ననుకొనుము.

'పుణ్యకర్మల వలన గలుగు ఫలమాశ్చర్యకరమైనది. వైదేహీ పుత్రుడైన యజాతశత్రువు, మగధాధిపతి మానవుడే; నేనును మానవుడనే! అయినను రాజు పంచేంద్రియ సుఖానుభవ పూర్ణమైన జీవనమును బొందియున్నాడు. అతడు నిజముగ దివ్యుడే. నేనొక సేవకుడను; అతని కనుసన్నలమెలగి పనిచిన పనుల నాతని ప్రీతికై యొనర్పవలయును. అతనివలె నుండవలెనన్న పుణ్యముల నార్జింపవలయును' అని, సంసారమును పరిత్యజించి, శిరోజములను, గడ్డమును గొరిగించుకొని, కాషాయాంబరధారియై, శ్రమణుడై, మనోవాక్కాయ కర్మములను సంయమించి, యేకాంత జీవనానందియై నిత్య సంతృప్తుడై యుండెననుకొనుము. నీకీ సంగతి నెవరైన నెఱిగించిన

యేమందువు? అతడు తిరిగి వచ్చి నిన్ను సేవింపవలయు నందువా?

రాజు:—భగవంతుడా! మేమట్లనము. అతని యెడల గౌరవముతో నాసనము నుండి లేచి అతనిని కూర్చుండ ప్రార్థింతుము. శ్రమణునికి కావలసిన వస్త్రములు, భిక్షాపాత్ర, నివాసము, ఔషధము మొదలగు వానిని సిద్ధము చేసి వానిని పరిగ్రహింపుమని ప్రార్థింతుము.

బుద్ధుడు:—రాజా! దీని నేమందువు? శ్రమణ జీవితము వలన నీ ప్రపంచమున లభించు సుఖరూపమగు ప్రత్యక్ష ఫలము గాదా?

రాజు:—భగవంతుడా! అది నిజమే.

బుద్ధుడు:—అయినను, రాజా! ఇది శ్రమణ జీవితము వలన ప్రపంచమున ప్రత్యక్షముగ లభించు ప్రథమ ఫలము.

రాజు:—శ్రమణ జీవితము వలన మరి యేదైన ఫలము గలదా?

## దేవ మానవుల కారాధ్యుడగు బుద్ధుడు

బుద్ధుడు:—రాజా! శ్రద్ధతో నాలకింపుము. ఈ ప్రపంచ మున సత్యసాక్షాత్కారమంది, యర్హతుడై, ప్రబుద్ధుడై, జ్ఞాన సుఖానంద పూర్ణత నంది, సర్వలోకజ్ఞుడై, మర్త్యుల కనుత్తమ మార్గదర్శియై, దేవమానవుల కాచార్యుడై భగవంతుడైన బుద్ధుడవతరించెననుకొనుము. అతడపరోక్షముగ దేవ, బ్రహ్మ, మారలోకములగు యూర్ధ్వ లోకములను; బ్రాహ్మణులు, శ్రమణులు, పాలకులు, ప్రజలుగల యీ లోకములను సంపూ

ర్ణముగ నెఱుగును. ఆది మధ్యాంతముల యందును మనో రమమై హృద్యమైన జ్ఞానమును, సత్యము నాయన ప్రబోధించును. పరిపూర్ణ పవిత్రత గల యున్నత జీవనము నాతడు ప్రకాశిత మొనరించును.

## శ్రమణ జీవితము

గృహస్థుడుగాని, యతని కుమారులలో నొకడుగాని, నీచకుల సంభవుడుగాని, యా సత్యప్రబోధము నాలకించును. దాన నాతనికి శ్రద్ధా విశ్వాసము లుదయించును. అతడిట్లు చింతించును: 'గృహజీవనము సర్వవిఘ్నముల కాకరము; కామరజోదూషితమైన పథమిది. ప్రాపంచక విషయ పరిత్యాగి యగువాని జీవితము వాయువు వలే స్వేచ్ఛావిలసితము. పవిత్రతా పరిపూర్ణమగు నున్నత జీవనము గాంచుట సంసారి కసాధ్యము. శ్రమణుడనై గృహజీవితము పరిత్యజింతును గాక!' అని యాతడు తనకున్న కొంచమో, గొప్పయో యగు ధనమును పరిత్యజించి, బంధువులను విడనాడి, శిరోజములను, గడ్డమును గొఱిగించుకొని కాషాయాంబరధారియై, గృహజీవితము పరిత్యజించి పరివ్రాజకుడగును; శ్రమణ ధర్మమైన యాత్మ సంయమనము నందును. ఆతని యానంద మార్జవ వంతము; మనో వాక్కాయ కర్మముల పవిత్రుడై యాతడు కుశల కర్మ పరాయణుడగును. ఆతని జీవిక పావనమైనది; ప్రవర్తన శుభమైనది. ఆతని పంచేంద్రియ ద్వారములు సురక్షితములు. అప్రమాదియై యాత్మవంతుడైన యాతడానందపూర్ణుడు.

రాజా! ఆతని ప్రవర్తన యుత్తమమైనదా? నీవేమందువు? ఆ భిక్షువు హింసా ప్రవృత్తిని విడనాడి, పారుష్యమునకు సిగ్గుపడును; కరుణానిధియై సర్వప్రాణి జాతముపై నుదార కారుణ్యమున జీవించును. ఆతని శుభ జీవితమున నిది యొక యంశము మాత్రమే.

## అప్రమాదము

అతడెట్లు అప్రమాదియో, ఆత్మవంతుడో వినుము. సర్వకర్మములను తన గమనా గమనములను బాహ్యాభ్యంతరముల నాతడు పరిశీలించును. చూచునపుడు, చేతులు కదలించునపుడు, భుజించునపుడు, జలపానము సేయునపుడు, నమలునపుడు, మ్రింగునపుడు, కాల్యములను దీర్చుకొనునపుడు, నిలుచునపుడు, కూర్చుండునపుడు, నిద్రించునపుడు, మేల్కొన్నపుడు, మాటలాడునపుడు, మౌనము వహించునపుడు — సర్వకర్మముల యందును జాగరూకుడై యెఱిగి వర్తించును. కావున నాతడప్రమాది; ఆత్మవంతుడు.

## నిత్య సంతృప్తి

అతడెట్లు సంతృప్తుడో వినుము. శరీర ధారణమునకును రక్షణమునకును కావలసిన యన్న వస్త్రములను మాత్రమే యాతడు గ్రహించును. ఆర్జనయు, సంచయమనునవి లేవు. తన రెక్కలను మాత్రమే వెంట గొనిపోవు విహంగమువలె నాతడు ప్రపంచమున వ్యవహరించును.

అట్లు శీలవేత్తయై యాత్మసంయమనశాలియై, యప్రమాదియై, యాత్మవంతుడై యనుత్తమ సంతృప్తుడై యాతడే పర్వతారణ్య గుహలలోనో, నురెచ్చటనో, యేకాంత జీవనానంది యగును.

## ధ్యానము

భిక్షా భోజనానంతర మా సంయమి పద్మాసనస్థుడై కాయమును ఋజువుగానుంచి జాగృతమై వ్యగ్రమైన బుద్ధితో ధ్యాన నిమగ్నుడగును.

## ఐదు చిత్తవిక్షేపకములైన యంతరాయములు

ప్రాపంచిక విషయతృష్ణను పరిత్యజించి, తృష్ణారహితమైన హృదయముతో మనస్సును కామవాసనలనుండి విముక్తమొనరించుకొనును.

హింసాప్రవృత్తిని పరిత్యజించి క్రోధవాసనా విముక్తమైన హృదయముతో మనస్సును సకల విద్వేష భావముల నుండి విముక్త మొనరించుకొనును.

హృదయ మనో మాంద్యమును పరిత్యజించి భ్రాంతి దూరుడై, అప్రమాదియును, నాత్మవంతుడునై మనస్సును ప్రమాదాలస్య నిద్రాది బలహీనతలనుండి విముక్తమొనరించుకొనును.

మానసోద్వేగ వేదనలను పరిత్యజించి వ్యథావిముక్తుడై శాంతి నిర్భర హృదయముతో సర్వ దుఃఖవిముక్తుడగును.

చిత్త చాంచల్యమును పరిత్యజించి మోహదూరుడై విచికిత్సా దోషమునుండి మనస్సును విముక్త మొనరించు కొనును.

రాజా! ఈ యైదు చిత్త విక్షేపకములైన యంతరాయ ములను ప్రతిషేధింపనినాడు తన్ను ఋణగ్రస్తునిగా, రోగిగా, బంధితునిగా, బానిసగా, ఎడారియందు చరించు వానిగా నా శ్రమణుడు భావించును. యంతరాయ ప్రతిషేధనమున సర్వ విముక్తుడై తన్ను యోగక్షేమవంతునిగా భావించును.

## పరమ సంతృప్తి

అతని యందు పరమప్రీతి వెల్లివిరియును; తన యందలి యా ప్రహర్ష లహరిని తెలిసికొని మరింత యానందవంతు డగును. దానివలన నాయన శరీరము సుఖ సంపన్నమగును; సుఖ భావమున శాంతి పూర్ణుడగును. ప్రశాంతియందాయన హృదయము పరమ సంతృప్తి నహించును.

## దివ్య చక్షువు

నిశ్చల శాంతి ధారిణి యగు హృదయమున జీవుల పతనాభ్యుదయములను గూర్చిన జ్ఞాన సంపాదనమునకై మన స్సును సంప్రవేశించును. అతిలోకమైన నిర్మల దివ్య చక్షువు వలన భవ పరంపరల నందుచున్న జీవకోటి నాతడు తిలకిం చును. ఉత్తములను, అధములను, అదృష్టవంతులను, దుర దృష్టవంతులను, సుఖవంతులను, దుఃఖితులను - వారి వారి శుభా శుభ కర్మాను గుణముగ పయనించువారిని - ఆతడు గాంచును.

త్రికరణముల అకుశలకర్మ పరాయణులై సత్పురుషులకు వ్యతిరేకులై సమ్యగ్దృష్టి శూన్యులైన వారు తమ యశుభకర్మఫలముగ, శరీర పతనాంతరము దుఃఖితులుగా, బాధామయ జీవులగ జన్మింతురు. త్రికరణముల, శుభ కర్మ పరాయణులై సమ్యగ్దృష్టి ధన్యులై సత్పురుష సన్నిహితులైన వారు తమ కుశల కర్మ ఫలముగ స్వర్గమున దేవతలై జనించి యానందింతురు, ఇటుల శుభాశుభ కర్మానుగుణముగ భవపరంపరల పయనించు జీవకోటి యాథార్థ్యము నాతడెఱుగును.

## సమ్యగ్దర్శనము

రాజా! చతుష్పథమున నున్న ప్రాసాదాగ్ర చంద్రశాల యందు నిలిచియున్న మనుష్యుడు క్రిందివారి గమనా గమనములను, కూర్చుండుట, నిలుచుట మొదలైన వారి సర్వకార్యములను చక్కగ చూచు రీతి జ్ఞాని శుభాశుభకర్మానుసారము స్వర్గ నరకములకు పయనించు జీవకోటిని చక్కగ జూడగలడు. రాజా! ఇది పూర్వోక్తమైన దానికన్నను మహనీయమై మధురమై శ్రమణునకు ప్రపంచమున లభించు సద్యఃప్రత్యక్ష ఫలము.

## చేతో విముక్తి

అట్లు నిశ్చల శాంతిధారిణి యైన హృదయమున తన మనస్సును మృత్యు ప్రవాహములను శుష్కింప జేయు జ్ఞానము సంపాదించుటకై నియోగించును. ఇది దుఃఖము; ఇది దుఃఖ సముదయము; ఇది దుఃఖ నిరోధము; ఇది దుఃఖ నిరోధ

గామిని యైన మార్గము అని చతుస్సత్యముల యాథార్థ్యము నా శ్రమణు డెఱుగును.

ఎఱిగి, భయంకర కామతృష్ణల నుండి, భవతృష్ణల నుండి, అవిద్యా తృష్ణల నుండి తన చిత్తమును విముక్త మొనరించుకొనును. ఆతని యందు నిర్వాణజ్ఞానోదయమగును. పునర్భవకారిణి యైన తృష్ణ క్షయించి పోవును. ఉన్నత జీవనము సాధింపబడినది. కర్తవ్యము సంపూర్ణముగ నిర్వర్తితము. అతడు కృతకృత్యుడు.

## అనుత్తమ శ్రామణ్యఫల నిరూపణము

రాజా! ఒక పర్వతసమీపమున నిర్మలోదక పరిపూర్ణ సరస్సు నందలి జలములు ప్రసన్న గంభీరములు గావున, సరస్సునందలి ముత్యపు జిప్పలు, గవ్వలు, ఇసుక, రాళ్లు, చేపలు, వాని గమనాగమనములు మొదలగునవి యన్నియు పైకి స్పష్టముగ సరస్తీరమున నిలబడిన వ్యక్తికి కనబడునట్లు జ్ఞానికి సర్వము గోచరించును. ఇది పూర్వోక్తమైన దానికంటె మహనీయము మధురమునై ప్రపంచమున శ్రమణునికి లభించు సద్యఃప్రత్యక్ష ఫలము. దీనికంటె మహనీయమై మధురమైన శ్రామణ్యఫల మీ ప్రపంచమున లేదు.

## అజాత శత్రువు ప్రబోధము, పశ్చాత్తాపము

భగవంతుని యమృత భాషణమును నాలకించి యజాత శత్రు విట్లనెను. "భగవంతుడా! ఈ జ్ఞానము మహనీయమైనది; సుసంగతమైనది. పతితమైన దానిని పునః స్థాపన

నట్లు, దారి తప్పినవానికి దారిజూపినట్లు, రహస్యమును ప్రకాశి తము జేసినట్లు, చీకటి యందు పదార్థ దర్శకారిణియగు దీప మును వెలిగించినట్లు, మహనీయమగు నీ సత్యము నాకు బోధింపబడినది.

"భగవంతుడా! నీవే నాకిక శరణ్యము. బుద్ధం శరణం గచ్ఛామి; ధర్మం శరణం గచ్ఛామి; సంఘం శరణం గచ్ఛామి. ఈ దినమునుండి యా మరణము త్రిరత్నములను శరణు జొచ్చిన వానిగా, శిష్యునిగా నన్ను భగవంతు డంగీకరించు గాక!

"పాపమునకు లోబడినవాడనై దుర్బలుడను, మూర్ఖు డను, దోషినైన నేను సామ్రాజ్యతృష్ణచే, ధార్మికుడును మహనీయుడునైన మా తండ్రి నంతమొందించితిని. భగ వంతుడా! నా పాపముల నే నంగీకరించుచున్నాను. భావి జీవిత మున పాపమును నశింపజేయుటకు యాత్మదమనశాలినై నేను చరింతును."

## ఆత్మదమన శిక్షణము

"రాజా! నీవు నిజముగ పాపమునకు లోబడితివి. కాని, ధర్మము ననుసరించి నీ పాపము నంగీకరించితివి. ఎవరు తమ పాపములను తెలిసికొని యంగీకరింతురో, వారు ఆత్మ దమనశక్తిని పొందుదురు. ఇది యర్హతుల వినయ శిక్షణము నందలి యాచారము" అని భగవంతు డట్లుపశమనము నను గ్రహించిన తరువాత యజాతశత్రువు ఆయన యనుజ్ఞను

బొంది ప్రదక్షిణ పూర్వకముగ నమస్కరించి పురమునకు వెళ్ళెను.

## జీవకుడు

జీవకుడు సాలావతి యను వేశ్య కుమారుడు. తక్షశిల యందు వైద్య విద్య నభ్యసించి ప్రసిద్ధుడయ్యెను. జీవకునికి గూడ భగవంతుడు దుఃఖ రహితమైన మార్గము నుపదేశించెను.

గతాధ్వనో విశోకస్య విప్రముక్తస్య సర్వథా
సర్వగ్రంథి ప్రహీణస్య పరిదాహో నవిద్యతే॥ *

గమ్యస్థానము బొందినవానికి, దుఃఖ రహితుడై సర్వ బంధ విముక్తుడైన వానికి సంతాప మెక్కడిది?

జీవకుడు తన ఆమ్ర వనమును భగవంతుని శిష్య సంఘమునకు విహారముగా సమర్పించెను. ఆ విధముగ జన సామాన్యము మొదలుకొని జ్ఞానులును, మహారాజులును చిత్త శాంతికై మహాశ్రమణుడైన భగవంతు నాశ్రయించి యుప శమనము నందినారు.

బుద్ధ చరితమున 21 వ సర్గమున (SBE XIX పుట 241) అశ్వఘోష మహాకవి బుద్ధ భగవాను నాశ్ర యించి తరించిన వారిని పేర్కొన్నాడు. వారిలో కొందఱిని గుఱించి యిట తెలిసికొందము.

* గతద్ధినో విసోకస్స విప్పముత్తస్స సబ్బధా
సబ్బ గన్థప్పహీనస్స పరిదాహో నవిజ్జతి. (ధమ్మపదము 7-1)

## ఆశ్రయించిన ధన్యులు

జ్యోతిష్కుడు:-రాజగృహ నివాసియగు ధనికశ్రేష్ఠి.

అభయ రాజకుమారుడు:-ఉజ్జయినీ నగర వాసినియైన వేశ్యకు బింబిసార నృపాలుని వలన జనించినవాడని మజ్ఝిమ నికాయమువలన తెలియుచున్నది. ఆమ్రపాళికి బింబిసారుని వలన జనించినవాడని కొన్ని గ్రంథములయందు కలదు.

శ్రోణకోటి వింశుడు:-చంపానగరవాసి యగు శ్రేష్ఠి.

న్యగ్రోధుడు:-ఒక పరివ్రాజకుడు.

ఉపాలి గృహపతి:-నిర్గ్రంథ నాటపుత్తుని (మహావీరుని) శిష్యుడు. నాలందా నగరవాసి. తనకు శిష్యుడైనను, ఉపాలి గృహపతిని ముందువలెనే నిర్గ్రంథుల నాదరింపవలసినదని బుద్ధుడు ఉపదేశించెను. ఆ మహనీయ సహన శీలమును జూచి ఉపాలి గృహపతికి బుద్ధునియందు భక్తి మరింత అధిక మయ్యెను.

పుష్కరసారి:-తక్షశిలాప్రభువు. గాంధార మగధ దేశముల మధ్య బేహార మొనరించు వణిజులవలన బింబిసార నృపాలునితో మైత్రిని సంపాదించెను. తాను పంపిన అనర్ఘములైన ఉపాయనములకు బదులుగా మగధాధీశుడు బుద్ధోపదేశములు లిఖింపబడిన సుందర సువర్ణ ఫలకమును బంపెను. పుష్కరసారి ఆ యుపదేశములను చదువుకొని వెంటనే సన్న్యసించి భగవంతుని సందర్శించు నుత్కంఠతో రాజ గృహమునకు బయలు దేరినాడు.

గాంధారాధిపతి పుణ్యకర్మ పరిపాకమును దివ్యచక్షువు

వలన నెఱిగి భగవంతుడు శ్రావస్తినుండి రాజగృహమునకు వచ్చి తన్నెఱిగింపకుండ, భార్గవారామమున నా రాజర్షిని కలిసికొనెను. ఆయనకు ధర్మమును గుఱించి ప్రబోధించెను. (ధాతు విభంగసుత్తము). తన్ను ప్రబోధించు మహాత్ముడు బుద్ధ భగవానుడే యని పుష్కరసారి తెలిసికొన్నాడు. పుష్కరు డాకీతి కృతకృత్యుడయినాడు. (మజ్ఝిను నికాయము).

కూటదంతుడు:–బింబిసారుని పురోహితుడు; పండితుడు. 'ఖానుమత' అను గ్రామమును బింబిసారుడతనికి దాన మొనరించెను. పశు హింసాత్మకమైన యజ్ఞము నతడు తలపెట్టగా భగవంతుడు అది అనర్థమని బోధించి ధర్మపదమును తెలిపెను. (దీఘ నికాయము).

పంచశిఖుడు :–ఈతడొక గాన విద్యా వినోదియగు గంధర్వుడు. ఈతని సతీమణి 'సురియ వచ్చస'. భగవంతుని గుణములను, ఉపదేశములను వేణుగానమున నాలపించువాడు. బుద్ధ సందేశములను దేవలోకములయందు ప్రచార మొనరించు చుండెను. దేవరాజైన శక్రుని కీతడు హితుడు. హీనయాన మహా యానముల రెంటను నీతడు ప్రసిద్ధుడయ్యెను. (దీఘ నికాయము, సమాధి రాజ సూత్రము).

సీహుడు:–లిచ్ఛవి క్షత్రియుడు. నిర్గ్రంథ నాటపుత్తుని శిష్యుడు. తన శిష్యుడైనను సీహసేనానిని భగవంతుడు నిర్గ్రంథులను మునుపటివలెనే గౌరవింపవలసినదని ఉపదేశించెను.

నందమాత:–బుద్ధుని గృహస్థ శిష్యురాలు. ఉత్తర నందమాతయని, వేలుకంటకి నందమాతయని, ఇద్దరు నంద మాతలు పాళీ గ్రంథముల చెప్పబడినారు. వీరిదువురును

ఒకరే యని పండితుల యభిప్రాయము. సారిపుత్తాది మహా సీయులకు ఆతిథ్యము నొసగి, ఆ పుణ్య కర్మ ప్రభావమున 'సకృదాగామిా' స్థితి నందగల్గెను. అనగా – ఒకే ఒక జన్మము మాత్రమే ఆమెకు మిగిలినదని అర్థము. ఆ జన్మాంతరమున నామె నిర్వాణమందునని భావము. (అంగుత్తర నికాయము.)

కైనేయ ఋషి; శైలఋషి:–జటిల సంప్రదాయమునకు చెందిన సన్న్యాసులు. భగవంతుని జీవిత చరమ సంధ్యయందు వీరు ఆయనను దర్శించిరి. చతుస్సత్యముల నెఱిగి కైనేయ ఋషి 'అనాగామిా' స్థితినందెను. అనగా–ఆయనకిక పునర్జన్మ ముండదని భావము. ఎనిమిది రకములైన ఫలరసాయనములను కైనేయుడు బుద్ధభగవానునికి సమర్పించెను. వాటిని రుచిచూచి భగవంతుడు, భిక్షువులు కొన్ని సమయముల యందు మాత్రము అట్టి ఫల రసాయనములను సేవించుటకు సమ్మతించెను.

భగవంతుని శిష్యసమేతముగ, తన యాశ్రమమునకు ఆహ్వానించి కైనేయుడాతిథ్య మొసగెను. ఆతడే స్వయముగా భగవంతునికిని, భిక్షువులకును భోజనమును వడ్డించెను. భిక్షువులలో శైల ఋషిని గాంచి ఆశ్చర్యమంది, తన కంటే ముందే ఆతడు ఐదువందల నిజ శిష్యులతో బాటు బుద్ధ సంఘమున జేరెనని తెలిసికొనెను. తరువాత కైనేయుడును తనకు ధర్మ దీక్ష ననుగ్రహింపవలయునని భగవంతుని ప్రార్థించెను. బుద్ధాను శాసనమున మహాకప్పిన, సారిపుత్త, మొగ్గల్లానులు కైనేయునికి ధర్మ శిక్షణము నొసగిరి. సుత్తనిపాతమున కొద్ది భేదముతో వీరి కథ చెప్పబడినది.

అంగుళిమాలుడు:-ఈతడు కోసలాధిపతి ప్రసేనజిత్తుని పురోహితుడైన భగ్గుని కుమారుడు. తల్లి మంతాని. ఇతనికి తల్లిదండ్రులు లిడిన పేరును ప్రజలు విస్మరించిరి. తక్షశిల యందు విద్య నభ్యసించుచు, సహాధ్యాయుల కన్న ధీవైభమున నితడు మిన్నయయ్యెను. అందులకు వారు అసూయాగ్రస్తులై ఈత నిపై ఆచార్యునకు లేనిపోనివి చెప్పి ఆయన మనస్సున భేద మును గలిగించిరి. శిష్యు నెటులైన వెడల గొట్టదలచి ఆ యాచార్యుడు తనకు గురు దక్షిణగా నూర్గురు వ్యక్తుల అంగు ళులను తేవలయునని యాదేశించెనట. శిష్య ధర్మదీక్షాబద్ధు డైన యీ విద్యార్థి కోసల దేశమున కేతెంచి, చతుష్పథ ములలో డాగియుండి, తొంబది తొమ్మిది మందిని చంపి, వారి అంగుళులను ఖండించి హారమున గూర్చి ధరించెను.

ఈ క్రూర కర్మవలన నాతని యందు సౌమనస్యము నశించి, భయంకరుడైన బందిపోటుగా మారి ఆతడు అంగుళీ మాళుడని ప్రసిద్ధు డయ్యెను. కోసలాధిపతి ప్రసేనజిత్తు సయి తము ఆతని బంధింపదలచి విఫల మనోరథు డయ్యెను. హృద యాకాశమున ప్రకాశించు సుకృతితారకలు క్రౌర్యసంస్కార మేఘాచ్ఛాదనమున మఱుగు పడినవి. లోకుల కాతడు ఘాతు కుడైన బందిపోటైనను భగవంతుడాతని హృదయ తత్త్వము నెఱుగును.

ప్రమాదవశమున నూరవ అంగుళి కొఱకై తన కన్న తల్లి నే నాతడు హతమొనరింప బోవుచుండెనని భగవంతుడు హృదయమున గాంచి, ఆ పాప పంకము నుండి నాతని ఉద్ధరింప దలచి పతిత పావనుడైన ఆ కృపాళువు, అంగుళీమాలుని

నివాస భూమి కేగెను. కరుణా ప్రవాహమున అంగుళీమాలుని పాప పంకమంతయు క్షాళితమైనది; పాప సంస్కార వాయువులు స్తంభించి, అంగుళీమాలుని హృదయమున బుద్ధి దీపము కొడిసాగి నిశ్చలమై ప్రకాశించినది. ఆతడు పునర్జన్మమంది సాధువైనాడు; అర్హాత స్థితినిబొంది కృతకృత్యుడై నాడు.

బ్రహ్మయువు:-మిథిలానగరవాసి యగు బ్రాహ్మణ బోధకుడు. భగవంతుడు విదేహ రాజధానికి పోయినపుడు ఈతనికి నూట యిరువది సంవత్సరముల వయస్సట! శిష్యుడైన ఉత్తర మాణవుని వలన భగవంతుని యందు ముప్పది రెండు మహాపురుష లక్షణములు కలవని తెలిసికొని మహాదేవ ఆశ్రమవనమున మునీంద్రుని దర్శించెను. ధర్మబోధము నాలకించి బ్రహ్మయువు భగవంతుని పాదములకు ప్రణతుడై నమస్కరించి కృతకృత్యు డయ్యెను; 'అనాగామి' స్థితిని పొంది అచిరకాలముననే దేహబంధ విముక్తిని గాంచెను. (మజ్ఝిమ నికాయము)

మహాలి:-ఇతడు పూరణకశ్యపుని శిష్యుడు; కూటాగార శాల యందు భగవంతుని సందర్శించి అష్టాంగ మార్గము నెఱిగి తరించెను. (దీఘ నికాయము; సంయుక్త నికాయము).

సచ్చకుడు:-ఇతడు నిర్గ్రంథ నాటపుత్తుని శిష్యుడు. బుద్ధ ప్రబోధితుడై సంఘమున జేరెను. ఈతని ఇద్దరు కుమారికలును సారిపుత్రోపదేశమున భిక్షుణీ సంఘమున జేరి ధన్యులైరి.

వక్కలి:-శ్రావస్తి బ్రాహ్మణుడు. విరక్తుడై ఈతడు గృధ్రకూట శిఖరమునుండి క్రిందికి దూకి ఆత్మహత్యగావించుకొన నేగెను. భగవంతు డా సమయమున నడ్డుపడి, యాతని

ప్రబోధించి, ధ్యానసాధనల నుపదేశించెను. అయినను తుద కతడు కత్తితోనే తన జీవితమునకు సమాప్తి చేసికొనెను. మరణ సమయమున బాధానుభవమునందే ఆతడర్హత స్థితిని పొందెనట. కాని, వెంటనే యాతడు మరణించెను.

భావరి:-కోసల రాజ పురోహితుడు. సన్న్యసియై దక్షిణాపథమున అస్సక రాజ్యమున (ఆంధ్రరాజ్యము?) గోదావరీ తీరమున నివసించుచుండెను. పూర్వమొకప్పుడు యజ్ఞ సమయమున నొక బ్రాహ్మణున కీవలసిన ఐదువందల సువర్ణ ములను ఈయజాలక పోయెను. అందులకాతడు భావరిని శపించెను.

శాపవిముక్తి మార్గము నెఱిగివచ్చుటకై భావరి శిష్యులను పదునారుగురిని బుద్ధుని సన్నిధి కంపెను. వారు రాజ గృహమున (పాషాణ చైత్యక విహారమున) భగవంతుని సందర్శించి, ఆయన బోధవలన బోధి ప్రదీపనమునుగాంచి అర్హతులై గురు కార్యమును విస్మరించి నిలిచిపోయిరి.

వారిలో భావరి మేనల్లుడైన పింగియుడు 'అనాగామి' స్థితిని మాత్రము పొంది తిరిగివచ్చి భావరికి బుద్ధోపదేశమును వినిపించెను. ఆ ఉపదేశ శ్రవణమున భావరి వెంటనే 'అనాగామి'స్థితి నందెను. బోధను మరల వినిపించినందున పింగియుడు అర్హతుడై కృతకృత్యుడయ్యెను. (సుత్తనిపాతము).

జానుస్సోణి:-సంపన్న బ్రాహ్మణుడు. కోసల రాజ పురోహితుడు. జేతవనమున పలుమారు భగవంతుని సందర్శించి ధర్మము నెఱిగి యాతని గృహస్థ శిష్యుడయ్యెను.

వీరి విషయ మింతటితో నాపి ప్రకృత మనుసరింతము.

అజాత శత్రువు భగవంతుని సందర్శించిన విషయము

బార్హూత స్థూప శిల్పములలో (క్రీస్తు పూర్వము మూడవ శతాబ్దమున) చిత్రింపబడినది. ఆ శిల్పము క్రింద అజాత శత్రువు భగవంతునకు నమస్కరించుచున్నాడని వ్రాయబడినది.

"మాగధో అజాత సత్తు వైదేహీ పుత్తో భగవతో పాదౌ శిరసా వందంతి." మాగధుడు వైదేహీ పుత్రుడు అజాత శత్రువు భగవంతుని పాదములకు శిరస్సుతో నమస్కరించుచున్నాడని భావము.

## శాక్యులపై విడూడభుని ప్రతీకారము

అజాత శత్రువు రాజ్య సంవత్సరముల నేడవ వత్సరమున విడూడభుడు శాక్యుల రాజధాని కపిలవాస్తుపై దండెత్తెను. తన తండ్రి ప్రసేనజిత్తును (కోసలరాజు) సింహాసనము నుండి తొలగించి విడూడభుడు కోసలాధిపతి యయ్యెను. విడూడభుని దండయాత్రకు కారణము శాక్యుల యతివేలమైన యాభిజాత్య గర్వము.

భగవంతునిపై గల భక్తి గౌరవముల వలన ప్రసేనజిత్తు శాక్యకన్యను వివాహమాడి, ఆయనతో బాంధవ్యమును బొంద నుత్సహించెను. ఆభిజాత్య గర్వితులైన శాక్యులు శాక్యపాలకుడైన మహానామునకును నొక దాసికిని జన్మించిన వాసభ ఖత్తియ యను కన్యను ప్రసేనజిత్తుకు భార్యగా నొసగిరి. విడూడభుడామె కుమారుడు. ఆ వంచనను తెలిసికొన్న తరువాత కోసల ప్రభువు భార్యా పుత్రులను నిరాదరణ బుద్ధి విసర్జించెను. భగవంతుడు "తల్లిది యే వంశమైనను పుత్రుడు తండ్రి వంశమునకే జెందును. కావున భార్యాపుత్రులను ప్రీతిపూర్వ

కముగ నాదరింపు'' మని హిత ముపదేశించెను. భగవంతుని యాదేశానుసారము ప్రసేనజిత్తు మరల భార్యాపుత్రుల నాదరించెను. ఇది జరిగిన కథ.

విడూడభుడు సింహాసనము నాక్రమించి శాక్యులపై ప్రతీకారమునకు దండెత్తి లింగవయో భేదము లేకుండ వారిని సర్వనాశన మొనరించెను. ఆ భయంకర మారణ హోమము మహాపరినిర్వాణమున కొకటిరెండు సంవత్సరములు ముందుగ జరిగినది. తన బంధువులెల్లరు నశింపగా మహానాముడు (శుద్ధోదనుని తరువాతి శాక్యరాజ్య పాలకుడు) నీటిలోబడి యాత్మహత్య జేసికొనెను.

## తితీక్షా వివరణము

కట్టెదుట యదువంశము నిర్విశేషముగ నశింపగ వక్షమున కరపద్మముల నిడుకొని నిర్వికారముగ వీక్షించిన సనాతన బుద్ధుడగు శ్రీకృష్ణ పురుషోత్తముని వలెనె* భగవంతుడనుద్విగ్న మనస్కుడై స్థితప్రజ్ఞతను నిర్లిప్తతా పారమ్యమును మానవలోకమునకు ప్రబోధించెను. బుద్ధులు శీతోష్ణాది ద్వంద్వ విషయముల కతీతులు గదా! తితీక్షుకు వారి జీవితము మనోరమ భాష్యము. సుశీలమును, సకలేంద్రియ సంయమనమును, శాంతిని, సమాహిత బుద్ధిని, జ్ఞాన విజ్ఞానములను, అవిద్యాతమోంధమైన దుఃఖమయ లోకమున వారు ప్రజ్యోతులవలె

* ఏవం నష్టేషు సర్వేషు కులేషు స్వేషు కేశవః। అవతారితో భువో భార ఇతి మేనేఽవశేషితః (భాగవతము 11.30.25)

వెలిగింతురు. ఈ ప్రబోధ చంద్రోదయమున తాపములన్నియు నుపశమించును.

విడూడభుడును నాతని మంత్రియును కొంతకాలమున కగ్ని ప్రమాదమున మరణించిరి. ఆ విధముగ కోసల శాక్య రాజ్యములు రెండును మగధ రాజ్యమున జేరిపోయినవి. భగవంతునకప్పుడు డెబ్బదితొమ్మిది వత్సరములు వయస్సు గడచుచున్నది. ఆ సమయమున అజాతశత్రువు వైశాలి వజ్జియనులను జయింప నిశ్చయించుకొనెను. జయాప జయములను గురించి తెలిసికొనుటకై వస్సకారుడను మంత్రిని భగవంతు నడుగుటకై పంపెను.

“తరచుగా సమావేశమగుచు నైకమత్యమును సాధించి ప్రజలను కఠిన శాసన రహితముగ పాలించుచు, పూర్వ సంప్రదాయముల ననుసరించుచు, వంశ వృద్ధులను, దేవాలయములను, అర్హాతులను, స్త్రీలను గౌరవించు చుండిన అజాత శత్రువు వంటి చక్రవర్తి సయితము మిమ్ము జయింప జాల”డని యంతకు ముందే భగవంతుడు వజ్జియనుల కుపదేశించి యుండెను. వారిని ఋజుమార్గమున జయించుట యసాధ్యమని అజాత శత్రువు తెలిసికొని భేద తంత్రము ననుసరించి వారిని జయింప నిశ్చయించెను.

♦ తితిక్షా శీతోష్ణాది ద్వంద్వ సహిష్ణుతా (వేదాంత సారము)
సహనం సర్వదుఃఖానా మప్రతికార పూర్వకమ్
చింతా విలాప రహితమ్ సాతితిక్షాని గద్యతే (వివేక చూడామణి 24)

# జాతికి విజయమార్గము

"ఆనందా! ఎంతకాలము మజ్జియను లైకమత్య సంపన్నులై తరచుగ సమావేశమగుచు నేకభావమున తమ కార్యక్రమముల కొనసాగింతురో, సంప్రదాయ విరుద్ధము గాకుండ చరింతురో, వంశ వృద్ధులను గౌరవించి వారి మాట నాచరింతురో, స్త్రీలను – కన్యకలను గౌరవింతురో, దేవాల యముల పూజా విధానముల జరిపింతురో, అర్హాతులను బూజింతురో, అంతకాలమును వారు శ్రేయఃపథమున నభ్యు దయముల గాంతురు.

"అటులనే సంఘభిక్షువులు సైతమెంతకాల మేకాంత జీవనానందులై లౌకిక విషయ వ్యాపారదూరులై చరింతురో, అల్ప విషయ సుఖ రాగమున నిర్వాణదాయిని యైన ధర్మ పథమున నాగిపోవరో, ధ్యానపరాయణులై చిత్త సమతనంది యుందురో, శారీరక మానసికాదులైన దృశ్యపదార్థము లన్నియు ననాత్మకము లనియు – నశ్వరములనియు దెలిసి కొందురో, అర్హాతులతో మెలగుచు శీలవ్రతులై చరింతురో, భవతృష్ణను బాహ్యకర్మల యందలి విశ్వాసమును పరిత్యజిం తురో, దుఃఖనాశనకరమైన మార్గమున నర్హాతులతో చరిం తురో, అంత కాలము వారును శ్రేయోభ్యుదయముల నందు

దురు." రాజగృహ సమీపమునందలి గృధ్రకూటముపైనను, నాలందా గ్రామము నందును నిటులనే భిక్షువు నా మునీంద్రుడు ప్రబోధించెను.

యస్యాను పాదేయ మిదం సమస్తం। పదార్థ జాతం సదసద్దశాసు
న దుఃఖ దాహేయ సుఖాయ నైవ। విముక్త ఏవేహ సజీవ ఏవ॥ *

* ఏ మహాత్మునకు జగత్తునందలి సకల పదార్థ జాతమును, సదసద్దశలయందు సుఖ దుఃఖములను గలిగింపజాలక యనుపాదేయమగునో ఆతడు జీవించి యున్నను ముక్తుడు. (జీవన్ముక్తుడు).

# బుద్ధదర్శనము

---

## చతుర్థాధ్యాయము
## (చిత్తజ్వాలోపశమన మహాపరినిర్వాణ సంగతము)

---

### ప్రబోధ వసంతము

నిఃస్నేహా దీపవచ్ఛాంతో యస్యాంతర్వాసనా భరః
తేన చిత్ర కృతేనేవ జితం జ్ఞేనా వికారిణా *

శీల ప్రజ్ఞా సమాధులు మహనీయములు. వీనిని సాధింప వలయును. సౌశీల్య సమన్వితమైన సమాధి యనుత్తమ ఫల దాయకము; సమాధి సమన్వితమైన ప్రజ్ఞ యనుత్తమ ఫల దాయకము; ప్రజ్ఞాసమన్వితమైన చిత్తము కామపారవశ్యము, భవపారవశ్యము, దోష పారవశ్యము, అవిద్యా పారవశ్యమును తొలగి ముక్తమగును. అప్పుడే నిర్వాణము సాక్షాత్కరించును.

* ఎవని చిత్తము నందలి వాసనా భరము నిఃస్నేహాదీపకళిక వలె శమించునో, అవికారియు జ్ఞానియునైన వాతడు నిత్య సిద్ధమగు నిర్వాణమును చిత్రపటమునందలి రాజు చిత్రమునందలి శత్రువును వశింపజేసి విజయము పొందునట్లు పొందును. (యోగ వాశిష్ఠము).

ఈ ప్రబోధవసంతము దేశమంతట వ్యాపించినది. ఆ రమణీయ సమయమున మానవుల హృదయోద్యానములలో శీల ప్రజ్ఞా సమాధి లతలు పల్లవించి, పుష్పించి, జ్ఞానానంద మరందము లొలికించి నిర్వాణ ఫలదాయకములైనవి. కర్తవ్యము పరిసమాప్తమైనది. కాన భగవంతుడు మహాపరి నిర్వాణ మందవలెనని సంకల్పించినాడు.

## కుశి నగరము

పూర్వయుగమున తాను మహా సుదర్శనుడను రాజశేఖరుడుగ జన్మించినపుడు తనకు ప్రియరాజధానియై యుండి నేడు సామాన్య నగరముగనుండి సర్వగతమైన యనిత్యతను మౌనముగనే వ్యాఖ్యానించుచున్న కుశినగరమున తన మర్త్య దేహమును విడువవలయునని తథాగతుడు తలచెను. (కుశినగరము కాశీ నగరమున కీశాన్యదిశ నూట యిరువది మైళ్ళ దూరమున నుండును).

## మహాప్రస్థానము

బింబిసార నృపాలుని ప్రేమ భక్తి స్మృతుల కుద్దీపకమైన రాజగృహమును రాగాది బంధదూరుడగు భగవంతుడు నిర్గమించినాడు.

మార్గ మాధ్యమున అంబలత్తికారామమున భగవంతుడు శిష్య సంఘముతో నిలిచెను. ఆ యారామమున సుప్రియుడన్న సన్న్యాసి బుద్ధుని, సంఘమును, ధర్మమును నిందించెను. కాని, అతని శిష్యుడైన బ్రహ్మదత్తుడు భగవంతుని స్తుతించినాడు. శిష్యులా సంగతి మునీంద్రున కెరిగించినారు.

## ఉద్విగ్న హృదయము సత్యము గ్రహింపజాలదు

"ఇతరులు నన్నుగాని, ధర్మమునుగాని, సంఘమును గాని తూలనాడినపుడు కోపముతో, హృదయతాపముతో, మీరాత్మ నిగ్రహదూరులు కాగూడదు. సత్యమునుగాని, అసత్యమునుగాని కోపతాపాదులచే కలుషితమైన హృదయముతో నెవరును అర్థము జేసికొనలేరు.

"అటులనే స్తుతించినపుడు సైతము సంతోషోల్లాస భరితులై ఆత్మ నిగ్రహదూరులు కాగూడదు. రాగద్వేషాలతో ఉద్విగ్నమైన హృదయము సత్యము గ్రహింప సమర్థము కాదు," అని భగవంతుడు శీలములను విస్తరించి ప్రబోధించినాడు.

పైకి చూచి ఆకాశముపై ఎంగిలి ఉమిసిన అది ఉమిసిన వానిపైననే పడి మలిన మొనరించును. కాని, ఆకాశమును మలిన మొనరింపజాలదు. బుద్ధుని ఈ వాక్కులు రెండు వేల అయిదు వందల సంవత్సరములు గడచినను నేటికిని మహోత్తమ జ్ఞాన పూర్ణములని రాధాకృష్ణ పండితుడు కీర్తించినాడు. (Gowthama The Buddha-P. 14)

బుద్ధుడు అంబలత్తికా 'నాలందా' పావారికాంబ వనములమీదుగా పాటలి గ్రామమును చేరుకొన్నాడు.

పాటలీ గ్రామము మహా ప్రసిద్ధమైన పాటలీపుత్రముగ పరిణమించుననియు, కాని యా నగరమునకు మూడు ప్రమాదము లున్నవనియు తథాగతుడు పాటలీపుత్ర నగర భవిష్యత్తును గూర్చి ఆ సమయమున చెప్పినాడు. అగ్ని వలనను,

జలమువలనను, ఆంతరంగిక కలహములవలనను పాటలీపుత్రము నాశనమగునన్న యీ మహాద్రష్ట యుదర్క ప్రవచనము తరువాతి కాలమున ఫలించినదని చరిత్ర నిరూపించినది.

వజ్జియనులను జయించుటకు అజాతశత్రువు పాటలీ గ్రామమునకు వప్ర నిర్మాణము చేయించుచున్నాడు. సునీథుడు, వర్షకారుడను మగధ మంత్రులాకార్యమున నియుక్తులు.

పాటలీ గ్రామవాసులు భగవంతుని శిష్యకోటితో శ్రద్ధాభక్తులతో నాహ్వానించి విందుచేసినారు. మగధ రాజ మంత్రులు గూడ నా విందులో పాల్గొన్నారు. తరువాత భగవంతుని, ఆయన శిష్యులను, మగధ మంత్రులును ప్రజలును భక్తి గౌరవములతో వీడ్కొలిపిరి.

తథాగతుడు పాటలీ గ్రామమును విడిచి వెళ్ళిన ద్వారము నాటి నుండి గౌతమ ద్వారమని ప్రసిద్ధి నందినది. ఆయన గంగానదియందు దిగిన చోటు గౌతమ తీర్థమని పేరు గాంచినది. కూలంకషముగ ప్రవహించు గంగా స్రవంతిని నిజ దివ్య శక్తితో, నే సాధనము నపేక్షింపక భగవంతుడు శిష్య కోటితో దాటి యావలి తీరమును జేరెను. కోటి గ్రామము నాదికా గ్రామమను జనపదముల మీదుగ వైశాలీ నగర సమీపమునందలి ఆమ్రపాళి యారామమును చేరుకొన్నాడు. ఆ ప్రస్థానమున నిలిచిన చోటులనెల్ల నాయన ప్రజలకు సద్ధర్మోపదేశ మొనరించి వారి సంసార తాపము నుపశమింప జేసెను.

## ఆమ్రపాలి

ఆమ్రపాలి వైశాలీ నగరమున ప్రసిద్ధురాలైన వేశ్య. రూప సౌందర్యములలో నామె భూతలమున నవతరించిన యప్సరస. చంద్రకాంతమగు ముఖముచే ఇంద్ర నీలములగు కేశములచే పద్మరాగములగు కరములచే నామె రత్నమయ మూర్తి. చకిత మృగనేత్రయును, బిల్వ ఫల యుగ్మమును విడంబించు మంజుల స్తన యుగళ ధారిణియును మనోహర హంసీ గమనయునైన యా తారుణ్యమూర్తి మదన సామ్రాజ్య లక్ష్మియై యువజన చేతశ్చోరియై వెలయుచుండెను. అనర్ఘలావణ్యమూర్తియైన యా యంగనా మణి రూపాజీవ వంశమున జన్మించుట నాలోచించిన నాశ్చర్యమగును.

ఆమ్రపాలి హృదయమున పుణ్య సంస్కార ప్రభావ మున్నది. ఈమె జీసస్సు చరిత్ర యందలి మేరీ సుందరిని పోలును. మేరి జరుసలేం నగరమున రూపలావణ్య లహరియైన నాట్య విలాసిని. పశ్చాత్తప్తయై జీసస్సు చరణ సన్నిధిని పవిత్ర నవజీవనమును బొందిన ధన్యురాలు. ఆమ్రపాలీ, వసంత సేనల వంటి వారు వేశ్యల వంశమున జన్మించినను ఉత్తమ సీమంతినీ శీల చరిత్ర గలవారు. వారి హృదయములు ధర్మానురాగ రంజితములు.

## రూపరాగము దుర్జయము

భగవంతుడు దన మామిడి తోటలో విడిసినాడన్న వార్త విని యామ్రపాలి యింద్రియాతీతమైన యానందమున

పరవశ యైనది. పూర్వ యుగమున విదేహ నగరవాసినియైన పింగళా సుందరి హృదయమున జనించిన యాత్మ సుఖావహ మైన నిర్వేదమామె హృదయమున జనించినది. * భగవం తుని దర్శించుటకై తత్క్షణమే రథాసీనయై సపరివారముగ ఆమ్రపాళి వనమునకు వెళ్ళినది. రూప సౌందర్యములలో దేవ కాంతలను దలదన్ను ఆమ్రపాళీ మూర్తిని గాంచి మోహము పాలుగాకుండ నాత్మసంయమముతో నుండవలయునని భగవం తుడు శిష్యులను హెచ్చరించినాడు. రూపరాగము మారుని పరివారమున దుర్జయమైన శత్రువు గదా!

## ఆహ్వానము

ఆమ్రపాళి భక్తి తన్మయియై భవమున భగవంతు నికి నమస్కరించి యా జగద్గురుని ముందల నాసీన యైనది. తథాగతుడామె కమృతోపమానమైన సద్ధర్మమును బోధిం చెను. సౌందర్యమును, సంపదయును నశ్వరములు. మానవులకు సద్ధర్మమే యనుత్తమాభరణము. ఆమ్రపాళి హృదయ మందిర మున త్రిరత్న దీపములు వెలిగినవి. ఆ దీప కాంతిలో నామె యవిద్యాంధకారము నశించినది. శిష్యసమేతముగా తన యింటికి వచ్చి యాతిథ్యమును స్వీకరింపవలయునని యా శ్రద్ధా మూర్తి భగవంతుని ప్రార్థించినది. పతిత పావనుడైన జగద్గు రుడు భగవంతుడు తథాస్తని యనుగ్రహించినాడు.

వైశాలీ క్షత్రియులు (లిచ్ఛవులు) భగవంతుడామ్ర పాళీ యాహ్వానము నంగీకరించినాడని తెలిసికొని యా

---

* నిర్వేద పరమో జజ్ఞే చింతాహేతు స్సుఖావహః
(భాగవతము 11-8-27-43).

భాగ్యము తమకు కలుగ చేయవలయునని యామ్రపాలిని ప్రార్థించిరి. "ఆమ్రపాలీ! భగవంతున కాతిథ్య మొసగు భాగ్యము మాకు కలుగనీ! నీవు దీనిని వదలుకొనిన లక్ష సువర్ణములను నీ కొసగెదము"

"వైశాలీనగరమును, లిచ్ఛవీ రాజ్యము నంతయు నొసగినను నేనీ యవకాశమును జారవిడువను" అన్నది ఆమ్రపాలి.

## ఆతిథ్యము

లిచ్ఛవులు తరువాత భగవంతుని ప్రార్థించిరి కాని, ముందే యామ్రపాలి యాతిథ్యమును స్వీకరించుట కంగీకరించితినని భగవంతుడన్నాడు. శిష్యసమేతుడై తన యింటిని పావన మొనరించుట కేతెంచిన తథాగతునికి, ఆయన శిష్యకోటికి సంతృప్తిగ నత్యంత భక్తి ప్రీతులతో నామ్రపాలి విందు జేసినది. తరువాత భగవంతుని వాగామృతధార దేలి యామ్రపాలి తన యామ్రవనమును ధారా పూర్వకముగ నాయనకు సమర్పించినది. భగవంతు డామె దానశీలమును ప్రశంసించినాడు.

## అర్హత స్థితి

వైశాలీ లిచ్ఛవులకు భగవంతుడు, శీల పథమున చరించి యధికార తృష్ణను ధన గర్వమును పరిహరింపవలయుననియు అసన్మత బోధకుల యుపదేశము వినగూడదనియు బోధించెను. ఆమ్రపాలి భగవంతుని శిష్యురాలై యచిరకాలమున అర్హాత స్థితిని పొంది ధన్యమైనది.

## ఆమ్రపాలీ థేరీ గాథలు

ఆమె రచించిన వివేకవిచార సంపన్నములైన గాథలు కొన్ని థేరీగాథలయందున్నవి. వానిలో నైదు గాథల కీక్రిందిది భావాను వాదము.

నిబిడమై నిడుదలై నింపారి మిసిమి
గండు తుమ్మెద కాంతి గ్రాలెడి కురులు
సంవత్సరంబులు జరిగి పోవంగ
నల్కలముల బోలి వర్ణంబు బాసె.
స్వర్ణకారుని శిల్ప సౌభాగ్యమొప్పు
కర్ణరేఖలు కాలగతి కళబాసి
వళుల వికారమై వ్రాలిపోయినవి.
పరిపూర్ణ సౌందర్య బంధురం బగుచు
శ్రీఫల యుగళంబు చెలువున వెలయు
స్తనయుగ మేడులు తరలి పోవంగ
పసబాసి వ్రేలాడె రసభంగముగను.
మంజుల తారుణ్య మహిత దేహంబు
జిగి బిగి నెడబాసి చెలువేది శిథిల
గేహంబువలె దుఃఖ గేహమై క్రుంగె
తలప నశ్వరతయే తాండవించెడిని
సర్వగతంబయి జగతి నంతటను. —(థేరీ గాథలు)

తన శరీమునందలి యనిత్యతను గమనించి, సకల దృశ్య పదార్థముల దుఃఖ స్వభావము, ననాత్మకత్వమును, క్షణభంగురత నెఱింగి యామ్రపాళి సమ్యగ్దృష్టి ధన్యయై ప్రశాంతి రూపమైన అర్హత స్థితిని పొందెను.

## కడపటి వర్షావాసము

కొంతకాలము ఆమ్రపాలీ యామ్రవనమున గడిపి భగవంతుడు తన శిష్య సంఘముతో వర్షాసమయమున నివసించుటకై 'బేలువ' గ్రామమునకు వెళ్ళెను. అచ్చట మొట్టమొదటి సారిగ భగవంతుడు జబ్బుపడినాడు. క్రమముగా ననారోగ్యమతిశయించినది. శిష్యులకు తెలుపకుండ పరినిర్వాణమందుట ధర్మముగాదని సంకల్ప బలమున మరల నాయన యారోగ్యవంతుడయ్యెను.

## ఉద్ధరేదాత్మనాత్మానం

ఒకనాడు విహార బహిః ప్రాంగణమున నానందుడు పఱచిన యాసనమున భగవంతు డుపవిష్టుడై యుండెను. భగవంతుని యనారోగ్యమును గాంచి తన మనస్సు చెదరిపోయినదనియు, భవిష్యత్తు అంధకారమైనదనియు, కాని శిష్యసంఘమునకు చరమోపదేశము చేయకుండ తథాగతుడు పరినిర్వాణము బొందడన్న భావమే తనకు ధైర్యమును గలిగించినదనియు నానందుడన్నాడు.

శాక్యఋషి వార్ధక్యము వలన తన శరీరము శైథిల్యము బొందుచున్నదని చెప్పి, సంఘ భిక్షువులు తమ్ము తామే యుద్ధరించుకోవలయునని యుపదేశించెను.

## సత్యమున రహస్యము లేదు

"ఆనందా! నా నుండి భిక్షు సంఘ మింకేమి కోరును? బాహ్యాభ్యంతరములు లేకుండ సత్యము నందఱికి బోధించితిని. తథాగతునికి ధర్మ విషయమున రహస్య మేమియును లేదు.

ఎవరికిని చెప్పకుండ కొన్ని సత్యములను గుప్తమొనరించి గుప్పిట నుంచుకొనుట నా పద్ధతి కాదు.

"ఆనందా! ఎవరైన భిక్షు సంఘమునకు తాము మార్గదర్శులమనియు, లేక – సంఘము తమపై నాధారపడి యున్నదని భావించిన, నట్టివారు సంఘమునకు సంబంధించిన నియమావళి నీయవలెను. కాని, తథాగతుడు తాను భిక్షు సంఘమును నడిపించువాడనియు, లేక – భిక్షు సంఘము తనపై నాధారపడియున్నదనియు భావించుట లేదు. కావున తథాగతు డెందులకు భిక్షు సంఘమున కుపదేశముల నొసగ వలయును?

"ఆనందా! నేను వృద్ధుడనైతిని. నా వయస్సు పండినది. నా యాత్ర పరిసమాప్తము గాబోవుచున్నది. నా కెనుబది సంవత్సరములు నిండుచున్నవి. అధిక శ్రమతో శిథిల రథమును నడిపించునట్లు తథాగతుని దేహమత్యధిక జాగరూకత నవహించి ననే నడువగలదు. బాహ్యవ్యాపారముల విసర్జించి ఎవరితోడను నే విషయముతోడను సంబంధింపని ధ్యాన సమాధి మగ్నమైనపుడు తథాగతుని దేహము విశ్రాంతి నందును.

## ఆత్మాశ్రయము

"కావున ఆనందా, మీకు మీరే జ్యోతులు కండు! మీకు మీరే శరణ్యము కావలయును. ధర్మ దీపమును ధరించి ధర్మమే శరణ్యముగ, బాహ్యమైన దేనిని మీరాశ్రయింప కూడదు. ఆత్మను,ధర్మమును తప్ప మరియే బాహ్యాశ్రయమును

భిక్షువు కోరరాదు. (అత్తదీపో అత్తసరణో అనఞ్ఞ సరణో, ధమ్మదీపో ధమ్మసరణో అనఞ్ఞసరణో) *

"భిక్షు వెట్లు ఆత్మదీపుడో, ఆత్మశరణుడో, ధర్మదీపుడో, ధర్మశరణుడో, అనన్య శరణుడో చెప్పెదను వినుము. భిక్షువు సమ్యగ్వ్యాయామవంతుడై సమ్యక్స్మృతి సమ్యక్సమాధుల వలన కాయ వేదనా చిత్త ధర్మముల నాల్గింటి నప్రమాదమున పరిశీలించి దుఃఖ విముక్తిని బొందవలయును. అనగా, నాలుగు స్మృత్యుపస్థానములను సాధన జేయవలయును. (కాయస్మృత్యుపస్థాన, వేదనాస్మృత్యుపస్థాన, చిత్తస్మృత్యుపస్థాన ధర్మస్మృత్యుపస్థానములనునవి).

## ఉత్తమ జ్ఞాని

"ఆనందా! ఇప్పుడుగాని, నా మరణానంతరమునగాని ఆత్మదీపుడై, యాత్మశరణుడై, ధర్మదీపుడై, ధర్మశరణుడై, యనన్య శరణుడుగా నున్న భిక్షువు, భిక్షువులందఱిలో నున్నతోన్నత శిఖరము నందిన వాడగును. ఆత్మశరణుడనై నేను బోవుచున్నాను. శ్రద్ధావంతులై జాగరూకులు కండి! ఆత్మను ధర్మమును మాత్రమే యాశ్రయించినవాడు భవసాగరమును తరించి యాత్యంతిక దుఃఖ నివృత్తిని బొందును.

---

* ఇచ్చట ఆత్మను ధర్మముతో నభిన్నముగ బుద్ధుడు వర్ణించుట మిక్కిలి గమనార్హము. ఆయన అనాత్మవాదియన్న యపవాద మెంత భ్రమాత్మకమో దీనివలన తెలియవచ్చును. ఆయన అనాత్మవాదియనగా ఆత్మగాని దృశ్య పదార్థములను (పంచ ఉపాదాన స్కంధములను) వివరించి తెల్పినాడని భావము.

## నాల్గు బుద్ధి పాదములు

తరువాత భగవంతుడు వైశాలికి తిరిగి వచ్చెను. వైశాలీ పరిసర ప్రాంతమున నున్న రమణీయ చైత్యములు - ఉదయన, గోతమక, సత్తంబక, బహుపుత్త, సరందద, చాపాల చైత్యములు తనకు ప్రియమైనవని యానందునితో నన్నాడు.

"ఆనందా! నాలుగు బుద్ధి పాదములను సాధింప వలయును. చండ సమాధి ప్రహాణ సంస్కారము (నాలుగు ధ్యానములను సాధన జేయుటకు ప్రగాఢమైన యిచ్ఛ), వీర్య సమాధి ప్రహాణ సంస్కారము (నాల్గు ధ్యానములలో పరి పూర్ణత బడయుటకు వీర్య శక్తుల నుపయోగించుట), చిత్త సమాధి ప్రహాణ సంస్కారము (నాల్గు ధ్యానములను సాధన జేయుటకు చిత్తమును పూర్తిగ లగ్నముచేయుట), మీమాంసా సమాధి ప్రహాణ సంస్కారము (నాల్గు ధ్యానముల ననుస రించు చిత్తవృత్తులను పరిశీలించి వివేచించుట) అను ఈ నాల్గు బుద్ధి పాదములను సాధించినవాడు మృత్యుంజయుడై చిరం జీవి యగును."

భగవంతుడు చేసిన యీసూచన నానందుడు గ్రహింప లేదు. గ్రహించి బుద్ధుని చిరకాలము జీవింపుమని ప్రార్థించి యుండిన బాగుండెడిది. బుద్ధభగవానుడు తన పరి నిర్వాణ మును గురించి చెప్పినాడు. ఆనాటినుండి మూడు మాసములు గడచిన తరువాత జగచ్చక్షువు వస్తమించునని తెలిసికొని యానందుడు దుఃఖించెను.

## వస్తుతత్త్వజ్ఞత

"మనకు చాల సన్నిహితములై ప్రియములైన పదార్థములన్నియు నశించునవియే. జన్మించినది మరణించి తీరును. నాశనము భవముయొక్క స్వభావము.వస్తుతత్త్వజ్ఞులయినవారు దేనికిని వగవరు" అని భగవంతు డానందు నాశ్వాసించెను పరి నిర్వాణము నందవలయునని తన్ను కోరిన మారునకు బుద్ధుడా సమయముననే తన సమ్మతిని తెలియజేసెను.

## బోధిపక్షీయ ధర్మములు

తరువాత భగవంతుడు మహావనము నందలి కూటాగారశాలకు వెళ్లి భిక్షువుల నందఱిని పిలిపించెను. తన యుపదేశమును సంపూర్ణముగ ప్రదర్శించు ముప్పదియేడు బోధి పక్షీయ ధర్మములను మునీంద్రుడు వారికి బోధించెను. అవి యేడు వర్గములుగ విభజింపబడినవి.

(1) నాల్గు స్మృత్యుపస్థాపనలు (2) నాల్గు సమ్యక్ప్రహాణములు (3) నాల్గు బుద్ధి పాదములు (4) ఐదు ఇంద్రియములు – శ్రద్ధేంద్రియ, వీర్యేంద్రియ, స్మృతీంద్రియ, సమాధీంద్రియ, ప్రజ్ఞేంద్రియములనునవి. (5) ఐదు బలములు – శ్రద్ధాబల, వీర్యబల, స్మృతిబల, సమాధిబల, ప్రజ్ఞాబలములనునవి. ఇంద్రియములకును బలములకునుగల సంబంధము కార్యము దాని ఫలమువంటిది. ఇంద్రియములు బాహ్యసాధనములు. వాని వలన లభించు యంతరంగబలములే పైన పేర్కొన్న పంచబలములు. (6) ఏడు సంబోధ్యంగములు – స్మృతి సంబోధ్యంగము, ధర్మ విచయ సంబోధ్యంగము,

వీర్యసంబోధ్యంగము, ప్రీతి సంబోధ్యంగము, ప్రసాద సంబోధ్యంగము, సమాధి సంబోధ్యంగము, ఉపేక్షా సంబోధ్యంగము అనునవి. ఇవి సాధన సోపానముల వంటివి. మొదటి దానిని సాధించిన కల్గు ఫలమే రెండవది. (7) ఎనిమిది మార్గములు– పూర్వోక్తమైన అష్టాంగమార్గము.

నిర్వాణమునకు సాధనములైన యీ ముప్పది యేడు బోధి పక్షీయ ధర్మము బోధించి భగవంతుడు భిక్షువుల కిట్లనెను: "నేను దర్శించిన సత్యములను మీకుపదేశించితిని. మీరు వానిని సమగ్రముగా సాధించి సర్వదేశ వ్యాప్తము చేయవలయును. దేవతలకును మానవులకును నానందముగ పవిత్రమైన సద్ధర్మము శాశ్వతముగ నుండును. సంఘాత వస్తుజాలమంతయు నశించునదియే. నిర్వాణము కొఱకు ప్రయత్నింపుడు. ఈ దినమునుండి మూడు మాసముల తరువాత తథాగతుడు పరినిర్వాణ మందును."

## కడపటి విందు

వైశాలీ నగరముపై కడసారి చూపును పఱపి, బయలుదేరి భండగ్రామ, హస్తిగ్రామ, జంబు గ్రామముల మీదుగ భోగ నగరమును తథాగతుడు చేరెను. ఇచ్చట శీల సమాధి ప్రజ్ఞలను నిర్వాణమును గుఱించి మరల శిష్యులను ప్రబోధించి, బుద్ధ వచనముల ప్రామాణికత్వమును పరిశుద్ధిగా నుంచుటకు కావలసిన విధానముల నా మహాశాస్త యుపదేశించెను.

భోగనగరము నుండి పావాగ్రామమునకు వెళ్ళి చుందుని మామిట తోటలో భిక్షు సంఘముతో భగవంతుడు విడిసెను. చుందుడాయూరి కమ్మరివాడు. ఆతడు భగవంతుని శిష్య సమూహముతోబాటు, విందున కాహ్వానించెను. బుద్ధునకై మధురాన్న భక్ష్యములతోబాటు, 'సూకర మద్దవ' యను పదార్థమును గూడ నాతడు తయారుచేయించెను.

[పాశ్చాత్య పండితులు ప్రమాదులై 'సూకర మద్దవ' అను శబ్దమును 'Boar's flesh' (అడవి పంది మాంసము) అని అనువదించి విపరీతార్థమును గల్పించిరి.

చైనా యాత్రికుడు హ్యూయనుత్సాంగు, చుందుని నివాస స్థలమును సూచించుచు యశోక చక్రవర్తి నిర్మించిన స్థూపమును గుఱించి కూడ వ్రాసినాడు. కుశి నగర మార్గము ఘాతుక మృగ భూయిష్ఠమై దస్యు సంకులమై యుండెనని యతడు తెలుపును. చైనా గ్రంథముల ననుసరించి 'సూకర మద్దవ' యనగా నొకరకమైన పుట్ట గొడుగులు (Kind of mushrooms often referred to as a monks meat) అని యర్థము.]

సూకర మద్దవను భిక్షువులకు వడ్డింప వద్దని, వారు దానిని జీర్ణించుకొనలేరని తాను మాత్రమే యా యాహారమును కొద్దిగా తథాగతుడు స్వీకరించెను. దానివలన బుద్ధుడతిసార రోగగ్రస్తుడయ్యెను. చాల బాధగనున్నను నాత్మస్థితుడై బుద్ధుడు ప్రశాంతితో నుండెను. బాధ కొంత యుపశమించిన తరువాత "ఆనందా! కుశినగరమునకు బోదము రమ్మ"ని భగవంతుడు బయలు దేరెను.

మార్గమునకు దాపున నున్న యొక వృక్షమూల మును జేరి "విశ్రాంతి దీసికొనవలయును. ఆనందా! వస్త్రమును పఱువు"మని భగవంతుడన్నాడు; తరువాత తనకు దాహ మగుచున్నదని, జలమును గైకొని రమ్మని యానందుని బంపెను. సమీపమున ప్రవహించుచున్న నదికి ఆనందుడు వెళ్ళినాడు. అప్పుడే ఐదువందల బండ్లు దాటి పోయినను, నిర్మల జలముతో ప్రవహించుచున్న నదిని జూచి బుద్ధ భగవానుని మహిమకు ఆనందు డాశ్చర్యపడినాడు; జలమును గైకొని వచ్చి బుద్ధున కిచ్చినాడు.

## పుక్కస మల్ల పుత్తుడు

ఆ సమయముననే పుక్కస మల్ల పుత్తుడను ఆలార కాలాముని శిష్యుడు భగవంతుని చిత్త సమతనుగాంచి యాయ నకు శిష్యుడై త్రిరత్నములను శరణుజొచ్చి యుపాసకుడయి నాడు. రెండు సముజ్జ్వల పీతాంబరములను భగవంతునకు సమర్పించి యాతడు యథేచ్ఛ నేగెను. తథాగతుడా వస్త్ర ములను ధరించినంతనే వాని ప్రకాశము హీనమయ్యెను. సంబోధినందు నాడును, పరినిర్వాణమందు నాడును భగవంతుని దేహకాంతి సముజ్జ్వలముగ నుండును.

ఆ రాత్రియే పరి నిర్వాణ రాత్రి; మల్లుల సాలవన మున నారాత్రి భగవంతుడు పరి నిర్వాణమందును.

## చుందునకు సాంత్వన సందేశము

తరువాత భగవంతుడు కకుత్థా నది (కాకుత్థానది)కి వెళ్ళి స్నాతుడై జలపాన మొనరించెను. నదీ తీరమున నుప

విష్టుడై "ఆనందా! చుందుని యాతిథ్యమే తథాగతుని మరణ కారణమైనదని యెవ్వరు నాతని దూషింపగూడదు. నేను మరణించిన తరువాత చుందుడు దుఃఖింపకుండు గాక! చుందునికి రాబోవు జన్మమున నుత్తమ ఫలము లభించును. ఆతడిచ్చిన యాహారము స్వీకరించిన తరువాతనే నేను జన్మరాహిత్యము పొందుచున్నాను. ఈ మాటలు నావిగా నాతనితో చెప్పుము.

"అన్నిటి కంటెను రెండు గొప్ప విందులు నాకు జీవితమున లభించినవి. సుజాత యాతిథ్యమువలన నాకు సంబోధి (జ్ఞానోదయము) గలిగినది. చుందుని యాతిథ్యము వలన నాకు పరి నిర్వాణము (జన్మ రాహిత్యమగు మోక్షము) గలుగు చున్నది. ఈ రెండు విందులును నాకు సమానముగ ప్రీతి పాత్రములె. ఈ విషయము స్వయముగ వెళ్ళి చుందునితో చెప్పి యాతని నోదార్పు"మని యానందుని భగవంతుడాదేశించెను.

## సాలవనమున విశ్రాంతి

తరువాత హిరణ్యావతీ నది యావలి తీరమున నున్న మల్లుల సాలవలనమునకు భగవంతు డానందునితో వెళ్ళెను. "ఆనందా! నేను శ్రాంతుడనైతిని. ఆ యమళవృక్షముల (జంట చెట్లు) మధ్య యుత్తరమునకు తలజేసి వస్త్రమును పఱువుము. నేను శయనింతును" అని భగవంతు డానందుడు పఱచిన వస్త్రముపై ప్రసన్న స్థిర చిత్తమున శయనించెను.

## ధర్మారాధనమే తథాగతారాధనము

ఆ సమయము పుష్ప మాసము కాకపోయినను, ఆ యమళ వృక్షములు పుష్పించి తథాగతునిపై పూలు గురిసినవి.

"ఆనందా! ఇది వసంత సమయము కాకపోయినను, ఈ వృక్షములు పుష్పించి ఆది బుద్ధులపైని గౌరవమున తథాగతునిపై పూల జల్లులు కురిపించుచున్నవి. ఆది బుద్ధులపైని గౌరవమున నాకాశమున మనోహర సంగీతము వినిపించుచున్నది. కాని, ఆనందా! ఇది తథాగతునికి సరియైన గౌరవముగాదు. స్త్రీలుగాని, పురుషులుగాని, భిక్షువులుగాని, గృహస్థులుగాని, సత్యజీవనులై ధర్మపథమున చరించిన వారే తథాగతుని నిజముగ నారాధించిన వారగుదురు. ధర్మపథమున చరించుటయే తథాగతుని యారాధనము. కావున ప్రజలను ధర్మపథమున చరించునట్లు ప్రబోధింపవలయును."

జగచ్ఛ్రుతుడైన తథాగతు డారాత్రి పరి నిర్వాణ మందునని దేవకోటి దుఃఖించుట భగవంతు డానందునికి తెలిపెను. భిక్షువులందరు గుమిగూడినారు; భగవంతు డీలోకమును విడిచిపోవునని మౌనముగ విలపించుటకు ప్రారంభించినారు.

## నాల్గు పుణ్యక్షేత్రములు

జన్మభూమియైన కపిలవాస్తును, బోధి భూమియైన గయను, ధర్మచక్ర ప్రవర్తన భూమియైన కాశిని, పరి నిర్వాణ భూమియైన కుశినగరమును పుణ్యక్షేత్రములుగా భావింపవలయుననియు, నా విశ్వాసముతో యాత్రలో మరణించిన

వారు తుషిత స్వర్గధామము నందుదురనియు భగవంతు డుపదేశించెను.

ముఖ్య నగరములైన చంపా రాజగృహ శ్రావస్తీ సాకేత కౌశాంబీ వారణాసీ నగరముల నెచటనైన పరినిర్వాణ మందిన బాగుండునని యానందుడనగా, కుశినగరము యొక్క పూర్వ వైభవము నానందున కెఱిగించి, యచ్చట పరినిర్వాణ మందుటే తనకు ప్రియమని భగవంతుడు చెప్పెను.

## ఆనందుని దుఃఖము

ఆనందుడు పొంగివచ్చు దుఃఖము నాపుకొనలేక ప్రక్కకు (విహారమునకు) బోయి ద్వారము నానుకొని యేడ్చుటకు ప్రారంభించెను. "నేనింకను నర్హాత స్థితిని బొందలేదు. కరుణా సింధువైన భగవంతుడు పరి నిర్వాణమందుచున్నాడు. ఇక నాకెవరు శరణ్యము?"

## వస్తు స్వభావము

ఆ సంగతి నెఱిగి యానందుని పిలిపించి యా కరుణా నిధి వాత్సల్య పూర్వకముగ నిట్లనెను: "ఆనందా! దుఃఖింపకుము. మన కత్యంత సన్నిహితమును ప్రియమునునైన వాని నుండి మన మెప్పుడైనను వేరుపడి తీరవలసినదే. వస్తు స్వభావ మదియే. ఈ విషయ మెన్నిసారులో ముందే నీకు చెప్పలేదా? సంభవమందిన పదార్థములలోనే వాని నాశన మణిగియుండును. అట్టివి స్థిరముగా నెట్లుండును? చిరకాలము సన్నిధినుండి నిశ్చలమై నిరవధికమైన భక్తి ప్రేమలతో నన్ను సేవించితివి. శ్రద్ధావంతుడవు గమ్ము! నీవు గూడ కామాస్రవముల నుండి,

భవాస్రవముల నుండి, యవిద్యా మోహాస్రవములనుండి విము క్తుడవగుదువు!" అని యాశీర్వదించి యానందుని యారాధనను భిక్షుసంఘము నెదుట భగవంతుడు ప్రశంసించెను.

## కుశీ నగరవాసుల దుఃఖము

తరువాత భగవంతుని యానతి మేరకు కుశీనగరవాసులకు భగవంతుని మహా పరినిర్వాణవార్త నానందుడు తెలిపి వచ్చెను. కుశి నగరవాసులైన మల్లు లాబాల గోపాలమా వార్త విని, చాల దుఃఖించి తథాగతుని కడసారి దర్శనము జేసి కొనవలయునని సాలవనమున కేతెంచిరి. రాత్రి మొదటి యామమున నానందుడు కుశీ నగరవాసులైన మల్లులను కుటుంబ క్రమమున భగవంతున కెఱిగించెను. రాత్రి జరుగు కొలది బుద్ధుని శరీర పరిస్థితి మరింత ప్రమాదవంతము గాజొచ్చినది.

## సుభద్ర పరివ్రాజకుని విచికిత్స

కుశీ నగరవాసియైన సుభద్రుడను పరివ్రాజక తాత్త్వికు డాసమయమున బుద్ధుని దర్శింప సాలవనమున కేతెంచెను. తనకు ధర్మమును గుఱించిన సంశయములు గల వనియు, సంశయచ్ఛేదనము జేసి సత్యమును స్థిరీకరించుటకు శ్రమణ గౌతముడు సమర్థుడనియు, తానా మహాత్ముని దర్శింప వలయుననియు సుభద్రు డానందున కెఱిగించెను.

"ఇది సమయముగాదు. భగవంతుడు చాల శ్రాంత స్థితిలో నున్నాడు. ఆయనను బాధింపవల"దని యానందు

డన్నాడు. ఆనంద సుభద్రుల సంభాషణము భగవంతుడు విని, సుభద్రుని యాశయము జ్ఞానమును బొందుటయే యనియు, తన్ను బాధించుట కాదనియు, నాతని తన దగ్గరకు చేర్పుమని యానందు నాదేశించెను. సుభద్రుడు మరణావస్థయందున్న మహాశ్రమణుని సన్నిధి చేరెను.

## నిరర్థక వాదములు

సుభద్ర పరివ్రాజకుడు పూరణకశ్యప, మక్ఖలీగోసాల, నిర్గ్రంథ నాటపుత్త, అజిత కేశ కంబళి, సంజయాదుల పూర్ణ సిద్ధిని గుఱించి భగవంతుని ప్రశ్నించెను.

"సుభద్రుడా! ఇట్టి వాదములు నిరర్థకములు. ఆర్యాష్టాంగమార్గ రహితమైన సిద్ధాంతమున మహాత్ములుండరు. సౌశీల్యపథమును విస్మరించిన యే మతమును నిర్వాణదాయిని గాజాలదు. చతుస్సత్య యుక్తమైన యష్టాంగ మార్గమున ప్రజలు పయనింతురు గాక! ప్రపంచమున సర్వాతులైన మహాత్ముల కొఱత లేకుండు గాక!" అని భగవంతుడు, పవిత్రతతో ప్రారంభమై ప్రేమలో లీనమగు చతుస్సత్యయుక్తమైన సద్ధర్మమును సుభద్రునకు బోధించెను.

"ఆకాశమున కే చిహ్నమును లేదు. బాహ్యచిహ్నములచే మానవుడు శ్రమణుడు గాజాలడు. ప్రజలు ప్రపంచాభిరతులు. తథాగతులైన బుద్ధులు ప్రాపంచక విషయదూరులు.

సర్వసంస్కారములును ననిత్యములు. బుద్ధులైన మహాత్ములు సంస్కారబంధ రహితులుగాన శాశ్వతులు.'' *

## సుభద్రుని కృతకృత్యత

సుభద్ర పరివ్రాజకుడు విచికిత్సా దోషమును ఛేదించి త్రిరత్నములను శరణుజొచ్చి భిక్షుసంఘమున జేరెను. అచిర కాలముననే యాతడు నిర్వాణ ధన్యతను బొందెను. దేని కొఱకై మనీషావంతులు గృహ జీవనమునందలి సుఖసంతోష ములను పరిత్యజించి బ్రహ్మచర్యమున చరింతురో, పరివ్రాజకు లగుదురో, యట్టి పరమార్థము నీ ప్రపంచముననే నాతడు ప్రత్యక్షముగ గాంచెను. ఇక పునర్జన్మముండదు. బ్రహ్మ చర్యము సఫలమైనది. కృతకృత్యత లభించినది. ఇంతకంటె నిష్టార్థమేదియు లేదని సుభద్రుడు సాక్షాత్కారమందెను. ఇది (సుభద్రున కుపదేశించుట) తథాగతుని కడపటి చర్య.

నాల్గవ యామమున భగవంతు డానందునితో, తనచే నిర్దిష్టమైన ధర్మమే తన తరువాత నాచార్య స్థానమును వహించునని చెప్పి, భిక్షువుల నందఱిని సంశయము లేమైన నున్నయెడల నడుగవలసినదని కోరెను. కాని, భిక్షువులందఱును మౌనముద్రను వహించిరి. కొంతసేపు మౌనముగ నుండి భగ

---

* ఆకాసేచ పదం నత్థి సమణో నత్థి బాహిరే
పపంచాభిరతా పజా నిప్పపంచా తథాగతా।
ఆకాసేచ పదం నత్థి సమణో నత్థి బాహిరే
సంఖారా సస్సతా నత్థి నత్థి బుద్ధా నమింగితం॥

(ధమ్మ పదము 18-20,21)

ఇంగితము = చలనము.

వంతుడు ప్రయత్నముతో లేచి యీ మాట లుచ్చరిం చెను :

"సంఘాత వస్తు జాలమంతయు నశించునదే. శ్రద్ధావంతులై నిర్వాణ సిద్ధికి ప్రయత్నింపుడు."

## మహాపరినిర్వాణము

తరువాత భగవంతుడు ధ్యాన నిమగ్నుడయ్యెను. నాలుగు ధ్యాన భూమికల నతిక్రమించి తథాగతుడు అజాతము, అసంఘాతమునైన నిర్వాణమునందెను.

తరువాత పునర్భవ కారణమైన యుపాదానములు (సూక్ష్మ పంచస్కంధములు) నశించినవి. వానికి కారణమైన తృష్ణ యంతరించినది. తరువాత వేదన, వేదనకు కారణమైన స్పర్శ, స్పర్శకు కారణమైన షడాయతనములు, వానికి కారణములైన నామరూపములు, వానికి కారణమైన విజ్ఞానము, విజ్ఞానకారణమైన సంస్కారములు క్షయించినవి. సంస్కారనాశమున నవిద్య వినాశమందినది. నవిద్యానాశమున నిర్వాణము లభించినది. ఇది పరమాత్మ పూర్ణస్థితి. మండుటకేమియు లేనందున కామాదులైన అగ్నిజ్వాల లుపశమించినవి.

ఉపనిషత్తులు సైతము పరమాత్మ ఇంధనములు లేని అగ్నివలెనున్నదని వర్ణించినవి. "వహ్నేర్యథా యోనిగతస్య మూర్తిః । నదృశ్యతేనైవ చలింగనాశః" (శ్వేతాశ్వతర 1-12) "యథా దాహ్యం దగ్ధ్వాఽగ్నిః, అవికల్పోపహ్యయ మాత్మా వాఙ్మనసోఽగోచరత్వాచ్చిద్రూపః" (నృసింహోత్తరతాపిన్యుపనిషత్తు-ద్వితీయ ఖండము.)

ఆ స్థితి వాచామగోచరము. సర్వభూతములకు నాత్మభూతుడై సర్వభూత హితుడై పొందదగిన యితర పురుషార్థమేదియు లేని బుద్ధుల యొక్క గతిని దేవతలు గూడ కనుగొనజాలక మోహితులగుదురు. ఆకాశమున శకుంతముల పాదచిహ్నములను తెలిసికొను టెట్లసాధ్యమో జ్ఞానుల గతియు తెలియ నసాధ్యము. *

దుర్దర్శమతి గంభీరమజం సామ్యం విశారదమ్।
బుద్ధ్వాపద మనానాత్వం నమస్కుర్మో యథాబలమ్॥

(గౌడపాదకారిక)

దుర్దర్శమును గంభీరమును నజమును సామ్యమును విశారదమును (నిర్మలమును) నానాత్వ వర్జితమునైన నిర్వాణ పదమును దెలిసికొని యథాశక్తి నమస్కరింతుము.

ఆ సమయమున భూమి కంపించినది. ఆకాశమున భయంకర మేఘగర్జనలు వినబడినవి. బ్రహ్మేంద్రాదులు బుద్ధుని కీర్తించినారు.

తథాగతుడట్లు మహాపరినిర్వాణ మందిన వెంటనే కొందఱు భిక్షువులు నేలపై బడి యనేక విధముల విలపించిరి. రాగాదులను జయించిన ధీరులైన భిక్షువులు సంఘాత వస్తు జాలమంతయు నశించునదే యని తమ్ము తామోదార్చుకొనిరి (అనిచ్చా వత సంఖారా ఉప్పాదవయ ధమ్మినో).

---

* సర్వభూతాత్మ భూతస్య సర్వభూత హితస్యచ
దేవా మార్గే విముహ్యంతి హ్యపదస్య పదైషిణః
శకునీనామివాకాశే జలే వారిచరస్యచ
పదం యథా నదృశ్యేత తథా జ్ఞానవతాం గతిః
(శంకరమాండూక్యకారికా భాష్యము 4-95)

భగవంతుని మహాపరినిర్వాణము ననురుద్ధుడను భిక్షు విట్లు కీర్తించెను:

**నాహు అస్సాస పస్సాసో ఠిత చిత్తస్స తాదినో**
**అనేజో సంతిం ఆరబ్బ యం కాలం అకరీ మునీ**
**అసల్లీ నేన చిత్తేన వేదనం అజ్ఝ వాసయి**
**పజ్జోత స్సేవ నిబ్బానం విమోఖ్ఖో చేతసో అహూతి.**

స్థితచిత్తుడైన యాయన కుచ్ఛ్వాస నిశ్వాసములు లేవు. పరమ విశ్రాంతి కోఱకా ముని కాలగతి నందెను. సత్త్వ సంపన్నమైన చిత్తముతో నాయన మరణవేదనను భరించెను. ఆయన చిత్తము ప్రజ్జ్యోతివలె నిర్వాణమున విముక్తినందినది.

దానివలన భవకారిణియైన చిత్త జ్వాలోపశమనమే నిర్వాణమని తెలియుచున్నది. చిత్త జ్వాల నశింపగా ముని పరమ శాంతిని బొందెనని భావము.

సుత్త నిపాతము – (పారాయణ వగ్గము) – నందలి ఈ గాథలు నిర్వాణ స్వరూపమును వివరించుచున్నవి. బుద్ధుడే నిర్వాణమును గుఱించిన ప్రశ్నకు సమాధానము చెప్పెను.

అచ్చీయథా వాతవేగేన ఖిత్తో
అత్థం పలేతి న ఉపేతి సంఖం
ఏవం మునీ నామకాయా విముత్తో
అత్థ పలేతి న ఉపేతి సంఖం.
అత్థంగతో సో ఉద వా సో నత్థి
ఉదాహు వే సస్సతియా అరోగో
తం మే మునీ సాధు వియా కరోహి
తథాహి తే విదితో ఏస ధమ్మో.

అత్థంగ తస్స న పమాణం అత్థి
యేన నం వజ్జు, తం తస్స న అత్థి
సబ్బేసు ధమ్మేసు సమూహతేసు
సమూహతా వాద పథాపి సబ్బే తి.

వాత వేగమున నారిపోయిన దీపకళిక యెట్లు నిర్దేశమున కసాధ్యమో అట్లే మర్త్యదేహము (నామకాయము) నుండి విముక్తుడైన ముని నిర్దేశమున కతీతుడు. అస్తంగతుడైన ముని శాశ్వతుడై అరోగియై యుండునా? దానిని తెలుపుమని ప్రశ్న. దానికి సమాధానముగ అస్తంగతుడైన ముని ప్రమాణముల కతీతుడు. ఆయనను గుఱించి చెప్పుట కసాధ్యము. ధర్మములను (దృశ్య పదార్థములను) నశింపజేసి ఆయన వర్ణనాతీత స్థితి నందెను. వాద పథము నతిక్రమించెనని భగవంతుడే చెప్పెను.

మహా పరినిర్వాణము సంప్రదాయము ననుసరించి క్రీ. పూ. 544 లేక 543 న జరిగిన దందురు. (See also "Men and Thought in Ancient India" by Radha kumud Mookerje). కాని, చాలమంది చరిత్రకారులది క్రీ. పూ. 483 న జరిగినదని చెప్పుచున్నారు.

## భారతదేశ సహనశీలము; సత్యారాధన.

లోకకల్యాణార్థమై జీవితములను బలిచేసిన 'సోక్రటిస్', 'జీసస్సు'ల మరణములకును బుద్ధభగవానుని జీవిత సమాప్తికిని చాల భేదము కనిపించుచున్నది. ఈ ముఫ్ఫ్వురు మహనీయులును కొంత తారతమ్యముతో తమ తమ సమకాలీనములైన

సాంప్రదాయిక మూఢాచారముల నామూలముగ పెకలించి వైచిరి.

తథాగతుడు, వైదిక క్రతుకలాపాత్మకమైన సాంప్రదాయిక ధర్మమును ఖండించినంత తీవ్రముగ సోక్రటీసు ఏథెన్సు మత ధర్మమునుగాని, జీసస్సు యూదమత ధర్మమును గాని ఖండింపలేదు. సోక్రటీసు, జీసస్సులు సాంప్రదాయిక ధర్మమును వ్యతిరేకించినందుకు తమ ప్రాణములనే బలిజేయ వలసి వచ్చెను. బుద్ధ భగవానుడు సంప్రదాయములను తీవ్రముగ వ్యతిరేకించినను పూర్ణవయఃపరిపాకము వరకు జీవించి సామాన్యులకును, చక్రవర్తులకును ఆరాధ్యుడైన దేశికేంద్రుడై - తన జీవిత కాలముననే మహనీయమైన శిష్య సంఘమును స్థాపింపగలిగెను.

దీనివలన భారతజాతి మనోధర్మము విశదమగుచున్నది. అతి ప్రాచీన కాలము నుండి భారత ధాత్రి సంప్రదాయముకన్న సత్యమును, బాహ్య కర్మలకన్న పరమ జ్ఞానమును ప్రేమించి ఆరాధించిన దనుట కిది పరమ నిదర్శనము గదా! (See "Gowtama the Buddha" by Dr S.Radha Krishnan).

## పరినిర్వాణానంతరము

కుశీనగరవాసులైన మల్లులు మరునాడు పరిమళ గంధముతో పుష్పమాలలతో మునీంద్రుడు పరి నిర్వాణ మందిన సాలవనమున కేతెంచిరి. ఆరు దినములు భక్త్యావేశమున నృత్యగానములు నెఱపుచు గంధ్యమాల్యముతో తథాగతుని

నామకాయము నారాధించిరి. ఏడవనాడు భగవంతుని భౌతిక దేహమును కుశీనగర పూర్వద్వారమున మల్లుల దేవాలయమునకు దీసికొని వెళ్ళిరి. చందన కాష్ఠములచే చితి పేర్చి దానిపై తథాగతుని దేహము నుంచిరి. నలుగురు మల్లప్రముఖులు సుస్నాతులై నూతన వస్త్రములను ధరించి చితి కగ్నిని రగిలించుటకు పూనుకొనిరి. కాని యాశ్చర్యముగ చితి కగ్ని యంటుకొనలేదు.

ఆ సమయమున బుద్ధ భగవానుని శిష్యుడైన మహాకశ్యపు డైదువందల భిక్షువులతో పావాగ్రామము నుండి కుశీనగరమునకు వచ్చుచుండెను. తథాగతుని పరినిర్వాణ సమయమున నాతడు సన్నిధిని లేడు. మహాత్ముడైన కశ్యపుడును, భిక్షువులును తథాగతుని దేహమును కడసారిగా చూచి పాదాభివందన మొనరించుకొనువరకు చితి నగ్ని దహింపకుండునట్లు దేవతలు సంకల్పించిరి.

## చితి సంస్కారము

మహాకశ్యపుడును, భిక్షువులును, వచ్చిన వెంటనే ముమ్మారు చితికి ప్రదక్షిణ మొనరించి భక్తి నిర్భర మానసములతో తథాగతునికి పాదాభి వందన మొనరించిరి. అది జరిగిన వెంటనే తనంత తానే యగ్ని ప్రజ్వలించి భగవంతుని నామకాయమును దహించెను. అస్థులు మాత్రమే మిగిలినవి. ఆకాశము జలమును వర్షించి అగ్ని జ్వాలల నుపశమింపజేసెను. మల్లులు సైతము పరిమళ జలములతో నగ్ని నార్చిరి. ఆ విధమున చితి సంస్కారము నిర్వర్తితమైనది.

## అస్థి సేకరణము

అస్థుల నన్నిటిని సేకరించి మల్లులు తమ సభా భవనమునకు (సంస్థాగారమునకు) మహా వైభవమున తీసికొనివెళ్ళిరి; సాయుధపాణు లా యవశేషములను గాచు చుండగ నేడు దినములు పరిమళ గంధ మాల్యములతో భగవంతుని యస్థికల నారాధించి భక్తి పారవశ్యమున నృత్యగానముల నెఱపిరి.

## ఎనిమిది మంది భాగస్వాములు

తథాగతుని పరినిర్వాణవార్త విని మగధాధిపతి యజాతశత్రువు తాను బుద్ధభగవానుని వంశమునకు జెందినవాడు గావున భగవంతుని యవశేషములలో కొంత భాగము తన కొసగవలయునని రాయబారము పంపెను. ఆ విధముగనే వైశాలీ నగర లిచ్ఛవి క్షత్రియులును, కపిలవాస్తు శాక్యులును, అల్లకప్ప బూలులును, రామగ్రామ కోలియ క్షత్రియులును, పావా మల్లులును, అవశేషాస్థికలకై తమతమ మనుష్యులను పంపినారు. ఆ పవిత్రావశేషములలో తమకొక భాగమీవలయునని వేఠదీప బ్రాహ్మణులును కోరిరి.

కాని, కుశీనగర మల్లులు తమ సాలవనమున భగవంతుడు పరి నిర్వాణమందెను గావున, ఆయన చితావశేషములపై తమకే సంపూర్ణాధికారము గలదనిచెప్పి, యవశేష విభజనమును నిరాకరించిరి.

నిర్వాణ ప్రశాంతికై సత్యాహింసలతో గూడిన సద్ధర్మమును బోధించిన యా శాంతి సంబోధమూర్తి యస్థులకై

సమరము సంప్రాప్తమైనది. మానవు లెంత మందమతులో దీనివలన తెలియవచ్చును.

## మానవ మనః ప్రవృత్తి

మానవ మనః ప్రవృత్తిని సృష్ట్యాదినుండి నేటివరకు పరిశీలించిన, దాని క్షోభయంతయు నామరూపముల (క్షణ భంగురములైన దృశ్యపదార్థములు) కొఱకే. ఆత్మభూతమైన యమృత ధర్మమును మానవ ప్రవృత్తి యే మాయవలనో గ్రహింప నసమర్థమైనది. కఠోపనిషత్తు నందలి మృత్యుప్రోక్తమైన యీ మాట యెంత సత్యసుందరమైనది!

పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ
స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాంతరాతన్
కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షు
దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్ ।

ఇంద్రియ సమూహము బాహ్య విషయములపైన ప్రవర్తించుచున్నది. ఇంద్రియముల స్వభావమట్టిది కావున నవి నిస్సారములైన బాహ్య విషయములపై ప్రసరించును గాని, సారభూతమైన యంతరాత్మను గనుగొనజాలవు. ఉపాయ కుశలుడైన ధీరుడు మాత్రమే యింద్రియములకు స్వాభావికమైన బాహ్య విషయ ప్రవృత్తిని నిరోధించి పరమాత్మ దర్శనమందునని శ్రుతి భావము.

## సారార్థ దర్శనము

జనులు సాధారణముగ అసార పదార్థములయందు సారబుద్ధులై యుందురని భగవంతుడే మున్నొక సారి

చెప్పినాడు. సారమును సారముగ, నసారము నసారముగ చూడగలిగిన సమ్యగ్దర్శనము గల వారు సత్య సంకల్ప యుతులై సార పదార్థమును ప్రాపింతురని బుద్ధభగవానుని యుపదేశము. కాని, యంధ భూతమైన యీ లోకమున సమ్య గ్దృష్టిగల వారు చాల కొలది మంది మాత్రమే గలరు.

## సమర క్షోభ

ఆ యాసన్న మహా క్షోభమును నివారించుటకు ద్రోణుడను బ్రాహ్మణుడు కలుగ జేసికొని, శాంతి క్షాంతుల బోధించిన భగవంతుని యస్థుల కోసము యుద్ధమును రక్త పాతము జరుగరాదని, యా యవశేషముల నెనిమిది భాగము లుగ జేసి మైత్రితో పంచుకొని, వానిపై సుందర స్థూప నిర్మాణ మొనరించుట సముచితమని హిత ముపదేశించెను.

## సామరస్య సంధాత

ద్రోణుడే యా యవశేషములను సమాన భాగము లుగ పంచి యిచ్చి, పంచుట కుపయోగించిన కొలపాత్రను తాను తీసికొనెను. దానిపై చైత్యనిర్మాణ మొనరించి భక్తి గౌరవములతో నుత్సవముల జరిపింతునని ద్రోణుడనెను.

## దశస్థూప నిర్మాణము

ఆ యవశేష విభజనకాండ జరిగిన తరువాత పిప్పలి వనము నందలి మోరియ (మయూర) క్షత్రియులు తమ యవ శేష భాగముకై వచ్చిరి. ఏమియు మిగుల నందున చితి కాష్ఠావశేషములను తీసికొని వారు వెళ్ళిరి.

ఆ యవశేషములపై పైన పేరొకొన్న యందఱు వేని మీది స్థూపములను నిర్మించిరి. అవశేషముల కొలిచిన పాత్రపై ద్రోణుడు స్థూప నిర్మాణ మొనరించెను. పిప్పలివన మోరియు లును చితి కాష్ఠావశేషముపై స్థూప నిర్మాణ మొనరించిరి. అందఱు తథాగతునిపై భక్తి గౌరవములతో నానంద యుక్తులై యుత్సవములు మహా వైభవముగ జరుపు కొన్నారు.

ఫేనపిండూపమం రూపం
వేదనా బుబ్బులూపమా
మరీచి కుపమా సఞ్ఞా
సంఖారా కదలూపమా
మాయుపమఞ్చ విఞ్ఞానం
దీపితా దిచ్చ బంధునా॥ (సంయుక్త నికాయము)

పంచస్కంధము లన్నియు నిస్సారములు ననిత్యములని ఆదిత్యబంధువు (బుద్ధుడు) ఉపదేశించెను.

# బుద్ధదర్శనము

## పంచమాధ్యాయము
## (ఉపదేశ సంగ్రహ దర్శనము)

---

### ధర్మ సమన్వయము

**దుఃఖం సర్వమను స్మృత్య కామభోగా న్నివర్తయేత్**
**అజం సర్వమను స్మృత్య జాతం నైవతు పశ్యతి. (గౌడపాదకారిక)**

ధర్మమునకు తథాగతుని మహోజ్జ్వల జీవితమే మంజులమైన భాష్యము. పూర్వాధ్యాయములలో జగన్మంగళాత్మమైన భగవంతుని జీవిత చర్య నెఱిగిన పాఠకుల కాయన ఉపదేశమును సంగ్రహముగ వివరించి వేదోపనిషత్తుల యందలి మహర్షుల బోధలకును నవతార మూర్తులైన శ్రీరామకృష్ణ శంకరాదుల యుపదేశములకును తథాగతుని యుపదేశము భిన్నముగాదన్న మంగళావహమైన యభేద దర్శనమును మేమిట ప్రతిపాదింతుము.

### భేద దర్శన కారణము శుభసంస్కార హీనత

'తత్ తు సమన్వయాత్'(బ్రహ్మసూత్రములు 1-1-4) అని బ్రహ్మసూత్రకారుడైన భగవంతుడు వ్యాసమహర్షి శ్రుతి సమన్వయ దర్శనమును గావించెను. అనంతమైన విశ్వ

మును పరిశీలించిన నందు సర్వత్ర క్రమమును సమన్వయమును గోచరించుచున్నది. అటులనే జ్ఞానమునందును క్రమము సమన్వయముగలవు. మహాత్ములైన బుద్ధులు శాశ్వతమైన సద్ధర్మమును బోధింతురు.

సాధారణ మానవులు తమ తమ శుభాశుభ సంస్కార ముల ననుసరించి విభిన్నరీతుల వారి యుపదేశములను భావింతురు. మనయందలి సంస్కార భేదమే భేద దర్శనమునకు కారణము కాని, మహాత్ములైన తథాగతు లెప్పుడును శాశ్వతమునైన సద్ధర్మమునే బోధింతురు.

దురదృష్ట వశమున మత బుద్ధులు తమ సంస్కారముల ననుసరించి మహాత్ముల హృదయముల గ్రహింప జాలక ధర్మాద్వైతమునకును విశ్వసౌభ్రాత్రముకును హాని గలిగించి వాని యభ్యుదయము నిరోధించుచున్నారు.

## శ్రీ రాధాకృష్ణ పండితుని ఉపదేశము

The great sages are symbols of the Spirit in which they are one. While we have to Communicate our faith through words and symbols, forms and creeds in accordance with the accidents of our race,nation or training, We use them to help us to realise the presence of the spirit in us. If we strive with a sincere intent and a whole heart we get not to a new faith but to the heart of all faith. (Dr S. Radha Krishnan in the Brahma Sutra.)

మహార్షులందఱును పరమాత్మ ప్రతిరూపులు. పరమాత్మ యందు వారందఱు నొక్కటే. జాతి, దేశము, మనము పొందిన శిక్షణ వీని ననుసరించి మనకు కలిగిన పదజాలము, చిహ్నములు, విధానములు, విశ్వాసములు మొదలైన వానివలన మన మత ధర్మముల నితరులకు తెలియజేయవలసి వచ్చినపుడు మనలో పరమాత్మ సన్నిధిని సాక్షాత్కార మొనరించుకొనుటకు సహాయకములుగా వానినుపయోగించుకొందుము. చిత్తశుద్ధితో పరిపూర్ణ హృదయముతో ప్రయత్నించిన, మనకు నూతన మతధర్మముకాక, సర్వ ధర్మ హృదయమే లభించునని భారత తత్త్వజ్ఞ శేఖరుడైన శ్రీ రాధాకృష్ణుని యుపదేశము.

## మహాత్ములు సమరస మూర్తులు

శ్రీ రామకృష్ణ వివేకానందాది మహాత్ములీ జగన్మంగళకరమైన సమన్వయ ధర్మమునే ప్రబోధించిరి. బుద్ధ భగవానుని యుపదేశ సారము - ముఖ్యముగా ధర్మచక్ర ప్రవర్తన సూత్రము, అనాత్మ లక్షణ సూత్రము ననువాని యందు విశదముగ గోచరించుచున్నది. ఆ రెండు ప్రబోధము లును తథాగతుడు తన ప్రథమ శిష్యుల కొనరించినవి.

అందలి ప్రబోధము ననుసరించి భారత ప్రజలు ప్రవర్తించి యుండిన శంకరుని యాగమన మనవసరమై యుండెడిది. బుద్ధుని శిష్యులు ఆయన ధర్మము నపార్థ మొన రించుకొని యనర్థములను గలిగించిరి. ఈ యనర్థ పరిహారము కొఱకై వాని నిట వివరించుచున్నాము.

# ధమ్మ చక్క పవత్తన సుత్తము

## [ధర్మమ చక్ర ప్రవర్తన సూత్రము]

---

నమోతస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స

---

## మధ్యమమార్గ నిరూపణము

ఏవం మే సుతం. ఏకం సమయం భగవా బారాణాసియం విహారతి ఇసిపతనే మిగదాయే.

నేనిట్లు వింటిని. భగవంతుడొకప్పుడు వారణాసి సమీపమున మృగదావమున ఋషిపత్తనమున విహరించుచుండెను.

తత్ర ఖో భగవా పఞ్చవగ్గియె భిక్ఖూ ఆమంతేసి 'ద్వే'మే భిక్ఖవే అంతా పబ్బజితేన నసేవితబ్బా. కతమే ద్వే?

అచ్చట భగవంతుడు పంచవర్గీయ భిక్షువుల నిట్లు ప్రబోధించెను: భిక్షువులారా! ఈ రెండు అత్యంతములను పరివ్రాజకుడు సేవింపకూడదు. (వానిని విసర్జింపవలయు). ఏవి అవి రెండు?

యో చాయం కామేసు కామసుఖల్లికానుయోగో, హీనో, గమ్మో పోథుజ్జనికో, అనరియో, అనత్థసంహితో; యో చాయం అత్తకిలమథానుయోగో దుక్ఖో; అనరియో, అనత్థసంహితో. ఏతే తే భిక్ఖవే ఉభో అంతే అనుపగమ్మ మజ్ఝిమా పటిపదా తథాగతేన అభిసంబుద్ధా, చక్ఖుకారణీ, ఞాణకారణీ, ఉపసమాయ, అభిఞ్ఞాయ, సంబోధాయ, నిబ్బానాయ సంవత్తతి.

అవి హీనమును గ్రామ్యమును ప్రాపంచకమును ననార్యమును ననర్థకారణియునైన కామ సుఖాను సరణమును, అటులనే దుఃఖకారణియును ననార్యమును ననర్థకారణియునైన శరీరనాశకమైన కఠోర తపస్సును. భిక్షువులారా! ఈ రెండత్యంతములను విసర్జించి తథాగతునిచే మధ్యమమార్గము కనుగొనబడినది. ఈ మధ్యమ మార్గము చక్షుకారణి (చూపును గలిగించునది), జ్ఞానమును గలిగించునది. ఈ జ్ఞానము వలన శాంతియు నభిజ్ఞయు (పరమ వివేకము), సంబోధమును, నిర్వాణమును లభించును.

## అష్టాంగ వివరణము

కతమా చ సా భిక్ఖవే మజ్ఝిమా పటిపదా తథాగతేన అభిసంబుద్ధా చక్ఖు కారణీ ఞాణ కారణీ, ఉపసమాయ, అభిఞ్ఞాయ, సంబోధాయ, నిబ్బానాయ, సంవత్తతీ? అయం ఏవ అరియో అట్ఠంగికో మగ్గో: సెయ్యథీదం—సమ్మాదిట్ఠి సమ్మాసంకప్పో, సమ్మావచ, సమ్మాకమ్మంతో, సమ్మా ఆజీవో, సమ్మా వాయామో, సమ్మాసతి సమ్మా సమాధి. అయం ఖో సా భిక్ఖవే మజ్ఝిమా పటిపదా తథాగతేన అభిసంబుద్ధా చక్ఖుకారణీ ఞాణకారణీ, ఉపసమాయ, అభిఞ్ఞాయ సంబోధాయ, నిబ్బానాయ, సంవత్తతి.

భిక్షువులారా! ప్రశాంతిని పరమవివేకమును సంబోధమును నిర్వాణమును కలిగించు చక్షు కారణియు జ్ఞాన కారణి

యున్నె తథాగతునిచే దర్శితమైన యీ మధ్యమ మార్గమేది? అదియే ఆర్యుల అష్టాంగ మార్గము. (1) సమ్యగ్దృష్టి (2) సమ్యక్సంకల్పము (3) సమ్యగ్వచనము, (4) సమ్యక్కర్మము (5) సమ్యగాజీవము,(6)సమ్యగ్వ్యాయామము;(7)సమ్యక్స్మృతి (8) సమ్యక్సమాధి అనునవియే యిందలి యష్టాంగములు. భిక్షువులారా! ఇదియే తథాగతునిచే నభిసంబుద్ధమై (తెలిసి కొనబడి) చక్షుకారణియు జ్ఞానకారణియునై యుపశమమును నభిజ్ఞను సంబోధమును నిర్వాణమును కలిగించు మధ్యమ మార్గము.

## ప్రథమార్యసత్యము

ఇదం ఖో పన భిక్ఖవే దుక్ఖం అరియ సచ్చం :- జాతి పి దుక్ఖా, జరా పి దుక్ఖా, వ్యాధీ పి దుక్ఖా, మరణం పి దుక్ఖం, అప్పియేహి సంపయోగో దుక్ఖో, పియేహి విప్పయోగో దుక్ఖో యం పిచ్ఛం నోలభతి తం పి దుక్ఖం; సంఖిత్తేన పఞ్చుపాదాన ఖంధా దుక్ఖా.

భిక్షువులారా! దుఃఖమనునది ఆర్యసత్యము (Noble truth). జన్మము దుఃఖము, జర (ముసలితనము) దుఃఖము, వ్యాధి దుఃఖము, మరణము దుఃఖము. మన కిష్టముగానివి కలిగిన దుఃఖము, ప్రియమైన వాని నెడబాయుట దుఃఖము. ఇష్టప్రాప్తి కాకున్న దుఃఖము. సంక్షేపముగా చెప్పవలయునన్న ఉపాదాన కారణములైన పంచస్కంధములు దుఃఖరూపములే.

[పంచస్కంధములు:- 1. రూపము, 2. వేదన, 3. సంజ్ఞ, 4. సంస్కారములు, 5. విజ్ఞానము ననునవి.

ఇందు రూపము భౌతికము. మిగిలిన నాలుగును మానసికములు. మానవుని మనశ్శరీరములు పంచస్కంధమయములు. వీనికే నామరూపములని మరియొక పేరుగలదు.

| | | |
|---|---|---|
| మానసికము | — | భౌతికము |
| నామము | — | రూపము |
| \| | | \| |
| వేదనా సంజ్ఞా సంస్కార విజ్ఞానములు } | | రూపము] |

## ద్వితీయార్య సత్యము

ఇదం ఖో పన భిక్ఖవే దుక్ఖ సముదయం అరియసచ్చం: యా యం తణ్హా పొనొభవికా, నందీరాగ సహగతా, తత్ర తత్రాభినందినీ, సెయ్యథీదం: కామ తణ్హా, విభవతణ్హా.

భిక్షువులారా! దుఃఖ సముదయమనునది (రెండవ) ఆర్య సత్యము. (సముదయమనగా కారణము). అది పునర్భవకారణమైన తృష్ణ. అది నందీ (సంతోష) రాగములతో గూడి విషయ సుఖముల నంతట నన్వేషించుచుండును. అది కామ తృష్ణ (విషయసుఖేచ్ఛ), భవతృష్ణ (పునర్జన్మ కాంక్ష), విభవ తృష్ణ (స్వర్గ సుఖేచ్ఛ) యని త్రివిధము.

## తృతీయార్య సత్యము

ఇదం ఖో పన భిక్ఖవే దుక్ఖనిరోధం అరియ సచ్చం:-

యో తస్సా యేవ·తణ్హాయ అసేస విరాగ నిరోధో చాగో పటినిస్సగ్గో ముత్తి అనాలయో.

భిక్షువులారా! దుఃఖ నిరోధమనునది (మూడవ) ఆర్య సత్యము. అది నిశ్శేషముగ తృష్ణను నిరోధించుట, పరిత్యజించుట, సంపూర్ణముగ తృష్ణ నుండి విముక్తిని బొందుట. ఇది తృష్ణ యొక్క అనాలయము (శూన్యము) అనగా తృష్ణ కిందు స్థానమే లేదని భావము. ఇది పరమ ప్రశాంతి.

## చతుర్థార్యసత్యము

ఇదం ఖో పన భిక్ఖవే దుక్ఖ నిరోధగామినీ పటిపదా అరియ సచ్చం: అయం ఏవ అరియో అట్ఠంగికో మగ్గో సెయ్యథీదం: సమ్మాదిట్ఠి, సమ్మా సంకప్పో, సమ్మావచా, సమ్మా కమ్మంతో, సమ్మా ఆజీవో, సమ్మావాయామో, సమ్మాసతి, సమ్మా సమాధి.

ప్రలారా! దుఃఖ నిరోధగామిని యైన మార్గము (నాల్గవ) ఆర్య సత్యము, ఇదియే అష్టాంగమార్గము.

సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము, సమ్యగ్వచనము, సమ్యక్కర్మము, సమ్యగాజీవము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి యనునవి యిందలి యష్టాంగములు.

ఇదం దుక్ఖం అరియసచ్చం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు, ధమ్మేసు, చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం

దుక్ఖం అరియసచ్చం పరిఞ్ఞెయ్యం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు, ధమ్మేసు, చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖం అరియ సచ్చం పరిఞ్ఞాతం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు, చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది.

ఇది దుఃఖము ఆర్యసత్యమని పూర్వమననుశ్రుతము (వినని) లైన ధర్మములనుగూర్చి నాకు చక్షువు (దర్శనము) కలిగెను, జ్ఞానము కలిగెను, ప్రజ్ఞ జనించెను, విద్య యుదయించెను, ఆలోకము (వెలుగు) ఉదయించెను. దుఃఖమను నార్య సత్యము పరిజ్ఞేయమని (తెలియదగినది) భిక్షువులారా! పూర్వ మననుశ్రుతములైన ధర్మములను గూర్చి నాకు చక్షువును, జ్ఞానమును, ప్రజ్ఞయు విద్యయు నాలోకమును గలిగినవి. దుఃఖ మను నార్యసత్యము పరిజ్ఞాతమని (ఎఱుగబడినదని) భిక్షువు లారా! పూర్వమనను శ్రుతములైన ధర్మములను గూర్చి నాకు చక్షువును జ్ఞానమును ప్రజ్ఞయు విద్యయు నాలోకమును గలిగినవి.

ఇదం దుక్ఖ సముదయం అరియసచ్చం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖ సముదయం అరియసచ్చం పహాతబ్బం తి మే బిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు, ధమ్మేసు, చక్ఖుం ఉదపాది ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో

ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖ సముదయం అరియసచ్చం పహీనం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది.

దుఃఖ సముదయ మార్యసత్యమని పూర్వమనను శ్రుతములైన ధర్మములనుగూర్చి నాకు చక్షువును......... కలిగినవి.

ఆర్య సత్యమగు దుఃఖ సముదయమును నశింప జేయవలయునని పూర్వమనను శ్రుతములైన ధర్మములనుగూర్చి నాకు చక్షువును...కలిగినవి.

దుఃఖ సముదయము నశించినదని పూర్వమనను శ్రుతములైన ధర్మములనుగూర్చి నాకు చక్షువును.........కలిగినవి.

ఇదం దుక్ఖ నిరోధం అరియసచ్చం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు, చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది, తం ఖో పనిదం దుక్ఖనిరోధం అరియసచ్చం సచ్ఛికాతబ్బం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు, చక్ఖుం ఉదపాది ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖ సముదయం అరియ సచ్చం సచ్ఛికతం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది.

దుఃఖ నిరోధ మార్యసత్యమని పూర్వమనను శ్రుతము లైన ధర్మములను గూర్చి నాకు చక్షువును......కలిగినవి.

దుఃఖ నిరోధమును సాక్షాత్కరించు కొనవలయునని పూర్వ మనను శ్రుతములైన ధర్మములను గూర్చి నాకు చక్షువును.........కలిగినవి.

దుఃఖ నిరోధము (ప్రశాంతి) సాక్షాత్కారమైనదని పూర్వమనను శ్రుతములైన ధర్మములను గూర్చి నాకు చక్షువును.........కలిగినవి.

ఇదం దుక్ఖ నిరోధ గామినీ పటిపదా అరియ సచ్చం తి మే భిక్ఖవే పుబ్బే అననుస్సుతేసు ధమ్మేసు చక్ఖుం ఉదపాది ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖ నిరోధగామినీ పటిపదా అరియ సచ్చం భావే తబ్బం తి మే భిక్ఖవే పూబ్బే అననుస్సుతేసు ధమ్మేసు, చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది. తం ఖో పనిదం దుక్ఖ నిరోధ గామినీ పటిపదా అరియ సచ్చం భావితం తి మే భిక్ఖవే పూబ్బే అననుస్సుతేసు ధమ్మేసు చక్ఖుం ఉదపాది, ఞాణం ఉదపాది, పఞ్ఞా ఉదపాది, విజ్జా ఉదపాది, ఆలోకో ఉదపాది.

ఇది దుఃఖ నిరోధ గామినియైన మార్గమను నార్య సత్యమని పూర్వమనను శ్రుతములైన ధర్మములను గూర్చి నాకు చక్షువును.........కలిగినవి. ఆర్య సత్యమగు దుఃఖ నిరోధ గామినియైన మార్గము సాధన జేయవలసినదని సాధన జేయ వలసినదని పూర్వమనను శ్రుతములైన.........కలిగినవి.

ఆర్యసత్యమగు...మార్గము సాధింపబడినదని పూర్వ మనను శ్రుతములైన ధర్మములను గూర్చి......కలిగినవి.

యావ కీవఞ్చ మే భిక్ఖవే ఇమేసు చతూసు అరియ సచ్చేసు, ఏవం తిపరి వట్టం ద్వాదసాకారం యథాభూతం ఞాణ దస్సనం న సువిసుద్ధం అహోసి, నేవ తావా హం భిక్ఖవే సదేవ కే లోకే సమారకే, సబ్రహ్మకే, సస్సమణ బ్రాహ్మణియా పజాయ సదేవ మనుస్సాయ అనుత్తరం సమ్మా సంబోధిం అభిసంబుద్ధో తి పచ్చఞ్ఞాసిం.

భిక్షువులారా! త్రిపరివర్తనమును ద్వాదశాకారమునైన యీ చతుస్సత్యములను గుఱించి యథాభూతముగ జ్ఞానదర్శ నము నాకు విశదముగ కలుగసంతవరకు దేవ, మార, బ్రహ్మ లోకములయందును, బ్రాహ్మణ శ్రమణులకును దేవమానవుల కును, నేననుత్తరమైన సమ్యక్సంబోధిని (పరమజ్ఞానము) తెలిసి కొంటినని (సంబుద్ధుడనని) ప్రకటింపలేదు.

యతో చ ఖో మే భిక్ఖవే ఇమేసు చతూసు అరియసచ్చేసు ఏవం తిపరి వట్టం ద్వాదసాకారం యథాభూతం ఞాణదస్సనం సువిసుద్ధం అహోసి, అథాహం భిక్ఖవే సదేవకేలోకే సమారకే సబ్రహ్మకే సస్సమణ బ్రాహ్మణియా పజాయ సదేవ మను స్సాయ అనుత్తరం సమ్మా సంబోధిం అభిసంబుద్ధోతి పచ్చ ఞ్ఞాసిం ఞాణఞ్చ పనమే దస్సనం ఉదపాది అకుప్పా మే చేతో విముత్తి అయం అంతిమా జాతి నత్థిదాని పునభ్భవోతి.

ఎప్పుడు నాకు త్రిపరివర్తమును ద్వాదశాకారమునైన యార్య చతుస్సత్యములను గూర్చిన యథాభూతమగు జ్ఞాన

దర్శనము విశదముగ గలిగినదో, అప్పుడే భిక్షువులారా! దేవ, మార, బ్రహ్మలోకముల యందును బ్రాహ్మణ శ్రమణులకును దేవమానవులకును నేననుత్తరమైన సమ్యక్సంబోధి నెఱిగితినని (అభిసంబుద్ధుడనని) తెలియజేసితిని. నాకు చేతో విముక్తి గలిగినది; ఇది యంతిమ జన్మము, మరి పునర్భవము లేదని నాకు జ్ఞానదర్శము గలిగినది.

ఇదం అవోచ భగవా అత్తమనా పఞ్చ వగ్గియా భిక్ఖూ భగవతో భాసితం అభినందుం. ఇమస్మిఞ్చ పన వెయ్యాకరణస్మిం భఞ్ఞమానే ఆయస్మతో కొణ్డఞ్ఞస్స విరాజం వీతమలం ధమచక్ఖుం ఉదపాది యంకిఞ్చి సముదయ ధమ్మం సబ్బం తం నిరోధ ధమ్మం తి.

భగవంతుడిట్లు చెప్పెను: పంచవర్గీయులైన భిక్షువులానందమున భగవద్భాషితము నభినందించిరి. ప్రబోధ మీరీతి వ్యాకృతముకాగా (వివరింపబడగా), నాయుష్మంతుడైన కౌండిన్యుని (కొణ్డఞ్ఞ)యందు విరజమును (రజోగుణ రహితము) వీతమలము (అమలము)నైన ధర్మచక్షువుదయించెను (సత్యదర్శన మాయనకు గల్గెను). ''సముదయ ధర్మముగల పదార్థములన్నియు నిరోధ ధర్మము (నాశనము) నందు''నని యాయన దర్శించెను.

## దేవతల యానంద ఘోషణము

పవత్తితే చ పన భగవతా ధమ్మచక్కే భుమ్మా దేవా సద్దం అనుస్సావేసుం:- ఏతం భగవతా బారాణాసియం ఇసిపతనే మిగదాయే అనుత్తరం ధమ్మచక్కం పవత్తితం

అప్పటి వత్తియం సమణేన వా, బ్రాహ్మణేనవా, దేవేనవా, మారేనవా, బ్రహ్మణావా, కేనచివా లోకస్మిం తి.

భగవంతుడీరీతి ధర్మచక్ర ప్రవర్తనము చేయగా భూలోకమునందలి దేవతలిట్లు ఘోషించిరి. "వారణాసీ సమీపమున మృగదావము (హరిణవనము) నందలి ఇసిపత్తనమున భగవంతునిచే ననుత్తరమైన ధర్మచక్రము ప్రవర్తితమైనది. ఇంతకు ముందీలోకమున శ్రమణునిచేగాని, బ్రాహ్మణునిచేగాని, మారునిచేగాని, దేవతచేగాని, మరి యెవరిచేగాని ఇది ప్రవర్తితము గాలేదు."

భుమ్మానం దేవానం సద్దం సుత్వా చాతుమ్మహారాజికా దేవా సద్దం అస్సావేసుం: ఏతం భగవతా బారాణాసియం ఇసిపతనే మిగదాయే అనుత్తరం ధమ్మచక్కం పవత్తితం అప్పటివత్తియం సమణేన వా, బ్రాహ్మణేనవా, మారేణవా, బ్రహ్మణావా, కేనచివా లోకస్మిం తి.

భూమ్య దేవతల (విశ్వ దేవతలు)శబ్దము (ఘోషణము)ను విని చాతుర్మహారాజిక దేవతలు ఘోషించిరి. "వారణాసీ సమీపమున మృగదావమునందలిఇసిపత్తనమున భగవంతునిచే ననుత్తరమైన ధర్మచక్రము ప్రవర్తితమైనది. ఇంతకుముందీ లోకమున శ్రమణునిచేగాని......ప్రవర్తితము గాలేదు.

చాతుమ్మహారాజికానం దేవానం సద్దం సుత్వా తావటింసా దేవా యమా దేవా, తుసితా దేవా, నిమ్మానరతి దేవా పరనిమ్మితవసవత్తినో దేవా, బ్రహ్మకాయికా దేవా సద్దం అనుస్సావేసుం: ఏతం భగవతా బారాణాసియం ఇసిపతనే

మిగదాయే అనుత్తరం ధమ్మచక్కం పవిత్తితం అప్పటి వత్తి యం సమణేనవా, బ్రాహ్మణేనవా, దేవేనవా, మారేణవా, బ్రహ్మణావా, కేనచివా లోకస్మిం తి.

చాతుర్మహారాజిక దేవతల శబ్దము (ఘోషము)ను విని త్రాయస్త్రింశ దేవతలును, యమదేవతలును, తుషిత దేవతలును, నిర్మాణరతి దేవతలును, పరనిర్మిత వాసవర్తి దేవతలును, బ్రహ్మకాయిక దేవతలును ఘోషించిరి. "వారణాసీ సమీపమున......ప్రవర్తితము గాలేదు."

ఇతి హ తేన ఖణేన తేన లయేన తేన ముహుత్తేన యావ బ్రహ్మలోకా సద్దో అబ్భుగ్గచ్ఛి అయఞ్చ దస సహస్సీ లోకధాతు సంకంపి సంపకంపి సంపవేధి, అప్పమాణో చ ఉలారో ఓభాసో లోకో పాతురహోసి అతికమ్మ దేవానం దేవాను భావం తి.

ఇట్లు ఆ క్షణముననప్పుడే యా ముహూర్తముననే దేవతల ఘోషణము బ్రహ్మలోకమును జేరినది. దశ సహస్ర లోకములు మరల మరల వెనుకకు ముందుకు కంపించినవి. దేవతల దివ్యాను భావము నతిక్రమించిన ప్రమాణాతీతమైన మహా తేజము ప్రకాశించినది.

## కౌండిన్యుని జ్ఞానదర్శనము

అథ ఖో భగవా ఉదానం ఉదానేసి, "అఞ్ఞాసి వత భో కొణ్డఞ్ఞో అఞ్ఞాసి వత భో కొణ్డఞ్ఞో తి" ఇతి హదం ఆయస్మతో కొణ్డఞ్ఞస్స అఞ్ఞాత కొణ్డఞ్ఞో త్వేవ నామం అహోసీ తి.

తరువాత భగవంతుడు గంభీరముగ నిట్లనెను. "కౌండిన్యా! నిజముగ నీవు సత్యము నెఱిగితివి; నిజముగ నీవు సత్యము నెఱిగితివి!" ఆయుష్మంతుడైన కౌండిన్యుడందువలన ఆజ్ఞాత కౌండిన్యుడని (సత్యము నెఱిగినవాడని) పేరుగాంచెను.

## కారణ ధర్మసూత్రము

"జన్మము దుఃఖము. మరణము దుఃఖము. అప్రియ సంప్రయోగము దుఃఖము. ప్రియవిప్రయోగము దుఃఖము."

జన్మ మృత్యువులును, బాధానురాగములును విశ్వ సత్యములు. ఇవి సమరసత్వ అభావమునకు చిహ్నములు. భేద దర్శనమువలన నివి కలుగును. దుఃఖమునకు భేదదర్శనమే కారణము. వ్యావహారిక సత్తా రూపమైన ప్రపంచమంతయు అసమత్వరూపమైన–భేదరూపమైన–దుఃఖముచే పరివ్యాప్తము. దుఃఖ విముక్తిని పొందుటే జీవిత పరమధ్యేయము.

ప్రతి వస్తువునకు కారణ మున్నది. అది మరల నొక కార్యమునకు కారణమగుచున్నది. దేవ మానవ పూర్ణమైన స్వర్గమర్త్యలోకము లన్నియును కార్యకారణాత్మకమైన ఈ ధర్మమునకు లోబడినవియే. విభ్రాంతిని కలిగించు సూర్య చంద్ర తారాది గ్రహమండలములతో, ఉత్పత్తి వినాశ పరంపరలతో అనంతాకాశమున పరివ్యాప్తమైన ఈ విశాల విశ్వము కారణ ధర్మ సూత్రముచే పరిపాలింపబడుచున్నది. అట్లే మానవ జీవితమును, మానవ చరిత్ర గతియును ఈ సూత్రముచేతనే పాలితము. కారణము లేని కార్యముండదు. కాన దుఃఖమునకు కూడ కారణముండవలయును. దాని తెలిసి

క్షీణించినచో దుఃఖము నశించును. దుఃఖమునకు కారణము తృష్ణ యని బుద్ధ భగవానుని ఉపదేశము.

## అవిద్య ప్రత్యేక వ్యక్తిత్వమునకు కారణము

అవిద్య సిద్ధాంతరూపము. తృష్ణ దాని ఆచరణరూపము. ఇవి రెండును ఏకరూపమే. అవిద్య భేద దర్శనమును కలిగించి జీవన పూర్ణస్థితిని నిరసింపజేయును. అవిద్యవలన మానవుడు జీవన సాగరమున తాను ప్రత్యేక వ్యక్తిగా భావించును. ఇది అల సముద్రముకంటే తాను భిన్నమని భావించుట వంటిది. దీనివలన సంకుచితమైన అహంకారము జనించుచున్నది. ఈ సంకుచితాత్మభావము వలననే మానవుడు దుఃఖితుడగుచున్నాడు. ఇది అవిద్యా మూలకము. ఈ లోకమునను, పరలోకమునను మనలను పీడించు దురదృష్టములకన్నిటికిని కారణము తృష్ణారాగములు. వానికి కారణము అవిద్య.

## కామబంధము

ఈ అవిద్యను అధ్యాత్మ జ్ఞానము చేతను, కామమును శీలాచరణ చేతను జయింపవలయును. కామమే బంధమనియు ఇతరమేదియు బంధము కాదనియు మహాభారతోపదేశము. "కామబంధన మేవేదం నాన్యదస్తీహ బంధనమ్."

## కర్మ ప్రభావము

మానవుడు తాను చేయు కర్మవలననే ఉత్తమ మధ్యమ అధమ స్థానములను పొందుచున్నాడు. సంకల్పములును, కాంక్షలును కూడ మానవుని రూపురేఖలను దిద్దు

చున్నవి. మానవజాతి స్వీయ కర్మవలనే పరిణామమును బొందుచున్నది. గతకాలమునందలి ప్రజల ఆలోచనలును, ఆకాంక్షలును వర్తమాన ప్రపంచ రూపమును ధరించినవి. కార్యకారణ సూత్రము బలీయము కాన కర్మఫలమును దప్పించుకొనజాలము. జీవితము అనంత నైతిక ధర్మశాసనమునకు లోబడినదని బుద్ధ భగవానుడు సాక్షాత్కారమందెను. కాన మానవుడు తాను చేసిన కర్మల ఫలము ననుభవించి తీరవలయును.

కర్మయే నా సంపద. కర్మయే నా ఔరసత్వము. కర్మయే నన్ను గర్భమున ధరించెను. కర్మయే నా జాతి; నాకు శరణ్యమని ఆయన వచించును. ప్రపంచమందలి నానాత్వమునకును కర్మయే కారణము (కర్మజం వైచిత్రం) *

## నైతికధర్మ శాసనము

నైతిక ధర్మశాసనము శాశ్వత స్వర్గమునుగాని, శాశ్వత నరకమునుగాని అంగీకరింపదు. అవి మనపైన ఆధారపడినవి. వాని నుండి తప్పించుకొనుటకు క్షుద్రములైన మానసికా వేగములను, కృపణతా హేతువైన దౌర్బల్యమును జయించు మహోత్తమ ధర్మ సాధన మాచరింపవలయును.

---

*స్వయంకృత కర్మము నుండి తరించము.

సుఖస్య దుఃఖస్య నకోపిదాతా. పరోదదాతీతి కుబుద్ధిరేషా
స్వయం కృతం స్వేనఫలేన యుజ్యతే శరీరహే నిస్తర యత్త్వయాకృతం॥
శరీరమా! సుఖదుఃఖదాత యెవరును లేరు. ఇతరులు సుఖ దుఃఖదాతలనుట కుబుద్ధి. తాను చేసిన కర్మయే ఫలము గలిగించును. (గరుడపురాణము).

కర్మయే జీవుల సుఖ దుఃఖ కారణమని దుఃఖితుల యెడ దీనులయెడ నుదాశీనత వహించి దయాదూరులము కాకూడదు. క్షమా కారుణ్యములతో తన్ననుసరింపని వారిని ధర్మము కఠినముగ శిక్షించును.

మానవుడు రూప వేదన సంజ్ఞా సంస్కార విజ్ఞానములను పంచస్కంధముల సముచ్ఛయ రూపము. ఈ విషయము ముందు వివరింపబడును.

## వ్యావహారిక వ్యక్తిత్వము నిత్యపరివర్తనాత్మకము

మానవుని అంతరంగ జీవనము ఆలోచనలును కాంక్షలును, రాగములును ఆవేగములును మాత్రమే. వీని కాధార భూతమైన శరీరము మరణము వలన నశించుచున్నది. కర్మ వలన సూక్ష్మములై కంటి కగుపడని శక్తులు నూతన వ్యక్తిత్వమునకు కారణ భూతములగుచున్నవి. మరణించిన వ్యక్తికిని నూతన వ్యక్తికిని గల సంబంధము మానసికమైనది. పూర్వ వ్యక్తిచేసిన కర్మఫలమును ప్రస్తుత వ్యక్తి అనుభవించును. పూర్వవ్యక్తికిని ప్రస్తుత వ్యక్తికిని గల సంబంధము రాత్రి మొదటి జాముననున్న దీప జ్వాలకును రెండవ జాముననున్న దీపజ్వాలకును గల సంబంధము వంటిదని చెప్పబడినది. ప్రస్తుత దశ గతదశ కాకున్నను, అది గతదశనుండి వచ్చినది కాన, దశాపరంపరా ఫలితమని వర్ణింపబడినది. దీప జ్వాలలను వేరు వేరుగ మనము భావించినపుడు, అవి ఒకదానికంటె మరియొకటి భిన్నము గావచ్చును కాని, అగ్నితత్త్వ దృష్టితో ఆలోచించిన దీపజ్వాల లన్నియు అగ్నియే. ఇదియే వ్యావహారిక వ్యక్తిత్వ

స్వరూపము. (Empirical individual). ఈ వ్యావహారిక వ్యక్తిత్వధారకములైన రూపవేదనాది సంఘాతములు నిరంతరము మారుచునుండును. పునర్భవకారణమైన తృష్ణ నశించువరకు ఈ సంఘాతములు వీడిపోవు.

## ఆత్మస్థితియే నిర్వాణము

అయిన, శాశ్వతమైన ఆత్మ లేకున్న ఈ సుఖదుఃఖము లెవరికి? కామావరణ బద్ధులైనవారు దీనిని తెలియజాలరని బుద్ధుని ఉపదేశము. స్కంధ జన్యమై క్షణక్షణము పరివర్తనమగుచున్న అహంకార రూపమైన ఈ వ్యావహారికాత్మనే బుద్ధుడు నిరసించెను. నిజమైన ఆత్మస్వరూపమునకు నిర్వాణస్థితి మాత్రమే వేద్యము. దానిని ముందు వివరింతుము.

## నిర్వాణమునకు నిశ్రేణిక

ఈ విచారముకంటె, ప్రత్యక్షముగ గోచరించుచున్న దుఃఖమునుండి విముక్తిని గాంచుటకు ముందు ప్రయత్నింపవలయును. అష్టాంగమార్గమే దుఃఖనాశనమునకు నిశ్రేణిక వంటిది. ఇందు మొదటి మెట్టు సమ్యగ్దృష్టి: దీనివలన చతుస్సత్యములను అంతరాత్మ లోతులలో సాక్షాత్కారమంది, అసత్యపథమును విసర్జింపవలయును.

రెండవ మెట్టు సమ్యక్సంకల్పము: త్యాగమును, కరుణను, ఔదార్యమును గురించిన సత్సంకల్పము. విషయ సుఖలాలసను, ద్వేషమును, హింసను వర్జింపవలయునన్న దృఢేచ్ఛ.

తరువాతది సమ్యగ్వచనము: నిందా వచనములను,

పారుష్యమును, పరిభాషణమును, ప్రలాప విప్రలాప అపలాపములను పరిత్యజించి, అనుద్వేగకరముగను, ప్రియముగను సత్యము భాషింపవలయును. రుచిరమును సుగంధ యుక్తమునైన పుష్పమువలె సుభాషితమైన వాక్కు సఫలమగును.

సమ్యక్కర్మ: అహింసా అస్తేయ బ్రహ్మచర్య అపరిగ్రహ రూపము. సమ్యగా జీవము: మారణాయుధముల విక్రయించుట, కసాయి వృత్తి, విషమమ్ముట, మనుష్యులను బానిసలుగా నమ్ముట మొదలైన నింద్య వృత్తులను విడిచి అనవద్యమైన మార్గమున జీవించుట. సైనిక జీవనమును బుద్ధుడు నిషేధించెను. *

అష్టాంగ మార్గము నైతిక నియమావళి మాత్రమే కాదు. అది పవిత్ర జీవన విధానము. సమ్యగ్వ్యాయామము: ఇంద్రియ జయమునకై చేయు పూర్ణ ప్రయత్నము. దుర్గుణములను పరిత్యజించి కల్యాణ గుణాధిక్యమును నార్జింపవలయును. ఇది హృదయ శిక్షణకు భూమిక; ఆత్మ పరిశీలనమున మానసాంతర్భాగముల నెఱిగి కామతృష్ణాదులను సమూల

---

* Military life in general deproves man. It places them in all conditions of complete idleness, that is absence of all rational and useful work; frees them from their common human duties, which it replaces by merely conventional duties to the honour of the regiment, the uniform, the flag; and while giving them on one hand absolute power over other men, also Puts them in to conditions of servile obedience to those of higher rank than themselves. (Resurrection-Leo Tolstoi).

ముగ ఛేదించుటకును, జాగృతీ సంపన్నమైన చిత్తమునకును శరీరేంద్రియములకును మధ్య సామరస్యము సాధించుటకును చేయు దృఢ ప్రయత్నము. అసత్యమునలనను వంచన వలనను ఇతరులను మోసగించుటయేకాక మానవుడు వానివలన తన్ను తానే మోసగించుకొనుచున్నాడు.

మానవులలో చాలమంది కాలము చేతి యంత్రముల వంటివారు. వారి ఆలోచనా సరణి యెప్పుడును అలవాటు పద్ధతినే అనుసరించును. ఆత్మ పరిశీలనము వలన పై దోషముల నుండి విముక్తిని పొందవచ్చును. దీనివలన అధ్యాత్మసాధనకు ప్రబల శత్రువైన ప్రమాద ఆలస్య నిద్రాది రూపమైన తమో గుణమును జయింపవచ్చును.

తరువాత సాధకునకు సమ్యక్స్మృతి ( Rightmind fullness) లభించును. దీనివలన చిత్తోద్వేగము లన్నియు శమించును. వస్తువుల స్వభావమంతయు విశదమగును. ఇది ఆత్మ విజయము. తరువాతిది సమ్యక్సమాధి: అష్టాంగమార్గ మునకిది మనోజ్ఞ మణి కిరీటము వంటిది. మైత్రీ, కరుణా, ముదితా, ఉపేక్షలను నాలుగు ధ్యానములును ఈ సమాధి రూపములే. ఈ నాల్గు ధ్యానములు బ్రహ్మ విహారములని వర్ణింపబడినవి.

దుఃఖ తారకమైన సత్యదర్శనమే అష్టాంగ మార్గము ననుసరించి నందులకు ఫలము. ఇదియే పరమ ప్రశాంతిరూప మైన నిర్వాణము. [నిర్వాణ మనగా కామము, ద్వేషము, అజ్ఞానము మొదలైన అగ్నిజ్వాల లుపశమించుటయని ముందే వివరింపబడినది. ఇది జీవితమునందే లభించు పరమమైన ఆనంద

రూపము. పరి నిర్వాణ మనగా మరణానంతరము లభించు ఆత్మ పరిపూర్ణమైన స్థితి. త్రికాల సత్యమైన పరమ సత్యముతో తాదాత్మ్యమందుట. ఇది పాశ్చాత్య పండితులు ఓల్డన్ బెర్గ, రైసుడేవిడ్సుసతి, చైల్డర్సు మొదలైనవారు వ్రాసినట్లు పూర్ణ జీవ నాశనము కాదు. నిర్వాణ మనగా జీవనాశనమని తలచు వారు ధర్మద్రోహులని బుద్ధుని యొక్కయు, ఆయన ప్రియ శిష్యులైన సారి పుత్రాదుల యొక్కయు భావము. నిర్వాణము పూర్ణమోక్ష రూపము. మహోజ్జ్వల సూర్యప్రభలో నక్షత్ర కాంతి లీనమగుట వంటిది. నిర్వాణము ఉపనిషత్తులలోని మోక్షము, అక్షరము, బ్రహ్మము, అమృతము అను శబ్దము లకు సమమైనది. ఇది ఉపనిషత్తులయందును, గీత యందును, పురాణాదులయందును ప్రయుక్తమైనదియే.

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం
(గీత 5-26)]

ఇది ముందు విశదముగ వివరింపబడును. తథాగతుడు అనేక జన్మసాధన ఫలముగ దీనిని పొందెను. జాతక కథలీ పరమ సాధన దీక్షను వ్యాఖ్యానించుచున్నవి.

## పండితుల ప్రవమాదము

నాలుగు సత్యముల నెఱిగి యష్టాంగ మార్గమున పయ నించుట వలన చేతో విముక్తి గలిగి పునరావృత్తి నశించునని భగవంతుడు ధర్మచక్ర ప్రవర్తనమున తెలిపెను. ఇది యుప నిషత్తుల ప్రబోధమునకు భిన్నము గాదని పాశకులిప్పు డెఱి

గియే యుందురు. ఇక భగవంతుని రెండవ ప్రబోధమైన అన_త్త లక్ఖణ సు_త్తము (అనాత్మ లక్షణ సూత్రము) నందలి భావమును మాత్ర మిట వివరింతుము. దానివలన యాది బుద్ధుని ధర్మ ముపనిష ద్రుషి ధర్మమున కభిన్నమని మరింత విశదము కాగలదు.

అనాత్మ లక్షణ సూత్రమును పాశ్చాత్య పండితులలో కొందఱు 'The Discourse upon the No - Soul Doctrine' అనియు, 'The Discourse upon the impermanence of Soul' అనియు ననువదించి యపార్థమును ననర్థమును గలిగించిరి. కొందఱు ప్రాచ్య పండితులును (ఆనంద కుమార స్వామి ప్రభృతులు) 'Second discourse on the non - existence of Soul' అని యా సూత్రము ననువదించిరి. అనాత్మ లక్షణ సూత్రమనగా ఆత్మగాని ఇతర పదార్థ లక్షణములను వివరించు సూత్రమని యర్థము.

బుద్ధుని గుఱించి గ్రంథములు రచించిన పాశ్చాత్య పండితులలో చాలమంది నిష్కారణముగ వేద ధర్మమును దూషించుచు, దానియందలి మంచి గుణములన్నియు బౌద్ధ మత ప్రభావము వలన తరువాత గలిగినవి యని తాము భ్రమ ప్రమాదములకు లోనై యితరులకును భ్రమ ప్రమాదములను గలిగించిరి. బుద్ధ ధర్మము నది జనించిన భారత దేశమునందలి యధ్యాత్మ క్షేత్రమునకును, తాత్త్విక వాతావరణమునకును భిన్నమని వా దూహాగానము చేసిరి.

## విజ్ఞులైన పాశ్చాత్య పండితులు

అయినను, కొందఱు జ్ఞానులైన పాశ్చాత్య పండితులు లేకపోలేదు. వారు మనవారి కంటెను సమ్యగ్దృష్టి సంపన్నులై యుపనిషత్సిద్ధాంత పరిచయము లేనిచో బుద్ధోపదేశమర్థ మగుట కష్టమని తెలిపిరి. ఉపనిషదృషులచే కల్పింపబడిన యాధ్యాత్మిక క్షేత్రమున వైరాగ్యబంధురమైన వాతావరణమున బుద్ధ ధర్మ వృక్షము జనించి వికాసమందినదని నిరూపించిరి.

ఎడ్మండు హోమ్సు (Edmund Holmes,the author of The creed of Buddha),జార్జి గ్రిమ్ (George grrimm, the author of the Doctrine of the Buddha) మొదలైనవారు కొందఱీ సత్యమును నిరూపించిరి. ఎడ్మండు హోమ్సు తన గ్రంథమున(The creed of Buddha)"A Misreading of Buddha" అను నైదవ యధ్యాయమున నిట్లు వ్రాసెను:

"Those who have followed me thus far will, I think, admit that Buddha's Scheme of life coincides, at all its vital points, with the Scheme that I worked out by drawing practical deductions from the master ideas of that deeply spiritual philosophy which found its highest expression in the Upanishads. (The creed of Buddha–page 98).

ఉపనిషత్తుల యందలి మహోన్నతాధ్యాత్మిక భావములతో బుద్ధుని జీవితమునందలి ప్రధానాంశము లన్నియు సరిపోలునని పై దాని భావము.

## ఉపనిషన్మహర్షుల నిస్సంశయ జ్ఞానదర్శనము

నిర్వాణమును బొందిన ముక్తుని స్థితిని గుఱించి బుద్ధుడు మౌనమును వహించెను. కాని, యుపనిషదృషులు మనో వాక్కుల కతీతమైన యా స్థితిని మనోహర భాషలో వర్ణించిరి. పరమార్థ మింద్రియాదుల కతీతమని వారు చెప్పినను దాని సత్యస్థితిని విశదముగ సంశయ రహితముగ వారు బోధించిరి.

నైవ వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే.
అస్తీత్యేవోపలబ్ధవ్య స్తత్త్వ భావేన చోభయోః
అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి.
యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృదిశ్రితాః
అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే.
యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః
అథ మర్త్యోఽమృతో భవత్యేతా వదను శాసనమ్॥
(కఠోపనిషత్తు 6 వ వల్లి-12,13,14,15).

పరమార్థము (బ్రహ్మము) అస్తిత్వ నాస్తిత్వ భావముల రెంటిలోను తత్త్వభావముచేత "అస్తి ఇతి ఏవ" ఉన్నదనియే పొందదగినది. "అస్తి" యని నిర్ణయము పొందినవారికే తత్త్వభావము ప్రసన్నమగుచున్నది.

ఎప్పుడు హృదయమందలి సర్వ కామములు వదలి పోవునో యప్పుడే మరణ ధర్ముడగు మానవు డమృతుడగుచున్నాడు. (ఇచ్చట శంకరు డిట్లు వ్రాసెను: "ఇహైవ ప్రదీప

నిర్వాణ వత్సర్వ బంధోపశమనాద్బ్రహ్మ సమశ్నుతే బ్రహ్మైవ భవతీత్యర్థః”. చల్లారిపోవు ప్రదీపమువలె సర్వ బంధములు నశించి పోవుటచేత మానవుడు బ్రహ్మమే యగుచున్నాడు.)

ఎప్పుడు ముడులవలె (గంథులవలె) దృఢ బంధన రూపములైన యవిద్యాదులన్నియు పూర్ణముగ నశించునో అపుడే మర్త్య డమృతుడగుచున్నాడు. ఇదియే అనుశాసనము (ఉపదేశము) అని యుపనిషత్తు ప్రబోధించినది.

బుద్ధుడు దానిని వర్ణింపక పరమార్థమును (నిర్వాణమును) పొందు మార్గమును మాత్రమే బోధించెను. ఆయన బోధయంతయు దృశ్య పదార్థములను, వాని యనిత్యతా దుఃఖ, విపరిణామ ధర్మముల గుఱించియే. సముదయ ధర్మము గల వానిని నిరోధించి సహజమైన నిర్వాణ మందుటయే యాయన యనుశాసనము.

“యేధర్మా హేతుప్రభవా హేతుస్తేషాం తథాగతో హ్యవదత్ తేషాంచ యో, నిరోధ ఏవం వాదీ మహాశ్రమణః” అను నదియే యాయన బోధసారము.

ఇక అనాత్మ లక్షణ సూత్రమునందలి యాయన యనాత్మ వాదమును పరిశీలింతము.

# అనత్త లక్ఖణ సుత్తము

## (అనాత్మ లక్షణ సూత్రసారము)

---

### బుద్ధుని యనాత్మ పదార్థ వివేకము

ఈ యనుశాసనమును ధర్మచక్ర ప్రవర్తము జరిగిన మైదవనాడు భగవంతుడు తన ప్రథమ శిష్యుల కొనరించెను.

గౌతముడు:–భిక్షువులారా! రూప మనిత్యమా, నిత్యమా?

భిక్షువులు:–భగవంతుడా! అది యనిత్యము.

గౌ:–అనిత్యమైనది దుఃఖమా, సుఖమా?

భి:–దుఃఖము.

గౌ:–అనిత్యమును, విపరిణామ ధర్మము (మారు స్వభావము) నగు రూపమును "ఇది నాది, ఇది నేను, ఇది నా యాత్మ" యని తలంచుట మంచిదా? (ఏతం మమ, ఏసోహం అస్మి, ఏసో మే అత్తాతి).

భి:–మంచిది కాదు,

గౌ:–వేదన నిత్యమా అనిత్యమా?...సంజ్ఞ నిత్యమా అనిత్యమా?...సంస్కారములు నిత్యములా యనిత్యములా?... విజ్ఞానము నిత్యమా అనిత్యమా?...కావున భిక్షువులారా! అతీతానాగత వర్తమానములును, బాహ్యాంతరములును, స్థూల సూక్ష్మములును, ఉచ్చనీచములును దూరసాంతిక

ములునైన రూపము లన్నియును సమక్ప్రజ్ఞవలన యథా భూతముగ (ఉన్నదున్నట్లుగా) గాంచి, రూపము నాది కాదు, ఇది నేను కాదు, ఇది నా యాత్మ కాదని తెలిసికొనవలయును. (న ఏతం మమ, న ఏసోఽహం అస్మి, నమేసో అత్తాతి ఏవం ఏతం యథాభూతం...) అటులనే యతీతానాగత వర్తమాన ములును, బాహ్యాంతరములును, స్థూల సూక్ష్మములును, ఉచ్ఛ నీచములును దూర సాంతికములునైన వేదన, సంజ్ఞ, సంస్కార ములు, విజ్ఞానమును వేరువేరుగా యథాభూతముగ సమ్యక్ప్రజ్ఞచే గాంచి, ఇది నాదిగాదు, ఇది నేనుగాదు, ఇది నా యాత్మగాదని తెలిసికొనవలయును.

అట్లు చూచి శ్రుతవంతుడైన యార్యశ్రావకుడు (ఐన సాధకుడు) రూప వేదన సంజ్ఞా సంస్కార విజ్ఞానములను పంచస్కంధముల యందు (నామ రూపముల యందు) నిర్వేదమును పొంది (నిబ్బిందతి) వానియందు వైరాగ్యమును బొందును (విరజ్జతి). అందున నతడు ముక్తుడగును. నేను విముక్తుడనని యాతడు జ్ఞానమును బొందును (విముత్తం ఇతి ఞానం హోతి). అతనికి పునర్భవ ముండదు (ఖీ న జాతి). పవిత్ర జీవనము జీవింపబడినది (వుసితం బ్రహ్మచరియం). కృత కృత్యత లభించినది. (కతం కరణీయం). ఇచ్చట నాదేదియును లేదని యాతడు తెలిసికొనును. ఇదియే అనత్త లక్ఖణ సుత్త [అనాత్మ లక్షణ సూత్ర] సారము.

["శ్రావకులారా! మీది కాని దానిని మీరు విసర్జింప వలయును. రూప వేదనాదులు మీరు కాదు. కాన వానిని విసర్జింపవలయును. ఈ జేత వనమున నున్న తృణజాతమును,

వృక్షశాఖలను, పర్ణసముదాయమును ఎవరైన కాల్చివేసినను, లేక స్వీయ ప్రయోజనము కొఱకు గొనిపోయినను, మనలను దహించుచున్నాడు, తీసికొని పోవుచున్నాడను భావము కలుగునా?"

కలుగదని శిష్యుల సమాధానము.

"ఎందుకు కలుగకూడదు?"

"అవి మనము కాదు, మన ఆత్మకు సంబంధించినవి కాదు."

"అటులనే స్కంధములును మీరు కాదు. అవి మీ ఆత్మ కాదు. కాన వానిని విసర్జింపుడు (మజ్ఝిమ నికాయము).

ఈ బోధవలన తాను నివసించు జేతవనము నందలి వృక్షాదులకును తనకునుగల సంబంధము వంటిదే స్కంధములకును నిజమైన ఆత్మకును కల సంబంధమని బుద్ధుని యాశయమని విశదమగు చున్నది.]

ఇందు భగవంతుడు నేతి నేతియను యుపనిషన్మార్గము ననే యనిత్యములును దుఃఖరూపమును విపరిణామ ధర్మములు నైన యనాత్మ పదార్థములను నిరసించెను.

## శ్రీ కృష్ణ భగవానుని యోగపథము

భగవంతుని మధ్యమార్గము శ్రీ కృష్ణ పురుషోత్తముని యోగమార్గము వంటిదే.

నాత్యశ్న తస్తు యోగోస్తి
నచైకాంత మనశ్నతః
నచాతి స్వప్న శీలస్య

జాగ్రతో నైవ చార్జున।
యుక్తాహార విహారస్య, యుక్త చేష్టస్య కర్మసు,
యుక్త స్వప్నావ బోధస్య, యోగోభవతి దుఃఖహా

(గీత 6-16-17)

మిక్కుటముగ భుజించువానికిని, యట్లే నేమియు తినని వానికిని గూడ సమాధి కుదరదు. అధికముగ నిద్రించు వానికిని, అట్లే నిద్ర యేమియు లేక మేలుకొనియుండు వానికిని గూడ గూడ నిది లభింపదు. యుక్తమైన యాహార విహారములు గల యుక్త స్వప్నా బోధములు (నిద్రా జాగరణములు) గలవానికి మాత్రమే సర్వ సంసార దుఃఖము క్షయింప జేయు యోగము లభించుచున్నది అని గీతాను శాసనము. ఇదియే తథాగతుని మధ్యమ మార్గము. శీలప్రతిష్ఠ నిర్వాణదాయిని యని యష్టాంగ మార్గముపదేశింపబడినది. ఉపనిష దృషి యును నట్లే యుపదేశించెను.

నా విరతో దుశ్చరితా న్నా శాంతో నా సమాహితః
నాశాంతమనసో వాఽపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్॥

(కఠ-2 వ వల్లి-24)

పాపాచరణమును విరమింపని వాడును; నింద్రియ లౌల్యమువలన నశాంతుడును, నేకాగ్రచిత్త రహితుడు (విక్షిప్త మనస్కుడు)ను, వ్యాపృతచిత్తుడై (బహు విషయముల యందు వ్యాప్తమైన చిత్తముగలవాడై) యశాంత మానసుడైన వాడును బ్రహ్మమును బొందజాలరు. ప్రజ్ఞానము (బ్రహ్మజ్ఞానము) వలననే యాత్మ ప్రాప్తి గలుగునని దాని భావము.

## చతుస్సత్యములు; మహర్షుల యుపదేశములు

బుద్ధుని చతురార్య సత్యములు పూర్వ మహర్షులచే బోధింపబడినవే. కపిల మహర్షి ప్రపంచము దుఃఖమని, త్రివిధ దుఃఖాత్యంత నివృత్తి కొరకే సాంఖ్య దర్శనము ననుగ్రహించెను. శ్రీ కృష్ణ భగవానుడు "అనిత్య మసుఖం లోకమ్" అని గీతయందుపదేశించెను. బ్రహ్మము నెఱుగనంతవరకు మానవుల జీవితము దుఃఖమని యుపనిషత్తులు బోధించును.

దుఃఖ సముదయము లేక తృష్ణ విషయానందముల నన్వేషింప జేయుచు జన్మకారిణి యగుచున్నది యన్న బుద్ధుని ద్వితీయార్య సత్య ముపనిషత్సిద్ధాంత సమ్మతమే. అవిద్యా కామములు భవకారణముగా నుపనిషత్తులు వర్ణించును.

తృష్ణను సమూలముగ తొలిగింపవలయును గాన మూడవ యార్యసత్యమగు దుఃఖ నిరోధమును బుద్ధుడు బోధించెను. దీనివలన దుఃఖ విముక్తి సాధ్యమని తెలియును. నాల్గవ యార్యసత్యమగు నష్టాంగమార్గము (దుఃఖ నిరోధ గామిని) శీల శిక్షణమును (సమ్యగ్వచనము, సమ్యక్కర్మ, సమ్యగా జీవము), చిత్త శిక్షణమును (సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి), ప్రజ్ఞా శిక్షణమును(సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము) ప్రధానములుగా బోధించుట చేత నిది బుద్ధుని సారభూతమైన యనుశాసనమని విశదమగుచున్నది.

### బోధ సమన్వయము

అట్టి శిక్షణ యుపనిషత్సమ్మతమే.

సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్

అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యతి యతయః క్షీణదోషాః॥
............జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్వ
తతస్తుతం పశ్యతే నిష్కలం ధ్యాయమానః

(ముండక - 1 - 5 - 8).

దోషములను క్షీణింపజేసిన మహాత్ములు సత్యము చేతను తపస్సు చేతను (మనసశ్చేంద్రియాణాంచ హ్యేకాగ్రం పరమం తపః. మనస్సును నింద్రియములను నేకాగ్రమొనరించుటయే తపము) సమ్యక్ జ్ఞానము చేతను బ్రహ్మ చర్యము చేతను తమ హృదయములయందే జ్యోతిర్మయమును శుభ్రమునునైన పరమాత్మను గాంతురు.

ఈ శ్రుతి వాక్యమునే యష్టాంగమార్గము వివరించుచున్నది. ఇందలి సత్య తపస్సమ్యక్ జ్ఞాన బ్రహ్మచర్యములలో నష్టాంగ మార్గమంతయు గర్భితమై యున్నది. సత్యబ్రహ్మచర్యములు శీల శిక్షణమును, తపము చిత్త శిక్షణమును, సమ్యక్ జ్ఞానము ప్రజ్ఞాశిక్షణమును ప్రబోధించుచున్నవి.

## ప్రతీత్య సముత్పాదము

పంచస్కంధములను (నామ రూపములను) నాత్మగా భావించి మానవుడు కార్యకారణ రూపమైన భవచక్రమున తగుల్కొనును. దీనినే బుద్ధుడు ప్రతీత్యసముత్పాదమని చెప్పెను. 1. అవిద్యనుండి 2. సంస్కారములు, సంస్కారము నుండి 3. విజ్ఞానము, విజ్ఞానము నుండి 4. నామరూపములు, నామరూపముల నుండి 5. షడాయతనములు (పంచేంద్రియములు, మనస్సు), వాని నుండి 6. స్పర్శ, స్పర్శనుండి 7. వేదన,

వేదన నుండి 8. తృష్ణ, తృష్ణ నుండి 9. యుపాదానము (సూక్ష్మ పంచస్కంధములు), దానినుండి 10. భవము, భవము నుండి 11. జాతి (పునర్భవము), దాని నుండి 12. జరామరణ ములు—ఈ పండ్రెండును కారణ ధర్మము నందలి "లింకులు". ఒకటి మరొకదానికి కారణము.

పూర్వ జన్మము నందలి యవిద్య (పరమ సత్యమైన నిర్వాణము నెఱుగకుండుట) వలన శుభాశుభ కర్మల జేసి వాని వలన కొన్ని సంస్కారములను (మనోవృత్తు లను) మానవుడు పొందును.

ఈ సంస్కారములే పునర్జన్మ కారణిమైన విజ్ఞానము కలిగించును. ప్రస్తుత జన్మమిా విజ్ఞానముతో మాతృ గర్భమునుండి ప్రారంభమగును. విజ్ఞానమనగా పునర్జన్మకారిణి యైన మనోవృత్తి రూపమని యర్థము. దీనినే ప్రతి సంధి విజ్ఞానమందురు. ఈ విజ్ఞాన రూపమైన మానసవృత్తి నామ మును (వేదన, సంజ్ఞా సంస్కారములను, పంచేంద్రియ విజ్ఞాన మును) కలిగించును.

'నం' అనగా వంగుటయని యర్థము. మనసును విష యార్థమై వంచునది నామమని బౌద్ధుల యర్థము. దానివలన విషయానుభవమునకు సాధనమైన రూపము గలుగును. అనగా మాంస రక్తాస్థిమయమైన శరీరము గలుగుచున్నది.

మాతృ గర్భమునుండి యీా నామరూపమయమైన శరీరము వెలువడి షడాయతనములను (పంచేంద్రియములు,

మనస్సు) వికాసమందించు కొనును. ఈ యారు యింద్రియములు మరల బాహ్య విషయ స్పర్శను బొంది సుఖదుఃఖాత్మకమైన వేదనను (Fe elings) బొందును. వేదన తృష్ణను గలిగించును. తృష్ణవలన వ్యక్తి, విషయ సుఖానందముల నన్వేషించుచు వాని ననుభవింపగోరును.

## భవ చక్రము

తృష్ణ కామతృష్ణ, భవతృష్ణ (పునర్జన్మకాంక్ష), విభవతృష్ణ * (స్వర్గకాంక్ష) యని త్రివిధము. దీనివలన ప్రస్తుత జన్మాంతమున కామ, రూప (భూలోకము) అరూప (స్వర్గలోకము)లోకములలో మరల జన్మింపవలయునన్న కాంక్ష గలుగును.

అదియే యుపాదానము గలిగించును(Strong attach_ment లేక సూక్ష్మ పంచస్కంధములు). దీనివలన భవము (Desire for re-existence) గలుగును. అందున జాతి (పునర్జన్మము) కలుగును. దానివలన జరామరణము గలుగును. మరల నవిద్యవలన భవచక్రమిటుల నిర్విరామముగ పరిభ్రమించుచునే యుండును. ఇందలి ధర్మములన్నియు కార్యకారణ భావముగలవి. ఈ పండ్రెండు "లింకుల"లో మధ్యనున్న యెనిమిది (విజ్ఞానమునుండి భవము వరకు) ప్రస్తుత

* విభవతృష్ణ యనగా కొందఱు End of one's existence అని అనువదించిరి. భవతృష్ణ శాశ్వతవాదుల తత్త్వమును, విభవతృష్ణ ఉచ్ఛేదవాదుల తత్త్వమును తెలియజేయునని కొందఱి వివరణ.

జీవిత దశలను వివరించును. మొదటి రెండును (అవిద్యా సంస్కారములు) పూర్వ జన్మమునకు సంబంధించినవి.

కడపటి రెండును జాతి (జరామరణములు) పునర్జన్మమునకు సంబంధించినవని బౌద్ధుల యభిప్రాయము.

అవిద్యను నిశ్శేషముగ నిరోధించుట వలన తక్కిన వన్నియు నిరోధింపబడును. నిర్వాణము లభించును. అవిద్యా నాశనమున బ్రహ్మైక్యము లభించునని ఉపనిషత్తులు తెలుపుచున్నవి.

## అతీతవిషయ చర్చ నిరుపయోగము

మాలుంక్యపుత్త్రుడను పరివ్రాజకుని బుద్ధుడతీత విషయములను గురించి చర్చించుట నిరుపయోగమని మందలించెను. (మజ్ఝిమ నికాయము–63 వ సూత్రము.)

అట్టి వాదములు పరమ జ్ఞానమునకు సంబంధించినవి కావు. అవి నిర్వాణ ప్రదములు గావు. ఉత్తమ జీవనమునకు (బ్రహ్మ చర్యమునకు) సంబంధించినవి గావు. తాను చెప్పని వానిని గురించి ఊహాగానములు చేయుట నిరర్థకమనియు, తాను దుఃఖమును, దుఃఖ సముదయమును, దుఃఖ నిరోధమును, దుఃఖ నిరోధగామినియైన మార్గమును గురించి మాత్రమే బోధించెననియు, తన్మార్గమున పయనించి నిర్వాణమును బొందవలయుననియు బుద్ధుడా పరివ్రాజకుని కఠినముగ మందలించెను.

## కేనోపనిషదృషి

కేనోపనిషన్మహర్షి సైతము పరమార్థ వర్ణనము చేయుట సాధ్యముగాదని తెలిపెను.

న తత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనః
న విద్మో నవిజానీమో యథై తదను శిష్యాత్
అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి,
ఇతి శుశ్రుమ పూర్వేషాం యే నస్తద్వ్యాచ చక్షిరే
యన్మన సా నమనుతే యేనాహుర్మనో మతం
త దేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే
(కేన-ప్రధమ ఖండః-3-4-6)

చూపు అచ్చట (పరబ్రహ్మమున) ప్రసరింపదు. వాక్కునకును మనస్సునకును నందు ప్రవేశము లేదు. ఏ ప్రకారమీ యాత్మ విద్యను శిష్యుల కుపదేశింపవలయునో మాకు తెలియుట లేదు. జాతి గుణ క్రియా విశేషణములచేత నింద్రియ గోచరమైన దానిని గురించి మాత్రమే మన మితరుల కుపదేశింపగలము. ప్రత్యక్షాది ప్రమాణములచే మనకు తెలిసిన దానికంటె నది (బ్రహ్మము) పూర్తిగ భిన్నమైనది. తెలియని దానికంటెను (అవిదితము) గూడ నది భిన్నమే (అతీతమైనది). ఇట్లు మేము పూర్వాచార్యులవలన వింటిమి.

ఏది మనస్సుతో సంకల్పించుట లేదో మనస్సే దేని ప్రభావము వలన సంకల్పించుచున్నదో అదియే పరమాత్మ (బ్రహ్మము) యని తెలిసికొనుము. ప్రజ లుపాసించునది

బ్రహ్మము గాదు. బ్రహ్మమింద్రియ గమ్యముగాదు. బ్రహ్మము వలననే చక్షురా దీంద్రియములు చైతన్యవంతములై వాని వాని కార్యములు చేయుచున్నవి.

ఆ యుపనిష న్మహర్షి వలెనే బుద్ధుడు ప్రజలాత్మగా భావించునది దుఃఖరూపములును ననిత్యములైన పంచస్కంధ ముల (నామరూపముల) నేయని యట్టి యాత్మభావమును ఖండించెను.

## వ్యావహారి కాత్మ

పంచస్కంధముల వలన జనించిన యహంస్ఫూర్తి యాత్మకాదు. అది వృత్తిమయము గావున క్షణిక స్వభావ మైనది. మనమంతర్ముఖులమై కొంత సేపాత్మను వెదుకుటకు ప్రయత్నించిన మనకు భావములును, నూహలును, నుద్రేకము లును, కాంక్షలును మాత్రమే గోచరించును. ఆత్మ గోచరిం పదు. నిరంతరము ప్రవాహరూపమున బరుగిడుచున్న భావ సముచ్చయమునే (పంచస్కంధములనే) మానవు డాత్మగా భావించుచున్నాడు. ఈ నామరూపములు (మనశ్శరీరములు) నిత్య పరిణామ శీలములు. మనలో నొకదానివెంట మరియొక టిగా తెంపులేకుండ వచ్చుచున్న వృత్తిజాలమే వ్యవహారము నందాత్మగా భావింపబడుచున్నది. (Emperical self or Psycho Pyhisical self). ఇది సత్యమైన యాత్మ గాదనియే బుద్ధుడు తెల్పెను.

సత్యమైన యాత్మ యవ్యవహారమైనది. అది యప్ర తీత్య సముత్పన్నము. సముదయ ధర్మము కలదిగాదు.

## యాజ్ఞవల్క్యుని పరమాత్మ వర్ణనము

బృహదారణ్యకోపనిషత్తున షష్ఠాధ్యాయము, పంచమ బ్రాహ్మణమునందలి మైత్రేయీ యాజ్ఞవల్క్యుల సంభాషణ మును పరిశీలింతము. తన ప్రియసతీమణియైన మైత్రేయితో యాజ్ఞవల్క్యు డిట్లనెను:

"సయథా సైన్ధవ ఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరేఽహ మాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘన ఏవై తేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి నప్రేత్య సంజ్ఞాస్తీత్యరే బ్రవీమీతి హోవాచ యాజ్ఞవల్క్యః.

సహోవాచ మైత్రేయ్యత్రైవ మా భగవాన్ మోహాన్త మాపీ పిపన్నవా అహమిమం విజానామీతి. సహో వాచ నవా అరేఽహం మోహం బ్రవీమ్య వినాశీ వా అరేఽ య మాత్మాఽనుచ్ఛిత్తి ధర్మా.

యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం జిఘ్రతి, తదితర ఇతరం రసయతే, తదితర ఇతర మభివదతి, తదితర ఇతరం శృణోతి, తదితర ఇతరం మనుతే, తదితర ఇతరం స్పృశతి, తదితర ఇతరం విజానాతి. యత్ర త్వస్య సర్వ మాత్మైవాఽభూత్తత్కేన కం పశ్యేత్త త్కేన కంజిఘ్రేత్తత్కేన కం రసయేత్తత్కేన కమభివదేత్త

తేన కం శ్రుణుయాత్తత్కేన కం మన్వీత తత్కేనకం స్పృశేత్తత్కేన కం విజానీయాద్యేనేదం సర్వం విజానాతి తం కేన విజానీయాత్స ఏష నేతి నేత్యాత్మాఽగృహ్యో నహి గృహ్యతేఽశీర్యో నహి శీర్యతేఽసఙ్గో నహి సజ్యతేఽసితో నవ్యథతే నరిష్యతి విజ్ఞాతార మరే కేన విజానీయాదిత్యుక్తాను శాసనాసి మైత్రేయ్యే తావదరే ఖల్వమృతత్వమితి హోక్త్వా యాజ్ఞవల్క్యో విజహార.

(బృహదారణ్యకోపనిషత్ - పంచమ బ్రాహ్మణం 13-14-15).

## పరమాత్మ ప్రజ్ఞాన ఘనము

ఉప్పునందు బాహ్యాంతరములు లేవు. ఉప్పంతయు నేక రసఘనము. అట్లే యాత్మయు బాహ్యాంతరములులేని ప్రజ్ఞాన ఘనము. ఈ వ్యక్తి యీ పంచభూతములనుండి లేచి యనగా తత్తాదాత్మ్యాధ్యాసములను పరిత్యజించి వానితో మరల నశించి పోవును. మరణించిన తరువాత సంజ్ఞ యుండదు. అనగా, పంచభూతముల నాశముతో జ్ఞానికి ప్రత్యేకమైన భిన్నత నశించిపోవును. ఏకత్వమందిన తరువాత (ప్రజ్ఞాన ఘనరూప మైన తరువాత) యీ యాత్మకు సంజ్ఞ యుండదు.

మైత్రేయికి అది యర్థము కాలేదు. విజ్ఞాన ఘనమైన యాత్మకు విజ్ఞాన శూన్యత్వమెట్లు? అనంతమైన యాత్మకు నాశనమెట్లు సంభవించునని యామె తలంచెను.

## మైత్రేయీ సంశయము

"ఇచ్చట నాకు మోహము (భ్రాంతి)ని కలిగించు చున్నారు. ఇది నాకు తెలియుటలే"దని యామె యాజ్ఞవల్క్యు నడిగినది.

నేను మోహమును వచించుటలేదు. పంచభూతముల నుంచి 'సముత్థాయ' (లేచి) అనగా వానితో తాదాత్మ్యమును నధ్యాసను పరిత్యజించిన జ్ఞాని, కార్యకరణ సంఘాతాత్మకములైన భూతముల నాశనముతో తన యుపాధిని నశించి పోవుటచే ప్రత్యేకమైన భిన్నతను గోల్పోవును. నశించుననగా నదర్శనమును బొందునని భావము. మోహమేమియును లేదు. ఈ యాత్మ యవినాశి; యనుచ్ఛేద ధర్మముగలది.

## యాజ్ఞవల్క్యుని యనుశాసనము

ఎచ్చట ద్వైతముండునో (రెండు పదార్థములుండునో) యచట నొకటి మరొకదానిని జూచును. ఒకటి మరొక దాని నాఘ్రాణించును. ఒకటి మరొకదాని నాస్వాదించును. ఒకటి మరొకదానితో భాషించును. ఒకటి మరొకదానిని వినును. ఒకటి మరొక దానినిగూర్చి యాలోచించును. ఒకటి మరొక దానిని స్పృశించును. ఒకటి మరొకదానిని దెలిసికొనును.

సర్వము నాత్మమైనపుడు దేనిచేత దేనిని చూచును; దేనిచేత దేని నాఘ్రాణించును; దేనిచేత దేని నాస్వాదించును; దేనిచేత దేనితో భాషించును; దేనిచేత దేనిని వినును; దేని

చేత దేని నాలోచించును; దేనిచేత దేనిని స్పృశించును; దేని చేత దేనిని తెలిసికొనును; దేనిచేత నీ సర్వమెఱుగబడుచున్నదో దానిని దేనిచే నెఱుగవలయును? ఆత్మ ఇదికా దిదికాదు (నేతి నేతి). అది యగృహ్యము, అది యశీర్యముగాన నశింపదు. అసంగముగావున బద్ధముగాదు; అది యవ్యధితము. సర్వము నెఱుగు నాత్మను (విజ్ఞాతను) దేనిచే నెఱుగవలయును? మైత్రేయీ! యీ యనుశాసనము (ఉపదేశము) నీకు చెప్పబడినది. ఇదియే 'యమృతత్వ'మని చెప్పి యాజ్ఞవల్క్యుడు వెడలి పోయెను.

## బుద్ధుని పరమార్థ వర్ణనము

బుద్ధుని యుపదేశమును అట్టిదియే. పంచస్కంధముల యందు తాదాత్మ్యమును నధ్యాసను పరిత్యజింపవలయునని, సత్యాత్మ స్థితియే నిర్వాణమని యాయన బోధ. నిర్వాణమును గుఱించి యాయనయే యొకప్పుడిట్లు మౌనమును విడిచి వర్ణించెను:

**అత్థి భిక్ఖవే అజాతం అభూతం అకతం అసంఖతం నో చేద్ భిక్ఖవే అభవిస్స అజాతం అభూతం అకతం అసంఖతం న ఇద జాతస్స భూతస్స కతస్స సంఖతస్స నిస్సరణం పఞ్ఞాయాం, యస్మాచ ఖో భిక్ఖవే అత్థి అజాతం అభూతం, అకతం అసంఖతం తస్మా జాతిస్స భూతస్స కతస్స సంఖతస్స నిస్సరణం పఞ్ఞాయాతి. (ఉదాన గ్రంథము 8 వర్గం).**

భిక్షువులారా! అజాతమును (పుట్టనిదియును) నభూతమును నకృతమును (చేయబడనిదియును) నసంఘాతము నైనది

యొక్కటున్నది అజాతము నభూతము నకృతము నసంఘాతము నైన యట్టి వస్తువే లేకున్నచో జాతమును భూతమును కృతమును సంఘాతమునైన దాని నుండి (జీవికి) తమణోపాయమే యుండి యుండెడిది గాదని పర సత్య పదార్థమును బుద్ధుడు వర్ణించినాడు.

## యమకుని యపార్థము

బుద్ధుని కాలముననే యాయన మానమున కపార్థములు వ్యాపించినవి. తథాగతుని బోధ నపార్థము జేసికొని యమకుడను భిక్షువిట్లు తలచెను: "శరీర పతనాంతరము పావనాత్ముడైన భిక్షువు స్కంధనాశముతో బాటు తానును నశించును. మరణానంతర మాతడుండడు." అట్టి యనర్థకారకమైన యభిప్రాయమును బుద్ధుని ప్రియ శిష్యుడైన సారిపుత్తుని యొద్దనే యమకుడు ప్రకటించెను.

## సారిపుత్తోపదేశము

"యమకుడా! పంచస్కంధములు నిత్యములా, యనిత్యములా?" అని సారిపుత్తుడడిగెను.

య:-అవి యనిత్యములు.

సా:-అనిత్యములును దుఃఖ రూపములును, విపరిణామ ధర్మములైన పంచస్కంధములను నావియని, నేనని, నా యాత్మయని భావింప వచ్చునా?

య:-యట్లు భావింపకూడదు.

సా:-ఆగతానాగత వర్తమానములును, బాహ్యాంతరములును స్థూల సూక్ష్మములును నుచ్చనీచములును దూర సాంతికములును నైన పంచస్కంధముల నన్నిటిని నావి కాదు, నేను కాదు, నా యాత్మ కాదని చూడ గల్గుటయే జ్ఞానము. దీనిని గాంచిన యార్యశ్రావకు డనిత్యములును దుఃఖరూపములును విపరిణామ ధర్మములునైన పంచస్కంధములయందు నిర్వేదము బూని విరక్తుడై విముక్తుడగును. తాను ముక్తుడన్న జ్ఞాన మాతనికి గలుగును. ఇక పునర్భవము లేదు. పవిత్ర జీవితము (బ్రహ్మచర్యము) జీవింపబడినది. కృతకృత్యత లభించినది. నిర్వాణ మందిన యర్హాతుడు పంచస్కంధ బద్ధుడు గాడు. కావున యమకుడా! పాపనాత్ముడైన భిక్షువు మరణానంతరము శూన్యమంది నశించు ననుటయే భగవంతుడు బోధించెనని యెట్లు చెప్పితివి?''

యమకుడు పశ్చాత్తప్తుడై యసత్యమును దుష్టమునైన యభిప్రాయమును పరిత్యజించెను. క్షేమాదేవి ప్రసేనజిత్తుకు గల సంశయమును తొలగించుట ముందే చెప్పబడినది.

## ధర్మ విస్మృతి

బుద్ధ భగవానుని యుపదేశమట్లన్ని విధముల నుపనిషన్మహర్షుల యనుత్తమ బోధయే. కాని, తరువాతి బౌద్ధులాయన యనుశాసించిన సద్ధర్మమును విస్మరించి తార్కికబుద్ధులై శీల ప్రజ్ఞా సమాధులను విసర్జించిరి. వారు చతుస్సత్యముల నెఱిగి యష్టాంగ మార్గమున బుద్ధుని జగన్మంగళమైన యనుశాసము ననుసరించి నడిచియుండిన లోకమున

మహాత్ముల కొఱత యుండి యుండెడిది కాదు. దుష్ట భిక్షు లక్షణమైన దుర్భిక్షము వ్యాపించి యుండెడిదిగాదు. సద్ధర్మ దూరులై శూన్యవాదులైన వారిని సత్పథమున నడిపించుటకు సారిపుత్రుని వంటి మహనీయులు లేకపోయిరి. ధర్మభ్రష్టులైన యా బౌద్ధ సన్యాసులవలన దేశమున నవిద్యా వ్యామోహ తమస్సు గాఢముగ వ్యాపించెను.

## పతనము

స్వామి వివేకానందుడు బౌద్ధమత భ్రష్టతను గుఱించి యిట్లు చెప్పెను:

**"The ruin was simply hideous...The most hideous ceremonies, the most horrible, the most obscene books that human hands ever wrote or the human brain ever conceived, the most beastial forms that ever passed under the name of religion, have all been the creation of degraded Buddhism (Lecture on 'Sages of India' complete works VOL III Page 263-264.)**

బౌద్ధమత పతన మతి హేయమైనది. నీచాతి నీచమైన కర్మకాండయు, మానవ హస్తములును మేధయును నెప్పుడును వ్రాయని యూహింపని బీభత్సమును జగుప్సాకరమునునైన గ్రంథములును, మత ధర్మముల పేర నేకాలమునను చెల్లుబడిగాని పాశవిక సంప్రదాయములను భ్రష్టమైన బౌద్ధమతముయొక్క సృష్టియే యని స్వామి భాషణము.

# సత్యమేవ జయతే

ఆ భయంకరమైన ధర్మగ్లానికి భారతాంబ హృదయము కంపించి పోయినది. ధర్మదేవతకు నేత్రములైన సత్యాహింసలు రెండును నశించిపోయినవి. కలి విజృంభించినది. ‘‘ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే’’యన్న యభయ వాణియే మరల శంకర రూపమున (ఏడవ శతాబ్దమున) నావిర్భవించినది.

**సత్యమేవ జయతే నానృతం**
**సత్యేన పంథా వితతో దేవయానః**
**యేనాఽఽక్రమం త్యృషయో హ్యాప్తకామా**
**యత్ర తత్సత్యస్య పరమం నిధానమ్॥** (ముండక శ్రుతి 3-1-6).

సత్యమే జయించును. అసత్యము జయమునందదు. సత్యము చేతనే దేవయాన మార్గము విస్తారమై యున్నది. సత్యముచేత నాప్తకాములైన ఋషులు పరబ్రహ్మప్రాప్తి బొందుచున్నారు. పరమాత్మ సత్యమునకు పరమధామమని శ్రుతి చెప్పుచున్నది.

ఋషులనగా కుహక మాయా శాఠ్యాహంకార దంభానృతములను త్యజించిన సమ్యగ్దర్శన సంపన్నులని శంకరుడే వివరించినాడు.

## బౌద్ధుల మిథ్యాచారము

కుహక మనగా ఇతరులను వంచించు తలపుతో హృదయమున నొకటి యుంచుకొని బయటి కింకొకటి పలుకుట (పరవచన మంతర్యథా గృహీత్వా బహిరన్యథా ప్రకాశనం. ఆనందగిరి టీక). మాయ యనగా మోసగించుట. శాఠ్య మనగా విభవాను సారముగ దాన మొనరింపకుండుట. అహంకార మనగా మిథ్యాభిమానము. దంభ మనగా ధర్మధ్వజిత్వము; ఇతరుల వంచించు కోసము. శిష్ట వేషమును ధరించుట. అనృతమనగా నసత్య భాషణము. శుష్కతర్కములు ముదిరి బౌద్ధుల హృదయ వైశాల్యము నశించెను. అవి లేనివారు మహర్షులు. వారు పరమార్థము విస్మరించి కుహకమాయాశాఠ్యాహంకార దంభానృతశీలురై యసత్య పథవర్తను లైరి కావున వారు నశించిరి.

క్రమముగా వామాచారమను పేరుగల (యధ్యాత్మిక సాధనల పేర నిరంకుశ స్త్రీ సాహచర్యము నంగీకరించు దురాచారము) జుగుప్సావహమైన దుర్నీతి యతిశయించి, బౌద్ధ మతమును నాశన మొనరించెనని వివేకానందుని యభిప్రాయము.

## శంకరుని యాగమనము

బౌద్ధులు నశించినంత మాత్రమున బుద్ధభగవానుని

ఉపదేశము నశింపదు. అది యమృతరూపము. శంకరుడు శాశ్వతమైన యీ యమృత ధర్మమునే పునఃప్రతిష్ఠించినాడు, ఆయన తన భాష్య గ్రంథముల యందు ఖండించినది బౌద్ధుల యసద్ధర్మమును మాత్రమే. ఆది బుద్ధుల బోధకు గలిగిన దురవస్థను భాష్యకారుడు శంకరుడు తొలగించెను.

## అద్భుత బాలుడు

షోడశ వర్షప్రాయుడైన యీ యద్భుత బాలుడు రచించిన గ్రంథములు పరమాద్భుత నిధానములై యీ యుగము నందలి మనీషావంతులకు నాశ్చర్యమును భక్తిని గొలుపుచున్నవి. శంకరుడు వేదములయందు బ్రహ్మ (చతుర్ముఖ బ్రహ్మ) సముడనియు, వేదాంగములైన శిక్షాదులయందు గార్గ్యముని సదృశుడనియు, వేద వేదాంగ కథా తాత్పర్య వివేచనమున దేవగురువైన బృహస్పతి సముడనియు, వేదోక్త కర్మ విజ్ఞానమున జైమినితుల్యుడనియు, వేదతత్త్వ జ్ఞానమున వ్యాస మహర్షి సమానునుడనియు, నవీన వ్యాసునివలె వాణీ విలాస సంయుతుడనియు విద్యారణ్య మహర్షియే వర్ణించినాడు. *

* వేదే బ్రహ్మ సమస్తపంగి నిచయే గార్గ్యోపమస్తత్కథా
తాత్పర్యార్థవివేచనే గురుసమస్తత్కర్మ సంవర్ణనే
ఆసీజ్జైమినిరేవ తద్వచనజ ప్రోద్బోధకందే సమో
వ్యాసేనైవ సమూర్తిమానివ నవో వాణీ విలాసైర్వృతః
(శంకర విజయము 4 వ సర్గము 19)

## బుద్ధునిపై భక్తి

శంకరుడు బుద్ధ భగవానునిట్లు స్తుతించెను:

ధరాబద్ధ పద్మాసన స్థాంఘ్రి యష్టిః
నియమ్యానిలయం న్యస్తనాసాగ్ర దృష్టిః
య ఆస్తే కలౌ యోగినాం చక్రవర్తీ
స బుద్ధః ప్రబుద్ధోస్తు మచ్చిత్తవర్తీ

పద్మాసనస్థుడై ప్రాణ సంచారమును నియమించి, నాసాగ్ర దృష్టియై యోగి చక్రవర్తియై ప్రబుద్ధుడైన బుద్ధ భగవానుడు నా చిత్తమున వర్తించు గాక యని దీని భావము. శంకరునికి బుద్ధభగవానునిపైగల భక్తి గౌరవముల నీ శ్లోకము వివరించుచున్నది.

## సర్వతోముఖమైన ప్రజ్ఞకు పండితుల జోహారులు

శంకర భగవత్పాదుల సర్వతోముఖమైన ప్రజ్ఞను జీవితమును నుపదేశములను మేము వేరొక గ్రంథమున వివరింతుము. ఆ మహాత్ముని సూత్ర భాష్యమును నాంగ్లమున ననువదించిన జార్జి థీబో మహాశయుడు (George Thibaut) శంకరుని యమూల్యమైన సిద్ధాంతము నిట్లు కీర్తించెను:

"The doctrine advocated by Sankara is from a purely philosoplical point of view and

apart from all theological consideration, the most important and interesting one which has arisen on Indian Soil; neither those forms of the Vedanta which diverge from the view represented by Sankara nor any of the non-Vedantic systems can be compared with the so-cald orthodox Vedanta in boldness, depth, and subtlety of speculation." (Vedanta Sutras-Introduction, page XIV).

శంకరుడు ప్రతిపాదించిన సిద్ధాంతము మత విషయ సంబంధ రహితమైన శుద్ధతాత్త్విక దృష్టితో జూచిన, భారత క్షేత్రమున నుదయించిన వానిలో నత్యంత మనోజ్ఞమును ప్రధానమునునైనది.

ఆయన సిద్ధాంతముతో భేదించు నితర వేదాంత సిద్ధాంతములుగాని, వేదాంతేతర సిద్ధాంతములుగాని సూక్ష్మతత్త్వ విచారమునందునను గాంభీర్య ధైర్యముల యందునను శంకరుని సిద్ధాంతమును బోల జాలవు. నవీన భారత తత్త్వజ్ఞ శిరోమణియైన శ్రీ రాధాకృష్ణ పండితుడిట్లు శంకరతత్త్వసిద్ధాంతమును కీర్తించెను:

"His philosophy stands forth complete needing neither a before nor an after." (Indian philo-sophy VOL II Page 446.)

## శంకరుని తత్త్వపరిపూర్ణత

పూర్వాపరయుగ భావములతో సంబంధము లేకుండ గనే శంకరుని తత్త్వము సంపూర్ణ దర్శముగ ప్రకాశించు చున్నది.

శంకరుల తత్త్వవాణీ దివ్యధార సంసార తాపత్రయ సంతప్తులకు విశాల కర్పూర వృష్టి; మోక్షేందిరకు స్వభావ నిర్మలమైన మౌక్తిక హారలతిక; నిరవధికమైన యద్వైతాత్మ సుఖసార సరస్సు నందలి హంసి. శ్రీ శంకరుని దివ్యోక్తిధార మానవుల బుద్ధిని వినిర్మల మొనరించుచు ప్రకాశించుచున్న దని విద్యారణ్య మహర్షి వచించెను,

## అభయ దాయకములు

బుద్ధ భగవానుడును శంకరుడును పరతత్త్వ విజ్ఞాన మున పూర్ణదర్శనముగల మహర్షులు. పరమాత్మయొక్క బోధమూర్తులు. వారి జీవితోపదేశములు మానవ జాతికి శాశ్వతాభయ దాయకములు. రెండువేల అయిదువందల సంవత్సరములు గడచి పోయినను బుద్ధ భగవానుని యుదా రామృతవాణి నేడును వినవచ్చుచునే యున్నది. ఈ యుగ

మున మహనీయులైన శ్రీ రామకృష్ణ వివేకానంద రామతీర్థ గాంధీమహాత్ముల జీవితములలో నా కరుణామయ బోధమూర్తి ప్రకాశించుచునే యున్నాడు.

తతఃపరం బ్రహ్మపరం బృహంతం
యథానికాయం సర్వభూతేషు గూఢం
విశ్వస్యైకం పరివేష్టితార మీశం
తం జ్ఞాత్వాఽమృతా భవంతి.

# బుద్ధదర్శనము

## అనుబంధము
## (ఉపదేశ పుష్పసమాహారము)

---

ధర్మపదము; సుత్తనిపాతము

1. మనోపుబ్బంగమా ధమ్మా మనోసేట్ఠా మనోమయా
మనసాచే పదుట్ఠేన భాసతీవా కరోతివా
తతో’నం దుక్ఖమన్వేతి చక్కంవ’వహతోపదం

సర్వ ధర్మముల యందును మనస్సు వ్యాప్తమై యున్నది. ధర్మాచరణమున మనస్సే ప్రధానమైనది. కర్మలన్నియును మనోమయములే. కావున నెవడైనను దుష్టమైన మనస్సుతో మాటలాడినను, కార్యము లాచరించినను నశ్వాదుల పాదములను రథచక్ర మనుసరించునట్లు దుఃఖము వానిని వెంబడించును.

2. నహి వేరేన వేరాని సమ్మన్తీధ కదాచన
అవేరేన చ సమ్మన్తి ఏస ధమ్మో సనన్తనో.

వైరముచే వైరమెప్పటికిని లోకమున శాంతింపదు. అవైరము (ప్రేమ) చేతనే వైరము శమించును. ఇదియే సనాతనమైన ధర్మము.

3. అప్పమాదో అమత పదం పమాదో మచ్చునో పదం
అప్పమత్తా నమీయన్తి యే పమత్తా యథా మతా।

అప్రమాదమే (నిరంతర జాగరూకతయే) యమృత పదము. ప్రమాదమే (అజాగ్రత్తయే) మృత్యుపదము. అప్రమత్తులు నశించరు. ప్రమత్తులు మృతులే.

4. ఏవం బిసేసతో ఞత్వా అప్పమాదమ్హి పండితా
అప్పమాదే పమోదన్తి అరియానం గోచరే రతా।

అప్రమాదమును (జాగరూకత) నెఱిగిన పండితులు ఆర్యగోచరమైన పవిత్ర మార్గమున నానందించువారై యప్రమత్తులై చరింతురు.

5. దున్నిగ్గహస్స లహునో యత్థ కామ నిపాతినో
చిత్తస్స దమనో సాధు చిత్తం దన్తం సుఖావహం

నిగ్రహించుటకు దుస్సాధ్యమైనదనియును, శీఘ్ర గామియు కామనిపాతియును(తలచిన చోటికి బరువెత్తునది)నగు

చిత్తమును నిగ్రహించుట యుత్తమమైనది. దాన్తమైన చిత్తము సుఖమును గలిగించును.

6. దీఘా జాగరతో రత్తి దీఘం సన్తస్స యోజనం
దీఘో బాలానం సంసారో సద్ధమ్మ అవిజానతం

నిద్రరానివానికి రాత్రి దీర్ఘము. అలసినవానికి యోజన మతి దీర్ఘము. సద్ధర్మమెఱుగని మూర్ఖులకు సంసారము దీర్ఘము.

7. సేలో యథా ఏక ఘనో వాతేన న సమీరతి
ఏవం నిందా పసంసాను పణ్డితో నసమీరతి.

వాయువుచే ఘనమైన పర్వతము చలింపని యట్లు పండితుడు (జ్ఞాని) నిందా ప్రశంసల యందు చలింపడు.

8. రమణీయాని అరణ్ణాని యత్థ నరమతే జనో
వీతరాగా రమిస్సన్తి న తే కామగవేసినో

జనసంచార శూన్యములైన రమణీయారణ్యముల యందు కామార్థరహితులైన వీతరాగు లేకాంత జీవనమున నానందింతురు.

9. యోచ వస్స సతం జీవో దుస్సీలో అసమాహితో
ఏకాహం జీవితం సేయ్యో సీలవన్తస్స ఝాయినో.

దుశ్శీలుడై యసమాహిత చిత్తమున (అశాంత చిత్తమున) శతవత్సరములు జీవించుట కంటె, శీలవంతుడును ధ్యాన నిష్ఠుడునై యొక దినము జీవించుట శ్రేష్ఠము.

10. సబ్బ పాపస్స అకరణం కుసలస్స ఉపసమ్పదా
సచిత్త పరియో దపనం ఏతం బుద్ధానం సాసనం।

ఏ పాపమును జేయకుండుట, కుశల కర్మల (పుణ్య కార్యముల) నాచరించుట, చిత్తమును పరిశుద్ధ మొనరించు కొనుట యనునవియే బుద్ధుల (జ్ఞానుల) శాసనములు (ఆజ్ఞలు).

11. యోచ బుద్ధఞ్చ ధమ్మఞ్చ సఙ్ఘఞ్చ సరణంగతో
చత్తారి అరియ సచ్చాని సమ్మప్పఞ్ఞాయ పస్సతి.

12. దుక్ఖం దుక్ఖ సముప్పాదం దుక్ఖస్స చ అతిక్కమం
అయఞ్చట్ఠ ఙ్గికం మగ్గం దుక్ఖూప సమగామినం

13. ఏతం ఖో సరణం ఖేమం ఏతం సరణ ముత్తమం
ఏతం సరణ మాగమ్మ సబ్బదుక్ఖాప ముచ్చతి

బుద్ధుని (జ్ఞానిని), ధర్మమును, సంఘమును (సత్పురుషుల సంఘమును) శరణుజొచ్చి, యార్య చతుస్సత్యముల (1. దుఃఖ మును, 2. దుఃఖ కారణమును, 3. దుఃఖ నిరోధమును, 4. దుఃఖ నిరోధ గామినియైన యష్టాంగ మార్గమును) నెఱిగినవాడు సర్వ దుఃఖ విముక్తినిగాంచి నిర్వాణమును బొందును.

14. ఆరోగ్య పరమా లాభా సన్తుట్ఠీ పరమం ధనం
విస్సాస పరమాఞాతీ నిబ్బాణం పరమం సుఖం.

ఆరోగ్యమే పరమ లాభము.సంతుష్టియే పరమ ధనము.
విశ్వాసమే పరమ మిత్రము. నిర్వాణమే పరమ సుఖము.

నత్థి రాగ సమో అగ్గి నత్థి దోస సమోగహో.
నత్థి మోహ సమం జాలం నత్థి తణ్హా సమానదీ.

కామమునకు సమానమైన అగ్ని లేదు. ద్వేషమునకు సాటియైన భూతము లేదు. మోహమునకు సమమైన జాలము (వల) లేదు. తృష్ణకు సాటియైన ప్రవాహము లేదు.

15. కామతో జాయతే సోకో కామతే జాయతే భయం
కామతో విప్పముత్తస్స నత్థి సోకో కుతో భయం

కామము వలన శోకము గలుగును. కామము వలన భయము జనించును. కామరహితునకు శోకముండదు. ఇక వానికి భయ మెచ్చట నుండును ?

16. అక్కోధేన జినేకోధం అసాధుం సాధునా జినే
జినే కదరియం దానేన సచ్చేన అలికవాదినం

అక్రోధముచే క్రోధమును, సాధుత్వముచే నసాధుత్వ

మును, దానముచే లోభమును, సత్యముచే నసత్యవాదిని జయింపవలయును.

17. సబ్బే సఙ్ఖారా అనిచ్చా'తి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిందతి దుక్ఖే ఏస మగ్గో విసుద్ధియా
18. సబ్బే సంఙ్ఖారా దుక్ఖా'తి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిందతి దుక్ఖే ఏస మగ్గో విసుద్ధియా.
19. సబ్బే ధమ్మా అనత్తా'తి యదా పఞ్ఞాయ పస్సతి
అథ నిబ్బిందతి దుక్ఖే ఏస మగ్గో విసుద్ధియా.

దృశ్య పదార్థములన్నియు ననిత్యములును దుఃఖములును ననాత్మకములని ప్రజ్ఞచే గాంచినవాడు దుఃఖరూపములైన వాని యందు విరాగమును బొందును. ఇదియే చిత్తశుద్ధికి మార్గము.

20. అవజ్జే వజ్జమతినో వజ్జే చావజ్జ దస్సినో
మిచ్ఛాదిట్ఠి సమాదానా సత్తాగచ్ఛన్తి దుగ్గతిం

అనవద్యము (అదోషము) నందు వద్య బుద్ధియు (దోష బుద్ధియు) వద్యమునందు (దోషమునందు) అవద్య బుద్ధియు గల్గియుండుట మిథ్యా దృష్టి యనబడును. అట్టి దృష్టిగలవారు దుర్గతి పాలగుదురు. కావున సమ్యగ్దృష్టియే సుగతికి మార్గము.

21. అత్తాహి యత్తనో నాథో అత్తాహి అత్తనోగతి
తస్మాసఞ్ఞమ యత్తానం అస్సం భద్దంవ వాణిజో

ఆత్మకు ఆత్మయే ప్రభువు. ఆత్మకు ఆత్మయే గతి. భద్రాశ్వమును వణిజుడు స్వాధీనపఱచుకొనునట్లు మానవుడు ఆత్మ సంయమన మొనరించుకొనవలయును.

అత్త దత్థం పరత్థేన బహునాऽపి నహాపయే
అత్తదత్థ మభిఞ్ఞాయ సదత్థ పసుతోసియా

పరార్థము కొఱకు ఆత్మహితమును నాశనము చేసికొన కూడదు. ఆత్మ హితమును బొందియే సత్య మార్గమున నితరులకు హిత మొనర్పవలయును.

అత్తాహి అత్తనో నాథో కోహినాథో పరోసియా
అత్తానా'వ సుదంతేన నాథం లభతి దుర్లభం.

ఆత్మ కాత్మయే ప్రభువు. ఇతరుడు కాడు. దాంత మైన ఆత్మ దుర్లభుడైన ప్రభువును బడసినట్లే.

22. అవిరుద్ధం విరుద్ధేసు అత్తదండేసు నిబ్బుతం
సాదానేసు అనాదానం తమహం బ్రూమిబ్రాహ్మణం.

విరోధుల మధ్య విరోధ భావ రహితుడును, దండ ధారుల మధ్య దండరహితుడును, పరిగ్రహించు స్వభావము గల వారి మధ్య నిష్పరిగ్రహుడునునైన వానిని నేను బ్రాహ్మణుడందును.

23. న జాచ్చా బ్రాహ్మణో హోతి, న జాచ్చా హోతి
అబ్రాహ్మణో
కమ్మణా బ్రాహ్మణో హోతి కమ్మణా హోతి
అబ్రాహ్మణో
తపేన బ్రహ్మచరియేన సంయమేన దమేన చ
ఏతేన బ్రాహ్మణో హోతి ఏతం బ్రాహ్మణం
ఉత్తమం॥ (సుత్తనిపాతము).

జాతి చేత (జన్మముచేత) నెవడును బ్రాహ్మణుడుగాని యబ్రాహ్మణుడు గాని కాడు; కర్మ చేతనే బ్రాహ్మణుడుగాని యబ్రాహ్మణుడుగాని యగును. తపము చేతను, బ్రహ్మచర్యము చేతను జనుడు బ్రాహ్మణుడగును. ఇట్టి బ్రాహ్మణ్యము త్తమమైనది.

24. కమ్మణా వత్తతి లోకో కమ్మణా వత్తతి పజా
కమ్మ నిబంధనా సత్తా రథస్సాణీవ యాయతో

లోకము కర్మాధీనము. ప్రజలు కర్మాధీనులు. పరిభ్రమించు రథ చక్రము యొక్క ఆణి (ఇరుసు తుదిచీల) వలె జీవులు కర్మ బద్ధులు. (మజ్ఝిమనికాయము).

25. యే సం సన్నిచయోనత్థి యేపరిఞ్ఞాత భోజనా
సుఞ్ఞతో అనిమిత్తో చ విమోక్ఖో యస్సగోచరో
ఆకాసేవ సకున్తానం గతి తేసం దురన్నయా.

ప్రాపంచక వస్తు సంచయము లేనివారును, నాహార శుద్ధిగలవారును (శుద్ధములైన శబ్దాది విషయములను మాత్రమే గ్రహించువారును), విషయ శూన్యమును సముదయ ధర్మము లేని నిర్వాణ పదమును దర్శించు వారును నైన జ్ఞానుల గతి యాకాశమున నెగురు పక్షుల గతివలె దుర్జ్ఞేయమైనది.

— ఓం తత్సత్ —

నమస్సకల సంక్లేశ హారిణే, గుణహారిణే,
నమః సమస్త తత్త్వార్థ బోధినేஉద్వయ వాదినే॥